# చేతిపనులు

## మీ కుపయోగించే వెన్నో ఉన్నాయి

### ప్రతిదీ అతి సులభంగా తయారు చేసుకోవచ్చు

ఈ క్రింద వివరించినవన్నీ అతి చౌకగా, చాల సులభంగా, మీకు మీరే స్వతంగా తయారుచేసుకొనే అతి తేలిక పద్ధతులు "చేతిపనులు" అనే తెలుగు పుస్తకంలో పూర్తిగా ఉన్నాయి ప్రతివారికి సులభంగా అర్థం అయేలా చక్కగా విడమర్చి వ్రాయబడ్డాయి

**పరిమళాలు**

గులాబి అత్తరు
మల్లెల అత్తరు
సంపెంగ అత్తరు
పువ్వుల అత్తర్లు
చలవ నిమ్మనూనె
అగరు నూనె
పువ్వుల నూనెలు
తామరపువ్వు నూనె
నిమ్మపువ్వు నూనె
మల్లెల తలనూనె
మంచి సెంట్లు
పువ్వుల సెంట్లు
గులాబి పన్నీరు
మంచి హేరాయిలు
వేసలైనులు
అగరువత్తులు

**ఆరోగ్య పాకాలు**

ఆకలి పుట్టించేవి
మంచి ఆరోగ్యానికి
రుచి పుట్టించేవి
దప్పి ఆపేవి
పైత్య హరానికి
వాత హరానికి
రక్త వృద్ధికి
మంచి బలానికి
జబ్బు పడివ తేల్చేవి
ఉత్సాహాన్నిచ్చేవి
అశ్వగంధపాకం
రత్నపురుష
మంచి షరత్తులు

**దంతరక్షణ**

చిగుళ్ళ రక్తం కట్టేవి
దుర్వాస వాపేవి
పంటి పోటికి
దంతాల గట్టికి
మంచి పండ్లపొడలు
వివిధ టూత్ పేస్టులు
చిగుళ్ళ బలానికి

**విలాసానికి**

శరీర తేజస్సుకి
శిరోజాలు పెంచేవి
పెదెమల రంగు
శిరోజాల రంగు
మంచి ఫేస్ పౌడర్లు
మంచి స్నోలు
వివిధ సబ్బులు
మంచి సబ్బు
బట్టల సబ్బులు
మొటిమలకు
అందమైన తిలకాలు
శోభి, తామర పోగొట్టేవి
తాంబూల మాత్రలు
అయిస్క్రీంలు
వార్నీషులు
అందాన్నిచ్చేవి
బట్టతలకు
వేడి తగ్గించేవి
మంచి వంట ఒగురు
ఇంట్లో పురుగుల నసింపుకు
పురుగుల కాట్లకు
ముఖ విలాసాని
చర్మ తెలుపుకు
చీమల నల్లుల నంపుకు
కంటకి కాటుకలు
రకరకాల సిరాలు

**దీపావళి సరుకులు**

టపాకాయలు
రవ్వ మతాబులు
ముత్యాల మతాబులు
తెల్ల మతాబులు
పువ్వు వత్తులు
చిచ్చుబుడ్లు
ఎగిరే నక్షత్రాలు
బాణా సంచా

**రోగవిముక్తికి**

శరీర నొప్పులకు
బలహీనతకు
గుండె జబ్బుకు
రక్తపోటుకు
సామాన్య జ్వరం
విష పడిశం
అతిమూత్రం
అజీర్ణానికి
తలనొప్పికి
దుంప నొప్పికి
మూలశంఖకు
కడుపు నొప్పికి
మలబద్ధం
కురుపులకు
కాళ్ళ విషాలకు
మలేరియాకు
నీరసం పోగొట్టేవి
గాయాలు మాన్పేవి
నోటి పూతకు
పాము కాటుకు
తేలు కాటుకు
కీటక కాటుకు
విషాల విరుగుళ్ళు
శరీర పుష్టికి

ఈ పైవన్నీ, యింకా ఎన్నో రకాలు, "చేతి పనులు" అనే తెలుగు పుస్తకంలో సులువుగా చేసుకోనే పద్ధతులున్నాయి వాటికి కావలసినవన్నీ బజారులో సులభంగా దొరికేవే ప్రతిదీ చేసి చూచి వ్రాయబడింది ఇంటింట అతి ముఖ్యంగా ఉండతగిన పుస్తకం మీ నిత్యజీవితాని కుపయోగించేవి ఎన్నో ఉన్నాయి సర్దాకిగాని లాభానికిగాని, స్వంత ఉపయోగానికిగాని, కావలసిన ప్రతిది అతి చౌకగా తయారుచేసుకోవచ్చు రచన ఎ ఎస్ మూర్తి, ఎం ఏ ధర రూ 3–50 హేంగు మరియు పోస్టు ఖర్చులు ఒక రూపాయి ఉచితం అశ్రద్ధ చేస్తే వ్రాయాలనుకుంటూనే మర్చిపోవచ్చు కాబట్టి వెంటనే వ్రాయటం మంచిది ఈ క్రింది ఎడ్రస్సుకు ఉత్తరం వ్రాస్తే వి పి పోస్టుద్వారా మీకూ ఒక పుస్తకం పంపబడును

## దేశసేవ ప్రచురణలు, అశోకనగరు, ఏలూరు, ఆంధ్ర.

SWASTIK

తప్పక

చూడండి!

అంజలీదేవి నటించిన

అలంకార్ చిత్ర [హైద్రాబాద్]

సమర్పించు.....

# నాగదేవత

...దర్శకత్వం:...

శాంతిలాల్ సోని

నిర్మాణం పి. సాంబశివరావు

TARAKA

STUDIO ERANKI

డిస్ట్రిబ్యూటర్స్ ఆంధ్ర: ప్రీమియర్ ఫిలిమ్స్, నైజాం ఉషా ఫిలిమ్స్, రాయలసీమ భాస్కర్ పిక్చర్స్

# ఉత్తరాలు

## ముఖచిత్రం

13—9—63 వ తేదీ సంచిక ముఖచిత్రం నూతన నటి సరస్వతి అన్న పేరును చదివిన తరువాతకానీ తెలియలేదు మేము మొదట బి సరోజాదేవి అని అనుకున్నాం చిత్రం ఆకర్షణీయంగా ఉన్నది ప్రభాకర్ గార్కి మా అభివందనలు

మల్లువలప భవన్నారాయణ
వెంపాడ నాగేశ్వరరావు (కాకినాడ)

## కథలు

"మెరకచేను" కథ పేరు చదివి ఏమిటో అనుకున్నాను కానీ చదివిన తర్వాత కథ క్రొత్త రకముగ నుండి చాల ఆకర్షించినది రచయితగార్కి నా అభినందనలు

కె భార్గవి (తిరుపతి)

* * *

పి గణపతిశాస్త్రిగారు వ్రాసిన శ్రీకృష్ణజననంలో రావుగార్కి పెళ్లి అయిన తరువాత ప్రతి ఏటు అతనికి కలిగినవాళ్లు అయిదుగురు ఆడపిల్లలే అని వ్రాశారు—మరి అలా ఇన్నేళ్లుగా అతని కెంతమంది పిల్లలో

ఎస్ కృష్ణారెడ్డి (హైదరాబాదు)

* * *

శ్రీ ఎ సాంబశివరావుగారి "కాలచక్రం" కథ చాల బావుంది ఐతే, సందర్భం వచ్చిన ప్రతీ చోటా 'మెడికల్' అన్న పద ప్రయోగంతో విసిగెత్తించారు ఆంగ్లవైద్య విద్యను 'మెడిసన్' చదవడం అన్నది పరిపాటి గాని 'మెడికల్' చదవడం అన్నది వినసొంపుగాలేదు

సి ఎస్ రాజ్ (భిలాయ్)

## కార్టూన్

26—7—63 వ తేదీ పత్రికలోని ఒక కార్టూనుగురించి వినాయకచవితి ప్రత్యేక సంచికలో చెరుకుపాడు నుంచి ఒక సోదరి రాసిన విమర్శలో ఆ కార్టూను చాలా అసభ్యంగా(!)ఉందనే అభిప్రాయాన్ని చూసి ఆశ్చర్యపోయాము. ఆ కార్టూను కేవలం వినోదాత్మక దృష్టితో వేసినది కానీ విమర్శనాత్మకంగా వేసినది మాత్రం కాదు! అలాంటి కార్టూనులను చూసినంతనే, కథలను చదివినంతనే అమ్మాయిలంతా మారిపోతారనేది కేవలం ఒక 'అసంభవం' అని మా అభిప్రాయం. ఇంకా అలాంటి అమ్మాయిలుంటే వారు మారి మంచిదారికి రావాలని మా ఉద్దేశం! (అలాటివారున్నారు మాకు తెలిసినంతవరకూ కొంతమంది!) అంతేగానీ 'మంచివారే మారితే ?' అనే ప్రశ్నే రాలే దింతవరకూ మాకు! కార్టూన్ల లక్ష్యం వినోదాన్నందివ్వడమే (ఒక్కోమారు సున్నితమైన విమర్శా ఉండవచ్చు) కానీ అది ఎవరికీ హాని కలిగించలేదు అదీ హాస్యం కోసమే అన్నట్లుంటుంది తమ కన్వయించుకోగల కొంతమంది చెడుదారి నుంచి మంచిదారి పట్టడానికి అవకాశమూ ఉంటుంది

'సత్యం', 'రాజా' ([illegible]) ★

# మెక్లీన్స్

## పళ్లను అతితెల్లగాజేయును అని ఋజువు చూచుకోండి

**1 దానిని తరమండి** జిగటగా అంటుచున్న పొర తగులుచున్నదా? సహజ తెలుపును అది దాచివేయుచున్నది ఇప్పుడు బ్రష్‌తో తోమండి మెక్లీన్స్ ఆ పొరను ఎట్లు పూర్తిగా తొలిగించివేయుచున్నదో చూడండి



**2 దానిని రుచి చూడండి** మీరు సరిగ్గా చవిచూచునట్టి జలదరించే పరిశుభ్రతగల రుచి మెక్లీన్స్‌లోవున్న మూడు చురుకైన పదార్థములు పనిచేయుచున్న వాటకు నిదర్శనం మీ పళ్లను శుభ్రపరచుచున్నవి కాపాడుచున్నవి. తెల్లగా జేయుచున్నవి



**3 దానిని చూడండి** మీ చిరునవ్వుల తెలుపును చూచుటలో మీ కళ్లే మిరిమిట్లు గొలుపును! మెక్లీన్స్ టూత్ పేస్టు మీ పళ్లను ఇంతకు ముందుకంటె ఎక్కువ అతి తెల్లగా జేయును. దీనిని మీరె ఋజువు చూచుకోండ!






మెక్లీన్స్—అతి తెల్లని పళ్లకోసం

MTP/A/P/1/63 TL

ఇంటిల్లిపాదికీ ఆనందం చేకూర్చే
ఆంధ్రసచిత్రవారపత్రిక
తప్పక చదవండి!




సర్వ గర్భాశయ వ్యాధులను పోగొట్టి ఆరోగ్యముగా వంధ్యా దోషమును తొలగించును అన్ని చోట్ల దొరకును. సీసా 2-50

కృష్ణాలేబరేటరీ బెజవాడ







షాండ్రిలా కాస్మెటిక్స్
బెంగుళూరు

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం 27—9—63
శోభకృన్నామ సం॥ ఆశ్వయుజ మాసం॥ శుద్ధ నవమి
సంపుటము 56 సంచిక 4
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా రూ 13 00 ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రు 20 00 (విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ 114 00 అమెరికా రు 176 50 ఆస్ట్రేలియా 135 00)

*

విడిప్రతి 25 న పై
సంవత్సర చందా 13-0-0

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1





పునర్జన్మలో కృష్ణకుమారి

# మనలోమాట

'అమెరికాలో పిల్లల పెంపకం' వ్యాసం రచయిత్రి శ్రీమతి సి రమాదేవి తమ వ్యాసానికి రావలసిన పారితోషికం భారత జాతీయ రక్షణనిధికి ఇవ్వమని మాకు వ్రాశారు దానికి వారిని మాతోబాటు పాఠకులందరూ కూడా అభినందించకుండా ఉండలేరు

*  *  *

ఈవారం 'వంటలు' శీర్షిక క్రింద అత్యంత ప్రజాభిరుచిని చూరగొన్న తినుబండారాలలో రకాలనుగురించిన వ్యాసం వేశాము ఇడ్లీలు సహించని వారు ఉండరు కాబట్టి ఈ వ్యాసం 'సహించని' వారు సయితం ఉండరనే మా నమ్మకం!

*  *  *

త్వరలో ఆంధ్రసచిత్రవారపత్రికలో అతిప్రత్యేకమయిన శీర్షిక ఒకటి ప్రారంభిస్తున్నాము ఈ శీర్షిక 18-10-63 సంచికతో మొదలు అవుతుంది దీనికి సంబంధించిన ప్రకటనలు పై సంచికలో చూడవచ్చును

*  *  *

ప్రస్తుతం మేము నిర్వహిస్తున్న నవల పోటీ ఫలితాలు 25-10-63 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో తెలుస్తాయి మొదటి బహుమతి పొందిన నవల ఆ తేదీ సంచికలో ప్రారంభం కాగలదు 25-10-63 ఆంధ్ర సచిత్ర వారపత్రిక వనితాలోకం ప్రత్యేక సంచికగా కూడా వెలువడుతుంది

# లోకంపోకడ



"హల్లో! నెహ్రూగారేనా? మీ కామరాజ్ పథకం నాకు బాగుందండీ మనలోమాట, కృష్ణమీనన్‌ని మంత్రివర్గంలో వేసుకుంటారా?"

# విషయానుక్రమణిక



17 వ సవరణ
రైతులు
నే చాలా పొడుగ్గా వున్నానుకదూ?
కోటి సంతకాలు
అతణ్ణి కాదు నన్ను వరించు
కాదు నన్ను ప్రేమించు
రష్యా
చైనా
ఇదుగో నండి మీ బిడ్డ
మలయా శియా

శ్రీకృష్ణ

# ఇబ్బందుల్లో ఇరుక్కున్న ఆర్థికమంత్రి: పొదుపు నేర్వాల్సిన ప్రభుత్వం!

మన కొత్త ఆర్థికమంత్రి శ్రీ టి టి కృష్ణమాచారికి కొండంత భారం నెత్తినపడ్డది "1963 సంవత్సరంలో మొదటి మూడు నెలల తర్వాత ఉన్నట్టుండి ధనం విలువ 6½% కు పెరగడంవల్ల, ఇంటర్—బాంక్' మార్కెట్టులో ఆర్థికంగా గడ్డు పరిస్థితులు ఏర్పడ్డాయి కలకత్తా బొంబాయి నగరాల్లోని స్టాక్ మార్కెట్లలో దనం మదుపుపెట్టే స్థాయి పూర్తిగా మాయమైపోయాయి అందువల్ల వ్యాపార పరిస్థితి మందకొడిగా ఉంది జూన్ నెలలో విదేశీ వాణిజ్యంపై ఏర్పరచిన నిర్బంధాలు కూడా పరిస్థితి మెరుగవటానికి అంతంతగానే ఉపయోగించాయి అత్యధిక లాభాలపై పన్ను సూపర్ ప్రాఫిట్ టాక్స్ ఉన్నప్పటికి డివిడెండ్లను నిలుపుకోగల ఏ కొద్ది సంస్థల వాటాలు మినహాగా, చాలావాటి ఈక్విటీ పెట్టుబడులను అశ్రద్ధ చేయటం జరిగింది అని నిష్పక్షికలు అంటున్నారు

ఈ విషయాన్నే ఇంకో రూపంలో కూడా పరిశీలించవచ్చు వివిధ సంస్థలకు మార్కెటులో పెట్టుబడి సంపాదించుకునేందుకు పెట్టుబడుల కంట్రోలర్ అనుమతించినట్లు ప్రతి సోమవారం వార్తలు వస్తూఉంటాయి కొత్త పెట్టుబడులు సంపాదించే విషయంలో ఇది ఎక్కువకాలం అమలులోకి రానేలేదు

పన్నుల విధింపు, ధరలలో పెరుగుదలల పట్ల ఇప్పటికే ప్రజలలో అసంతృప్తి ప్రబలిఉంది ప్రభుత్వం ఇచ్చే అంకెలూ, అంచనలు, ప్రజలను నగ్నసత్యాల నుంచి తిప్పికోవటం చాలా కష్టమైన పని సరే మన ఆర్థికమంత్రికి ఇప్పటి పరిస్థితులలో పన్నుల స్వరూపాలను మార్చటం సాధ్యం కాదు అందువల్ల ధరలను అదుపులోకి తీసుకు వచ్చేందుకు ఏమైన దృఢ చర్యలు తీసుకోటానికి కొంతకాలం పట్టవచ్చు పన్నుల విధివల్ల జీవనం ప్రమాణంకన్న జీవన వ్యయం ఏవిధంగా పెరిగిందనే విషయంపై పరిశీలనలు జరుగుతున్నాయి రక్షణకు కేటాయించిన మొత్తంలో ఈ ఆర్థిక సంవత్సరంలో ఎంత ఖర్చు పెట్టాలనేది ఈలోగా ప్రభుత్వానికి కూడా తెలుస్తుంది అంతేగాకుండా ప్రబలిన ఆర్థికమైన మందకొడితనం, అసంతృప్తి ఈ అత్యవసర పరిస్థితులలో ప్రణాళికలో అత్యవసర విషయేతరమైన వ్యయాలను తగ్గించాల్సిన అవసరాన్ని ప్రభుత్వం తెలుసుకోవాల్సి ఉంటుంది చైనీయులు చేసిన దురాక్రమణ తర్వాత దేశంలో కల్గిన చైతన్యం ప్రజలు ప్రభుత్వం ఊహించినదానికన్న ఎక్కువగానే ప్రణాళికాబద్ధమై రక్షణలు నిర్మించుకోవటంలో ఉత్సాహం చూపుతున్నారనే దానికి నిదర్శనం ఈ ఉత్సాహం చప్పగా చల్లారిపోయిందంటే అందుకు కారణం ఇటు ప్రభుత్వం స్వరూపంలో గాని ప్రణాళికా స్వరూపంలో గాని ఏవిధమైన తగ్గింపు గాని, మంత్రుల దుబారాతనానికి అదుపుగాని లేకపోవటమే

అందువల్లనే కేంద్ర మంత్రిమండలి తగ్గింపు జరుగుతోందంటే చాలా సంతోషించాల్సిన విషయం మంత్రులు సకుటుంబంగా పర్యటనలు సాగించటాన్ని ఆర్థికమంత్రి నిరోధించాలనే సూచనలు వచ్చాయి సాధారణంగా ఉపమంత్రులు పెరిగిన ఈ అలవాటు ఆపితే ధనరూపేణ పెద్ద ఆదాగా కనబడకపోవచ్చు కాని ఈ పద్ధతివల్ల ప్రజల మనస్సులో ఓ సదభిప్రాయం ఏర్పడుతుంది. అలాగే గ్రామీణ రక్షణ దళం, సాంఘిక సేవా సంస్థ (సోషల్ సర్వీస్ బోర్డు), ఆఖరికి ఖద్దరు లాంటి మాయజాలాలపై జరిగే వ్యయంమీద కూడా కాస్త కన్నువేసి ఉండటం అవసరం టారిఫ్ సంఘంతో సంబంధంలేకుండా గత పదిహేనేళ్లుగా ఖాదీ రక్షణ పొందుతున్న విషయం అందరికీ తెలిసిందే

ఆర్థికమంత్రి స్వర్ణ నియంత్రణం, నిర్బంధపు పొదుపు పథకం పరిశీలనకుగాను ఆర్థిక కార్యదర్శుల సంఘాన్ని నియమించటం మంచిపనే అనాలి ఈ సంఘంలో శ్రీయుతులు ఎస్ ఎస్

51 వ పేజీ చూడండి




మనదేశంలో అమెరికా రాయబారిగా నియమితులైన శ్రీ చెస్టర్ బౌల్స్ ఇటీవల మద్రాసు వచ్చారు
మద్రాసులోని అమెరికా కాన్సల్ జనరల్ స్వాగతం చెప్పారు

**రాజధాని కబుర్లు**

# ఆడంబరాల నిలయమైన ఆంధ్రరాజధాని

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినోత్సవం నాడు బాలల దినోత్సవం జరుపుకోవటం ఆచారమయిపోయినట్లే రాష్ట్రపతి డా. రాధాకృష్ణన్ జన్మదినోత్సవం 'ఉపాధ్యాయ దినం' గా, దేశమంతటా పరిగణింపబడుతోంది. ఇదీ సముచితంగానే ఉంది. ఈ సందర్భంగా రెండు రోజులపాటు కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యా శాఖవారు వివిధ పాఠశాలలకు సంబంధించిన ఉపాధ్యాయులు అమితోత్సాహంతో పాల్గొన్నారు. సాంస్కృతిక కార్యక్రమాల్లో కూడా అభిరుచి చూపించడం నటనా కౌశల్యాన్ని ప్రదర్శించటం మెచ్చుకోతగ్గవిగా ఉన్నాయి.

నటనకు సంబంధించిన వివిధ విషయాలమీద ఓ వారం రోజులపాటు గోష్ఠులు జరిగినయి. నాటకాలు అనేకమంది రాస్తున్నారు. అనేక సంఘాలు వేస్తున్నారు. కాని, నాటకాల ఎన్నికలోనూ, ప్రదర్శన విభాగంలోనూ కూడా ప్రామాణికంగా కొన్ని సూత్రాలు ఏవీ కూడా అలవరచుకోవటం లేదనీ ఉత్తమ సాంప్రదాయాల్ని నెలకొల్పాలని సూచనలిచ్చారు. నటనలోనూ, నాట్యరంగంలోనూ 'ప్రత్యేకంగా కృషిచేసిన విద్వాంసులు' తమ తమ అమూల్యాభిప్రాయాలను వెలిబుచ్చారు. ఈ ఏడు రోజుల్లోనూ కూడా ప్రదర్శనలు జరిగినయి. ఏకపాత్రాభినయాలు కూడా ప్రేక్షకులను ఎక్కువగా ఆకర్షించినయి. వాటిల్లో ముఖ్యంగా డాక్టరు చంద్రశేఖరంగారి అభినయాలు, అందరి దృష్టులను ఆకట్టేసినయి. ప్రత్యేకంగా పత్రికా రచయితలకని గూడా వీరు వివిధ పాత్రల రూపాల్లో సాక్షాత్కరించారు. దేశనాయకుల పోలికలు యిట్టే తన మొహంలోకి తెప్పించేసుకుంటారు. మొహంమీద ఒక్క గీతతో ఎన్నో ఏళ్లు వచ్చి పడ్డట్టుగా కనిపిస్తారు. అంతకంటేకూడా విచిత్రం తనంతట తానుగ సాధనచేసి, ఫలాన వ్యక్తిగా కనబడాలని, నిముషాలమీద మొహంతో యిట్టే మార్పులు, కావలసిన ముడతలు తెప్పించగలరు. దూరాన్నుంచి చూస్తుంటే వేషంలో ఉన్న డాక్టర్ చంద్రశేఖరంగారిని, వినోబాభావే అనో, పండిట్ నెహ్రూ అనో క్షణకాలంపాటు భ్రమపడక తప్పదు. ఒక పాత్ర లోంచి ఇంకో పాత్రలోకి నిమిషాలమీద ప్రవేశించగలరు. ఇంత త్వరితగతిన మార్పులు తీసుకురావడం ప్రతి నటునికి సాధ్యంకాదన్న విషయం అతిశయోక్తి ఏమీ కాదు.

దాదాపు అరవయ్యో పడిలో ఉన్న, ఆయనలో ఉబుక్కువస్తున్న ఉత్సాహం యువలోకాన్ని ఉత్సాహపరుస్తూనే ఉంటుంది. ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ కూడా అనేక నాటకాల్లో పాల్గొన్నారు. ఆంధ్రదేశానికి చిరపరిచితులు. వివిధ పట్నాల్లోనూ గ్రామాల్లోనూ తిరుగుతూ రెండున్నర దశాబ్దాల్నుంచీ తన కళానైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ జనబాహుళ్యాన్ని ఆహ్లాదపరుస్తున్నారు. తానొక్కడూ వివిధ పాత్రల్లోనూ లీనమయిన ఏకకాలంలోనే క్షణక్షణానికి మార్పులుతెస్తూ, పుష్కలంగా ఉన్న నటీనట వర్గంతో నాటక ప్రదర్శన జరుగుతున్నట్టు మెప్పించగల నేర్పు, సాహసం, ఓర్పులు చంద్రశేఖరంగారికి పుష్కలంగా ఉన్నయి. చమత్కార మైనవి, హాస్యప్రధానమైనవి చిన్న చిన్న ప్రహసనలు కూడా స్వయంగా రచించి నటించగల సామర్థ్యం కూడా ఉంది. కొన్ని కొన్ని పాత్రలు, మరికొన్ని సంభాషణలు కడుపుబ్బ నవ్వు పుట్టించేవిలాగా ఉంటాయి. వాటిని ఏనాడు చూసినా, ఎప్పుడు విన్నా, ఒక్కసారి నవ్వక తప్పదు. అందుకనే ఆయనన్నారు ప్రేక్షకుల్ని ఉద్దేశించి "మీరందరూ నవ్వుతుంటే నా కెంతో ఆహ్లాదంగా ఉంది. ఈ నవ్వుకు హద్దులు లేవు. కృత్రిమపు సరిహద్దులు అసలే లేవు. అందరినీ ఉర్రూతలూగించి బంధించే ఒక శక్తి. అందులోనే మనం దేవున్ని చూడగలుగుతాం." ఏమైనా ఒక కళను నమ్ముకుని ఆరాధించి తన జీవితాన్ని అంకితం చేస్తున్న డాక్టరు చంద్రశేఖరం ధన్యులు. ఆయన నిరంతర కృషి, ఉత్సాహం ఇతరులకు మార్గదర్శకంగా ఉంటుందనటంలో సందేహంలేదు.

## ఆడంబరాలు పోవాలి

'సత్యాగ్రహ' మనేది, విదేశీయులను పారదోలటంలో గాంధీజీ, ఒక గొప్ప అస్త్రంగా ఉపయోగించారు. దాని ఫలితం చూసిన తర్వాత మన దేశీయులే మన వాళ్లమీద ఉపయోగించటం మొదలుపెట్టారు. అందులో ప్రభుత్వంమీద వత్తిడి తీసుకురావాలన్నా, తన అభిప్రాయానికి ఎక్కువ ప్రచారం కావాలన్నా, యీ అస్త్రాన్ని ఉపయోగించటం పరిపాటయి పోయింది. నువ్విది ఒప్పుకుంటావా, లేకపోతే సత్యాగ్రహం చెయ్యమంటావా అన్నట్లు! అందువలన ఈ మాటకు

56 వ పేజీ చూడండి



మంత్రుల ఆడంబరాలు పోవాలని హైదరాబాదులో ముఖ్యమంత్రి నివాసం "గ్రీన్‌లాండ్స్" ముందు సత్యాగ్రహం చేస్తున్న శ్రీ గో. రా. బృందంవారు.



# సరాగమాల

విఎకె రంగారావు

## సరాగమాల ఒక లేఖ

బొంబాయి నుంచి అత్తోట వాసుదేవరావుగారి లేఖ.

"శ్రీ రంగారావుగార్కి ! నమస్సులు ! వీడెవడు ఈ ఆగంతకుడు అని మీరు ఆశ్చర్యపోయి ఉంటారు పైన పేరూ గట్రా చూసి .... అవునా ? నిజమే. నేను మీకు తెలియకపోవచ్చు గాని మీరు నాకు పత్రిక ద్వారా తెలుసు. పైగా మన కామన్ ఫ్రెండయిన × × × ద్వారా మీ గురించి తరుచు వింటుంటాను జాబుల ద్వారా."

ఒకప్పుడైతే ఆశ్చర్యపోయేవాడిని గాని, ఇప్పుడు పాఠకుల అభిమాన వర్షానికి అలవాటు పడ్డాను. కాబట్టి ఆశ్చర్యం కలగటంలేదు. వారి అశేష ఆదరంమీద గౌరవం మాత్రమే. అది సరేగాని, చెప్పుడు మాటలు వినకండి. నా గురించైనా మరెవరి గురించైనా, అందులో ఆ వీథివారి మాటలు.

"చాలాకాలం నుంచి మీకు జాబు వ్రాయాలని కోరిక. దీనికి వేరే అంతిమ ఆశయం, అంటే అల్టీరియర్ మోటివ్, యేదీ లేదు. మీరు వ్రాసే 'రాతల' ద్వారా నా హృదయంలో మీరొక విశిష్ట స్థానాన్ని దురాక్రమణ చేశారు. 'రాతలు' అని ఎందుకన్నానంటే మీరు చాలవరకు తెలుగు 'చిత్రాల' పాటల గురించే వ్రాసి నా అభిమానాన్ని అంతగా పొందలేక పోతున్నారు గనుక. ఆ నడుమ కొన్ని హిందీ పాటలు పరిచయంచేసి నాలాంటి పొరుగింటి పుల్లకూర రుచిగాళ్లకి ఆనందం కలిగించారు. నిజమే. థేంక్స్ !"

హిందీ, తెలుగు చిత్రాల విలువలు నిర్ణయించటము ఈ సరాగమాల పరిధి కందనిది, కాని సంగీత పరంగా ఈనాడు తెలుగు చిత్రాలు హిందీ వాటికి వెనుకబడి ఉన్నవంటే నేను ఒప్పుకోను. దీనికి కారణం గత అయిదేళ్లలో మన సంగీతం వేసిన ముందడుగు. గత సంవత్సరంన్నరలో హిందీ చిత్ర సంగీతం వేసిన వెనుకడుగు.

"నేను మీలాగా చేయి (ఎటూ ?) తిరిగిన రచయితను కాను. కాని కనపడ్డ ప్రతి మంచి పుస్తకం, ఆంగ్ల, తెలుగు భాషల పత్రికలు, పుస్తకాలు చదివేయడం నా జబ్బు. ముఖ్యంగా హాస్యం ధ్వనించే రచనలంటే నాకు అద్దుకంటే యిష్టం."

అయితే మీకు మా కృష్ణానంద్ రచనలు నచ్చుతున్నాయన్నమాట.

"నేను ప్రస్తుతం ఉద్యోగరీత్యా బొంబాయిలో బ్రతుకుతున్నాను గత మూడు సంవత్సరాలుగా. ఇంకా నా సెంటెన్స్ (శిక్షాకాలం అని శంకర నారాయణ డిక్షనరీ నిర్వచనం) పూర్తికానందున దక్షిణ భారతావనికి బదిలీ కాలేదు. భగవత్కృప ఉంటే త్వరలోనే కావచ్చును. అవగానే చూడ దలచుకొన్న వ్యక్తులలో × × × ఒకరు, ఏడుకొండల దేము డొకడు."

ఎవరా రెండవ 'వ్యక్తి' ? స్నేహితుడా, బంధువా? దేముడని అదేం పేరు ? అయినా బొంబాయి వదలాలని మీకు ఎందుకు తొందరగా ఉందో వూహించలేకున్నాను. అందులో ఈ ప్రమోద భరితమైన వర్షాకాలంలో. ఇన్ని వూళ్లలో వర్షర్తువుని చూశాను గాని బొంబాయి నగరంలో ఉన్నంత ఉద్రిక్తంగా, ఉద్వేగంగా మరేచోటా కనపడలేదు. మెరైన్ డ్రైవ్‌లో నీటి ఒడ్డున భూతాల్లాంటి కెరటాలు మీద విరుచుకు పడుతుంటే ఉప్పునీటి తుప్పరలోను, వర్షపు జల్లులోను నడిచి వెళ్లటం కన్నా భౌతికమైన ఆనందం మరేమిటి ఉంటుంది ? ఆ సమయంలో 'రిమ్ ఝిమ్‌కే తరానే లేకే ఆయి బర్సాత్' గీతా, రఫీ, సర్మన్, కాలాబజార్ మనసులో మెదలాడుతుంటే మరో స్వర్గమే అక్కరలేదు. ఆ సమయంలో ఏకాంతంగా ఉన్నవారిని ప్రకృతికాంతయే ప్రణయమూర్తియై స్వయం వరిస్తుంది. ప్రకృతి తనకు తానై ఎంతటి గంభీరమైన సౌఖ్యాన్ని యివ్వగలదో చవిచూపిస్తుంది. ఆ అనుభూతి మీ రెరుగరా ?

"నా రచనల్లో రీసెంట్‌ది × × × పత్రికలో ప్రచురింపబడ్డ "అభిజాన్" చిత్ర విమర్శ. అది 6—7—63 సంచికలో యిరవయ్యవ పేజీలో ఉంది. వీలు చిక్కితే పరికించండి. మరికొన్ని వారాల తర్వాత అదే పత్రికలో మరికొన్ని రచ



ప్రముఖ తార అంజలీ దేవి (ఫోటో: ప్రభాకర్)

**లిలు ప్రచురింపబడ నున్నాయ్—అని చెప్పుకోవడం** స్వడబ్బా మోగించుకోవటం కాదని ఆశిస్తాను.''

అది స్వంతడబ్బాయే. కాని అందులో తప్పే ముంది ? నేనీ పని చేశాను అని చెప్పుకోవటంలో తప్పులేదు, అతిశయము లేదు. నేనీ పని గొప్పగా చేశాను అని అనుకోవటంలో రెండూ ఉన్నాయి. అలా పైకి అనటంలో పై రెండిటికి తోడు అవివేకం కూడా ఉంది. దీనికేంగాని 'అభిజాన్' చిత్రంలో నేపథ్య సంగీతం అతి విశిష్టమైన పద్ధతిలో ఉందటగా ? మద్రాసువాసులకు అదీ కొరత. బెంగాలీ, మరాఠీ చిత్రాలు, ఎంత మంచి వైనా సరే ఎప్పుడోగాని రావు. ఇక పాత హిందీ చిత్రాలంటారా ? అవి ఇంకా అరుదు. బొంబాయిలో ఉన్నప్పుడు ఎన్ని పాత హిందీ సినిమాలు చూశానో లెక్కలేదు. 'కాదంబరి', 'ఝూలా', 'బంధన్', 'తంగన్', 'రామరాజ్య', 'పుకార్'. వాటి ఎంతగా అనుభవించానో చెప్పలేను. అటువంటి పాతకాలపు విందులు మద్రాసులో అందని పళ్ళే.

''రంగారావ్‌గారూ, మీరీ మధ్య విశాఖ వెళ్ళారుట గదా ! ఆ అందమైన వూరు ఏమన్నా మారిందా ! పురపాలక నియంతల నిర్లక్ష్య కారణంగా నాశన మవుతున్న సుందర నగరాల్లో అదొకటి.''

ఆ పురపాలకుల పుణ్యాన్నే అనుకుంటాను ప్రశాంతమైన బీచి ఒడ్డున ప్రతి సాయంత్రం ఒకే రేడియో మోత. నాకు విశాఖలో ఇప్పుడు కనబడుతున్న అందాలన్నీ మా చిత్తూరు రెడ్డి పెంకితనం, చినబాబు మంకుతనం, పెదబాబు మంచితనం. ఇవన్నీ కిషోర్‌కుమార్ ఖుషి పాట లాంటివి. సంగీతపరంగా డి. కృష్ణమూర్తి పరిచయం (వీరిని గురించి త్వరలోనే విపులంగా) ప్రకృతిపరంగా మేము పారడైజ్ పార్కనే కైలాసాశ్రమం. ఆ కొండపైనుండి లోయల్లోకి చూస్తుంటే సి. రామచంద్ర కృతి 'బాజీ తహి శహనాయి' గుర్తుకు వస్తుంది. అంత ఆహ్లాదకరమైన ప్రదేశ మది. పత్రికలో (8—2—63) మీ కాకాలూకీయం చదివాను. సరదా పడ్డాను. మీ ఉత్తరానికంతా ఇందులోనే జవాబిచ్చేశాను. వేరే ఏం వ్రాయను ? మీరే వ్రాయండి. ఇరవై అయిదు నయాపైసల తపాలాబిళ్లలు జతపరచి మరీ.



# అవీ - ఇవీ - అన్నీ

## డా॥ రాజారావు ఆకస్మికమరణం

''పుట్టిల్లు'' చిత్రదర్శకుడు డా. గరికిపాటి రాజారావు రాజమండ్రిలో జన్మించారు. కార్మిక సేవచేస్తూ ''ప్రజా బంధు'' అనిపించుకున్నాడు. ప్రజానాట్య మండలి స్థాపించి అనేక నాటక ప్రదర్శనలిచ్చారు. ''ఇప్టా''కు ఆంధ్రా కన్వీనరుగా ఉంటున్నారు. ప్రస్తుతం చలనచిత్ర పరిశ్రమలో ఉన్న అనేకమంది నటీ నటులు వారిద్వారా వెండితెరకు పరిచయమైనవారే. ''పుట్టిల్లు'' చిత్రం తర్వాత రెండవ చిత్రంగా ''దేవుడు చేసిన మేలు'' చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. ''బొబ్బిలియుద్ధం''— శ్రీ నిలయం పిక్చర్సులో నటిస్తున్నారు కూడా.

**సెప్టెంబరు 8వ తేదీ సాయంత్రం 4—45** నిముషములకు మద్రాసు జనరల్ హాస్పటల్‌లో గుండెనొప్పివలన భార్య, ముగ్గురు కొడుకులు, ఒక కుమార్తెను విడిచి స్వర్గస్థులైనారు. ఈ విషాద వార్త తెలియగానే ఫిలిం పరిశ్రమలో పిన్నలు— పెద్దలు దిగ్భ్రాంతి చెంది డా. రాజారావు ఇల్లు చేరుకున్నారు. రుద్ర భూమి వరకు అంతా వచ్చి అంత్యక్రియలు జరిపారు.

53 వ పేజీ చూడండి



'వహ్‌ క్యాన్‌ థీ'లో ఒక దృశ్యం.



'పెంచిన ప్రేమ'లో ఒక దృశ్యం.

# తనను గురించిన నిజం

"ప్లాట్ ఫారమ్ కూడా అందంగానే ఉంటుంది" అనుకున్నాడు చక్రధరరావు.

ఏర్ కండిషన్డ్ హొటల్లో భోజనంచేసి, కిళ్లీ బిగించి సిగరెట్ కాలుస్తూ, ట్యూబ్‌లైట్ల వెలుగులో దేదీప్యమానంగా వెలిగిపోతున్న ప్లాట్ ఫారాన్ని, రైళ్లకోసం వచ్చిన జనంలోని ఆడపిల్లల్నీ చూసి ఆ నిర్ణయానికి వచ్చాడు. ఇన్ని వందలమంది, లేక వేలమంది రోజూ గమ్యాలు చేరటానికి ఉపయోగపడే రైలుమీద అతనికి ప్రేమ కలిగింది. ఐతే ఇందర్లో హాయిగా, సుఖంగా ఉంటున్న వారెందరు? మూడో తరగతి టిక్కెట్టు తీసుకుని ఆ రద్దీలో, తోపులాటలో నరకాన్ని చవిచూస్తూ ప్రయాణంచేసే అభాగ్యుల తలంపు రాగానే అతనికి జాలి కలిగింది. సెకెండ్‌క్లాసులో ప్రయాణం చెయ్యటానికే తనకు తలప్రాణం తోక్కొచ్చినంత పనౌతోంది. ఆదరా బాదరా ప్రయాణం కావటం చేతగాని, లేకపోతే హాయిగా ఫస్ట్‌క్లాస్‌లోనే వచ్చి ఉండేవాడు.




ఏమైనా తన ప్రయాణం విఫలం కాలేదను కున్నాడు. చక్రధరరావు. నాన్న బలవంతం లేక పోతే మరో రెండు రోజులు ఈ వూళ్లోనే గడపాలని కూడా ఉంది. ఆ హొటల్లో మాత్రం కాదు. అనుకున్నాడు తను, కసిగా నవ్వుకుంటూ.

స్టేషన్‌నించి ఫర్లాంగు దూరంలో ఉన్నదా హోటలు. చక్రధరరావుకు, ఆ హొటల్‌కి వెళ్ల వలసిన అవసరం జ్ఞాపకం రాగానే మిత్రుడు సత్యంమీద వళ్లు మండిపోయింది. రైలు దిగంగానే భుజం మీదెక్కించుకుని ఇంటికి తీసుకుపోతానని ఉత్తరం రాసిన సత్యం రైలు దరివానా నైనా రాలేదు. పావుగంట ప్లాట్‌ఫారంమీద వేచి చూసి, ఆ తర్వాత స్టేషన్ బైటికి వచ్చాడు. సత్యం రాడేమో అసలు అన్న అనుమానం తనకి తగల్లేదు. ఎలా రాకుండా ఉంటాడు? ఆలస్యం ఐవుండవచ్చు. అందులో వాడి తప్పేమీ ఉండదు. నూటయాభై రూపాయల ఉద్యోగంకోసం వాల్తేరు నించి విజయవాడ వచ్చే అవసరం కలిగించిన ఆర్థిక స్థితి అతనిది. ఉద్యోగంలో చేరిన రాత్రే పెళ్ళి చెయ్యాలన్నది, పుస్తకాల్లోనూ, తాళపత్ర గ్రంథాల్లోనూ రాయకపోయినా, అదమలులో ఉన్న సాంఘిక నియమం గనక వాడికి పెళ్ళి కూడా ఐంది పెళ్ళి ఐంది అనే మాట పూర్తి కావటానికీ, పిల్లలు కలగటానికీ మధ్య కాలం సింహేంద్ర మధ్యమ నడుం అంత సన్నటిది. పసిపిల్లాడితో సంసారం అంటే తనకి వూహించటాని క్కూడా భయమే. అలాంటి సత్యం వేళకి రాకపోవటంలో ఆశ్చర్యమేమీలేదు. కాని, చివరికి సత్యం అసలే రాలేదు. ఆ సంగతి నిర్ధారణ చేసుకునేసరికి స్టేషన్ దాపులో ఒక్కటంటే ఒక్క రిక్షా మిగిలింది.

రిక్షా సంగతి గుర్తుకు రాగానే చక్రధరరావుకు ఒక చిత్రమైన సన్నివేశం గుర్తు కొచ్చింది. ఏలూరు సేషన్లో ఎవరో ఒక యువకుడు ఉరుకులూ పరుగుల్లోవచ్చి రైలెక్కేశాడు. అతని వాలకం చూడంగానే ఎవరో మూడో తగరతి టిక్కెట్టు కొనుక్కుని సెకెండ్ క్లాసులో ఎక్కిన వాడని పించింది. నీరు కావి పట్టిపోయిన పైజమా, చొక్కా, గుబురుగా పెరిగిపోయిన గడ్డం, చేతిలో కాన్వాసు సంచి, అది అతని వేషం. కంపార్ట్‌మెంట్‌లోకి రావటమే, ఓ చోట చోటు చూసుకు కూలబడి సంచి. లోంచి ఏదో పుస్తకాన్ని తీశాడు. అక్కడ్నించి విజయవాడ వచ్చిందాకా అది చదువుతూనే ఉన్నాడు. విజయవాడ స్టేషన్లో అతను తనకి కనిపించ లేదు. తనకు అతన్ని గురించి పట్టించుకునే అవకాశం లేకపోయింది సత్యంకోసం చూడటంలో.

చివరికి తాను స్టేషన్ బైట నుంచుని, మిగిలిన ఒక్క రిక్షాని పిలుద్దామనుకునేటంతలో అతను స్టేషన్ మెట్లు దిగుతూ కనిపించాడు.

మెట్లు దిగుతున్న అతని ముఖం చూడగానే, దంత ధావనాదికాలు స్టేషన్లోనే ముగించుకున్నట్లు అర్థమైంది. అతనికి. అత నెక్కడికి పోతాడో తెలుసుకోవాలన్న కుతూహలం తనకి తెలియకుండా కలిగింది. కాని, అప్పటికే ఆ యువకుడు కేకవెయ్యటమూ, రిక్షావాడు అతని దగ్గరకు పోవడమూ జరగడమేకాక, "ఎక్కడికి పోవాలి బాబూ?" అని అడిగాడు రిక్షావాడు.

"శ్మశానానికి" అన్నా డతను.

ఆ మాట వినిపించగానే, తన ఒళ్లు జల్లుమన్నది. చాలా దారుణమైన దృశ్యం చూసినట్టు, ఎవరిదో ఆర్తనాదం విన్నట్లు అనిపించింది. ఆ షాక్నుంచి తాను కోలుకునే సరికే అతను రిక్షావాడితో బేరం ఫైసలు చేసుకోవటం, అతన్నెక్కించుకుని రిక్షా వెళ్ళిపోవటం జరిగిపోయింది.

కూతవేటు దూరంలో ఎక్కడా వాహనం ఏదీ లేదనే స్పృహ కలిగేసరికి తనకు పూర్తిగా నిస్పృత్త అవరించినట్లైంది. చేసేదిలేదు గనక సూట్కేసు మోసుకుంటూ నటరాజా సర్వీస్ కానిచ్చాడు. ఫర్లాంగు దూరం నడిచేసరికి 'ఏదో విలాస్' కాఫీ భోజన విశ్రాంతి భవనం అని బోర్డు కనిపించింది. దాని రూపు రేఖావిలాసాలు బైటికి భయంకరంగా కనిపించినా, నెత్తిన మాడుస్తున్న ఎండ తొందర కలిగించటంతో అందులోకి పోయాడు. ఆ హోటల్ని పదిహేడో శతాబ్దంలోనో, పద్దెనిమిదో శతాబ్దంలోనో కట్టించి ఉండాలి. అందులోనే ఒక గుహ కిరాయికి తీసుకుని ముళ్ల మీదున్నట్టుగా అవశేషాలు తీర్చుకున్నాడు. హోటల్నించి బైటపడి డైరీలో రాసుకున్న ఎడ్రస్ సహాయంతో సత్యం ఇంటికి చేరుకున్నాడు రిక్షా మీద.

ఇంటి దగ్గర తన కెదురైన సత్యాన్ని చూసే సరికి ఒళ్లు మండిపోయింది తనకి. పక పక నవ్వుతూ, "ఇంత లేటైందా రైలు? సామానేదీ?" అన్నాడు. నాలుగూ దులిపేద్దామనుపించింది. చివరికి సత్యమే క్షమార్పణ చెప్పుకున్నాడు. "అర్జంటుగా రమ్మని మా మేనేజర్గారు కబురు చేశాడు భాయీ! పోక తప్పిందికాదు." అని.

తనెంత అవస్థ పడిందీ చెప్పి, "ఇలా నే నొస్తున్నానని చెప్పి వచ్చెయ్యలేక పోయావా?" అన్నాడు తను.

"నేనూ నీలాగే లక్షీపుత్రుడనైతే మేనేజర్ మాట ధిక్కరించి ఉండును. నాకు ఆయన గారి గుడ్బుక్స్లో ఉండటం అవసరం."

"కాకా కూడా నేర్చుకున్నావన్న మాట?"

"నువ్వేమైనా అనుకో. నా అనుభవంలో కాకా పట్టని వాడంటూ కనిపించలేదు. తేర తమ భేదాలుంటే ఉండొచ్చు......అది పోనీగాని నువ్వు నిజంగా ఉద్యోగం కోసమే వొచ్చావా?"

తనకి నవ్వొచ్చింది. "నేను తగనంటావా?" అన్నాడు.

"అది కాదు. అంత దూరంనించి ఇంత దూరం ప్రైవేటు కంపెనీలో ఉద్యోగానికి రావాల్సిన గతేమిటా నీకని?—"

ఆ గతిలోని వన్నాగం, సత్యానికి వివరించేందుకు పది నిముషాలు పట్టింది తనకి. తాను ఉద్యోగంకోసం వచ్చిన యూనివర్సల్ ప్లాస్టిక్స్ కంపెనీ మార్కెట్లో మంచి పేరున్నది. తొందర్లోనే ఎగుమతులు కూడా సాగించబోతుంది. ఆ కంపెనీకి, తమకి లావాదేవీలున్నా, అవి చాలా కొద్ది పాటివి. వాటిని దృఢతరం చేసుకునేందుకు సాధనంగా ఈ ఉద్యోగం తన కవసరం. తమ దగ్గర ముడి సరుకు కొనవల్సింది వాళ్లు. స్థాన బలిమిలో నమ్మకం జాస్తి తన తండ్రికి.

"మొత్తానికి మీ నాన్నగారు చాణుక్యుడు" అన్నాడు సత్యం చివరికి.

"ఎంత చాణక్యతనం లేకపోతే వ్యాపారం గడుస్తోందంటావ్?.......సరేగాని ఇంటర్వ్యూలు ఎన్నింటికి?"

"దాని సంగతి చెప్పటానికే మేనేజర్గారు రమ్మన్నాడు. మొత్తం పన్నెండుమందిని ఇంటర్వ్యూకి పిలిచారట. అందులో మొదటి ఆరుగుర్ని పదకొండునించి పన్నెండు లోపు పిలుస్తారట. మిగతా ఆరుగుర్ని రెండింటినించి పిలుస్తారట."

"నేను మొదటి లిస్టులో ఉన్నట్టా, రెండో లిస్టులో ఉన్నట్టా?"

"మొదటి లిస్టులో, మొదటి పేరు నీదే"

ఆ మాట వినంగానే తనకి రాజారావుగారు గుర్తుకొచ్చాడు. మొత్తంమీద ఆయన కొంత గ్రంథం నడిపి ఉండాలి. ఈ ఉంటర్వ్యూ ఐపోంగానే ఆయునింటికిపోయి చూడాలి.

"ఐనా నీకు ఇంటర్వ్యూ ఏమిటిలే? మూల విరాట్టే నీ వాడి మనిషి" అన్నాడు.

"ఏడిశావులే. టైమవుతోంది లే."

యూనివర్సల్ ప్లాస్టిక్స్ ఆఫీసు దగ్గర కొచ్చే సరికి సరిగ్గా పదైంది. ఆ గంటసేపూ తనతో బాటు ఇంటర్వ్యూ కొచ్చిన వారితో బాతాఖానీ వేయటంతో సరిపోయింది. అందర్లోనూ ఉద్యోగం కోసం ఆత్రం పడటం కనిపించింది. మీ కెవ్వరికీ రాదు. నాకు రిజర్వైంది. అని చెబుదామా అని పించింది కూడా తనకి. తన తండ్రి ఏమైనా అంటాడేమో లేకపోతే ఇంటర్వ్యూ మానుకునే వాడే తను. అందులో అందరూ ఉద్యోగం తాలూకు అవసర తీవ్రత కలిగిన వారే. తనకేం?

పదకొండు దాటాకగాని ఆఫీసరు రాలేదు. అంతదాకా గోళ్లు గిల్లుకుంటూ కూచోవటం తనకు చిరాకే కలిగించింది. ఉద్యోగాలకోసం ఈ కంపెనీల వాళ్ళు జరిపే తంతు మీద ఏవగింపు కలిగింది కూడా. ఇదీ ఒక రకమైన చెలగాటం అని పించింది. 'దొర'గారు రూమ్లోకి పోయి కూచున్నాక పావుగంటకి ఇంటర్వ్యూ ప్రారంభమైంది సత్యం చెప్పిన సంగతి నిజమే. మొదటగా తననే పిలిచారు. తను గదిలో అడుగు పెట్టగానే "కూంచోడి" అన్నాడు దొర! మరొకాయన కూడా అక్కడ కూచుని ఉన్నాడు. ఆయ నెవరో, అక్కడి కెలా వచ్చాడో అర్థం కాలేదు తనకి. తర్వాత సత్యం చెప్పాడు. తను సిగరెట్ కాల్చుకోటానికి రోడ్ మీదికి వెళ్ళినప్పుడు ఆయన వచ్చాడట.

తన వూరు, పేరు అడిగాక "మీకు రాజారావుగారు బంధువులా?" అనడిగా డాయన.

"కాదండీ. మా నాన్నగారి స్నేహితులు."

"అలాగా?" అని తన మార్కుల లిస్టు చూసి, "మీకు బుక్కీపింగ్ అంటే పడదు కాబోలేం?" అన్నా డాయన.

నిజం చెప్పాలంటే ఆయనా మాట అనంగానే తనకి సిగ్గేసింది. ఎకనామిక్సూ, బుక్కీపింగూ తనకి బద్ధ శత్రువులు. అదీగాక, అవి స్పెషల్ సబ్జెక్టులు కాకపోవడంతో తనకి శ్రద్ధ కూడా లేకపోయింది. తలవంచుకుని ఏదో నసిగాడు చివరికి.

"ఎడ్వాన్స్డ్ ఎకౌంట్స్ బాగానే చేశారు..... ఆల్రైట్! రిజల్ట్స్ తర్వాత తెలియచేస్తాం" అన్నా డాయన నవ్వుతూ.

తను లేచి బైటి కొచ్చేసరికి మిగతా వారంతా తన చుట్టూ మూగారు. తననేం ప్రశ్నలు వేశారో వాళ్లకి కావాలి. తనకి నవ్వొచ్చింది. తోచింది బొంకి ఇవతల పడ్డాడు. సత్యం తనతోబాటు రోడ్ మీదికి వచ్చి, "ఏమైంది?" అన్నాడు నవ్వుతూ.

జరిగింది చెప్పాడు తను.

"చెప్పలా? ...... కాని, నీ కదంతా చాలా క్రూరంగా కనిపించటం లేదూ?"

"ఏం చేస్తాం?"

"నిజమే......సరే! ఫోంచేసి రూమ్లో ఉంటావా? సాయంత్రం హాజరవుతాను."

"పొద్దున్న వచ్చావుగా?.......రాజారావుగారితో కొంచెం పనుంది. అది చూసుకుని రూమ్కి పోతాను"

"అచ్చా! ఏమిటో ఆయన్తో పని? పెళ్ళి సంబంధమా?"

"కాదులే. ఆ ప్రమాదం ఇంతలో లేదు"

సత్యం నవ్వుతూ వెళ్ళిపోయాడు లోపలికి. తాను రిక్షా ఎక్కి రాజారావు గారింటికి చేరేసరికి ఆ ఇంటిముందు కాంపొండులో వనకన్యలా తిరుగుతున్న అమ్మాయి మొదట కనిపించింది. ఆ అమ్మాయిని అంతకుముందెప్పుడూ చూసి ఉండకపోయినా, ఎవరో గుర్తించటానికి ఆలస్యం కాలేదు. సత్యంతో తాను లేదని చెప్పిన ప్రమాదం కలగటానికి ఆస్కారం కనిపించింది. అన్నయ్య ఆమెను గురించి అన్నదాంట్లో అతిశయోక్తి లేదు. నాన్న అభిప్రాయంలో అసహజమూలేదు. సరళ అందంగానే కాదు—ఆకర్షణీయంగా కూడా ఉంది.

తను లోపలికి పోయి కూచున్న పది నిముషాలకి త్రేవుని తేన్చుకుంటూ బైటికి వచ్చాడు రాజారావుగారు. తన కెప్పుడూ ఆయనంటే ఒక రకమైన అనుమానమే. ఆ మనిషిలో చదువుంది. తెలివి తేటలున్నాయి. ఏడా పెడా ఆర్జిస్తున్నాడు. కాని, ఈయనకి హోదా నిలుపు కోవటమూ, సంస్కారయుతంగా ప్రవర్తించటమూ తెలుసునా? అని. కుశల ప్రశ్నాదికాలు ఐనాక "పెళ్ళి చేసుకోవు టోయ్?" అన్నా డాయన.

"ఎందుకులెండి అప్పుడే?"

"అదేం మాట? నువ్వింకా బుల్లి పాపాయి ననుకుంటున్నావా? నీ వయసులో నాకు రెండేళ్ల కొడుకు. తెలుసా?"

"ఆ రోజులు వేరు లెండి"

"అవున్లే!......ఎన్ని వేలు కావాలో కట్నం" అన్నా డాయన నవ్వుతూ.

ఆయన అభిప్రాయం తెలియటానికి ఎంతో సేపు పట్టలేదు. కట్నం కానుకల విషయంలో తనకు నిర్దిష్టమైన అభిప్రాయమంటూ లేదని ఒప్పుకుంటాడు. కావలిసినంత ఆస్తి ఉండి, ఆడంబరంగా పెళ్ళి చెయ్యగల స్తోమతు ఉన్నవాడు

47 వ పేజీ చూడండి

# ఇడ్లీలు - రకాలు

సుశీలా రామశేషు

అన్ని ఫలహారములలోను ఇడ్లీ ఆరోగ్యకరమైంది; ఖర్చులేనిది. అందువలన మన అందరి ఇళ్ళలోను సాధారణంగా ఇడ్లీ చేసుకుంటూనే ఉన్నాము. అది అందరికి తెలిసినదే అనుకుంటాను. అయినా ఒకసారి చెప్తాను. అరకిలో ఉప్పుడు బియ్యము, పావుకిలో పొట్టుమినపప్పు శుభ్రంగా రాళ్ళు, మట్టి లేకుండా చేసి వేర్వేరు గిన్నెలలో పోసి నానపెట్టాలి. ఉదయము నానపెట్టి సాయంత్రము రుబ్బుకోవచ్చు. మర్నాడు ఇడ్లీ చేసుకుంటే చాలా బాగుంటాయి. రుబ్బే ముందర వాటిని బాగా కడగాలి. లేకపోతే ఇడ్లీకి నలుపు రంగు వస్తుంది. రుబ్బిన పిండిలో మనము ఇడ్లీ చేసే ముందే ఉప్పు వెయ్యాలి. అది బాగా కలిపి, ఇడ్లీ పాత్రలో అడుగున నీళ్ళుపోసి, పళ్ళెముల గుంటలలో తడిగుడ్డలు వేసి దాంట్లో పిండివేసి మూత పెట్టి స్టౌమీద గాని పొయ్యిమీద గాని పెట్టితే పది నిముషముల తర్వాత ఇడ్లీ తయారవుతుంది. చట్నీ నంచుకుని తింటే చాల బాగుంటాయి. ఇది అందరికీ తెలిసినదే.

**కాంచీపురము ఇడ్లీ :**

ఈ ఇడ్లీ తినటానికి చాల రుచిగాను, ఆరోగ్యంగాను కూడ ఉంటుంది.

దీనికి కావలసినది : ఉప్పుడు బియ్యము ½ కిలో, పొట్టు మినపప్పు ½ కిలో, చిటికెడు సోంపిపొడి, 2 టీస్పూన్లు మిరియాలు, 2 టీస్పూన్లు జీలకర్ర, ఉప్పు, నెయ్యి.

అరకిలో ఉప్పుడు బియ్యము, రాళ్ళు మట్టి లేకుండ శుభ్రము చేసుకోవాలి. పొట్టుమినపప్పు పావు కిలో శుభ్రముచేసి రెండును వేర్వేరు పాత్రలలో నానవెయ్యాలి. ఈ రాత్రి నానవేసి మర్నాడు ప్రొద్దున్నే, లేక మధ్యాహ్నమో రుబ్బవచ్చును. ఈ రుబ్బటము మన మామూలు ఇడ్లీలాగ రుబ్బ కూడదు. ఉప్పుడు బియ్యము కొంచెము నూకనూకగ రుబ్బవలెను. పొట్టు మినపప్పు బాగా కడిగి పొట్టు అంతా తీసి వెయ్యాలి. లేకపోతే ఇడ్లీకి నల్లరంగు వస్తుంది. ఈ నానిన మినపప్పులోంచి ఒక గుప్పెడు మినపప్పు తీసి వేరుగ అట్టే పెట్టుకోవాలి. మిగతాది రోట్లో పోసి రుబ్బాలి. పప్పు సగము నలిగాక (కొంచెము మొరుము మొరుముగా ఉండగా) సగముతీసి వేరే పెట్టుకోవాలి. మిగతాది బాగా కాటుకలాగా మెత్తగ రుబ్బాలి అప్పుడు రుబ్బినవన్నీ, అనగా రుబ్బిన ఉప్పుడు బియ్యము, మొరుముగా రుబ్బిన మినపప్పు, మెత్తగా రుబ్బిన మినపప్పు, అట్టె పెట్టిన మినపప్పు అన్నీ కలిపి ఒక గిన్నెలో అట్టే పెట్టుకోవాలి. ఆ రాత్రికి ఉంచి మర్నాడు చేస్తే పులిసి మెత్తగ దూదిలాగ ఉంటుంది ఇడ్లీ. ఇడ్లీ చేసే ముందు సోంపి మెత్తగా దంచి, జల్లించి ఆ పొడిని ఒక చిటికెడు, రెండు టీస్పూన్లు మిరియాలు కచ్చ బచ్చగ దంచి అవీ, 2 టీస్పూన్లు జీలకర్ర ఆ పిండిలో వేసి తగినంత ఉప్పు కూడ వేసి బాగా కలపాలి. తర్వాత ఒక పెద్ద గరిటెడు నెయ్యి బాగా వేడిచేసి ఈ పిండిలో పోసి కలపాలి. ఇప్పుడు ఇడ్లీ చేసుకోవటానికి పిండి రెడీగా ఉందన్నమాట. ఈ ఇడ్లీలను మామూలు ఇడ్లీలలాగ గుడ్డలమీద పొయ్యకూడదు. మన మామూలు పాత్రల్లో గుంటలు ఉంటాయి కదా వాటికి సరిపడినంత అరటి ఆకులు కోసి వాటికి నూనెరాసి, పాత్రలో ఉంచి వాటిమీద ఈ పిండి కొంచెము వేసి (గుంటకు తగినంత) మన మామూలు ఇడ్లీం లాగే వండాలి ఐదు పది నిముషాల తర్వాత ఇడ్లీ తయారవుతుంది. వాటిని పళ్ళెములోకి తీసి వేడివేడిగ తింటె చాల బాగుంటాయి. కావలసినవాళ్ళు చట్నీ (పచ్చడి) చేసుకొని నంచుకొని తింటే తినవచ్చు. లేకపోతే ఇడ్లీ మీద కమ్మటి నెయ్యి వేసుకుని తినవచ్చు. ఈ ఇడ్లీకి సాంబారు బాగుండదు. ఇది చాల జీర్ణకారి. శైత్య నిరుగుడు. చాలా రుచిగా కూడ ఉంటాయి.

**పనస బుట్టల ఇడ్లీ :**

ఈ ఇడ్లీ సాధారణంగా పోలాల అమావాస్యకి చేస్తారు. దీనికి మామూలు ఇడ్లీలాగే ఉప్పుడు బియ్యము అరకిలో, పావు కిలో పొట్టు మినపప్పు శుభ్రముచేసి వేర్వేరుగ నానబెట్టాలి. మర్నాడు వాటిని శుభ్రంగా కడిగి, మినపప్పులో పొట్టు అంతా పూర్తిగా తీసివెయ్యాలి. బియ్యము కొంచెము నూకగాను, పప్పు మెత్తగ కాటుకలాగను రుబ్బి రెండింటిని ఒక పాత్రలో వేసి కలిపి పెట్టుకోవాలి. ఆ రాత్రి ఉంచితే పిండి పులుస్తుంది. మర్నాడు అందులో తగినంత ఉప్పువేసి చేసుకోవాలి. పనస ఆకులు తెచ్చి చీపురు పుల్లలతో చిన్న చిన్న బుట్టలుగ కుట్టాలి. నాలుగు ఆకులు కలిపి కుట్టితే బుట్ట అవుతుంది. ఈ పులిసిన పిండి కొంచెముగ ఆ బుట్టలలో వేసి అవి ఇడ్లీ పాత్రలో పెట్టి వండాలి. పది నిముషముల తర్వాత చూస్తే, అవి తయారై ఉంటాయి. వాటిని (క్రిందికి దింపి కుట్టిన పుల్లలు విప్పేస్తే, ఇడ్లీలు బుట్టల ఆకారంలో ఉండి చూడటానికి తమాషాగా ఉంటాయి. ఆ పనస ఆకుల వాసన ఈ ఇడ్లీలకు పట్టి చాల బాగుంటుంది.

**చట్నీ చేసే విధము :**

కొంచెము తాజా కొబ్బరి కోరి పెట్టుకోవాలి. వేయించిన సెనగపప్పు (అంటే పచ్చి సెనగపప్పు. వేయించినది అనికాదు. వేరుసెనగ కాయలు, బటానీలు అమ్మే దుకాణంలో దొరికే సెనగపప్పు) శుభ్రం చేసి ఈ కొబ్బరి, పప్పు, తగినంత ఉప్పు, పచ్చి మిరపకాయలు వేసి మెత్తగా రుబ్బాలి. పులుపు కావలసిన వాళ్ళు చింతపండు, వేసి రుబ్బుకోవచ్చు. లేదా రుబ్బిన తర్వాత చట్నీలో కొంచెము నిమ్మకాయ పిండిన బాగా ఉంటుంది. లేదా చట్నీలో కొంచెము పుల్లమజ్జిగ కూడ వెయ్యవచ్చు. అన్నిటికంటె పచ్చడి చేసిన తర్వాత అందులో నిమ్మకాయలు పిండితే బాగుంటుంది. తర్వాత కొంచెము మినపప్పు, ఆవాలు పోపుచేసి చట్నీలో కలపాలి.

ఈ ఇడ్లీలకు పొట్టుమినపప్పు తప్ప ఛాయ మినపప్పు వాడటం మంచిది కాదు. పొట్టు మినపప్పు వాడితే ఇడ్లీ మెత్తగ దూదిలాగ వస్తాయి. ఉప్పుడు బియ్యం తప్ప పచ్చి బియ్యము వాడకూడదు. రెండు రోజులకోసారి రుబ్బుకోవచ్చు. పిండి మరీ పులిసిపోతే దాంట్లో — పచ్చి మిరపకాయ ముక్కలు, అల్లము ముక్కలు, పచ్చి బటానీలు, టమేటో ముక్కలు వేసి ఇడ్లీ వేసి చూడండి చాల రుచిగా ఉంటాయి. ★



'రెండుపళ్లూ పోగొట్టుకోలేదమ్మా! నాదగ్గిరే ఉన్నాయ్!'

## స్త్రీ

రమగారు వ్రాసిన 'స్త్రీ' వ్యాసంలో ఏమి చెప్పదలచారో తెలియటంలేదు. దానిలో క్రొత్తదనమేమీ లేదు. వారు ఏదో ఒకటి వ్రాసి పత్రికలో తమ పేరు వేయించుకునేందుకు వ్రాసినట్లు తోచుచున్నది.

బులుసు సూర్యకాంతం (అమలాపురం

* * *

స్త్రీ) వ్యాసం చాలా బాగుంది. వారన్నట్లు స్త్రీ సమస్యగా పుడుతుంది. సమస్యగా పెరుగుతుంది. సమస్యగానే మరణిస్తుంది. అందులోను మధ్య తరగతి కుటుంబాల్లో ఆడపిల్లల పాట్లు వర్ణనాతీతం.

కె. అన్నపూర్ణ (చిత్తూరు)

* * *

రమగారు వ్రాసిన 'స్త్రీ' వ్యాసం చదివి స్త్రీని అయిన నా హృదయం ద్రవించి పోయింది. స్త్రీ సమస్యగా పుడుతుంది. సమస్యగా పెరుగుతుంది. సమస్యగానే మరణిస్తుంది.ఈ వాక్యాలు నా మనస్సులో తిష్ఠవేసుకుని, మరచిపోదామన్నా పోలేనంత బలంగా నాటుకొని పోయాయి. స్త్రీ జీవితాన్ని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించారు.

కె. మాధవి (ఏలూరు)

* * *

"స్త్రీ"అనే వ్యాసము చాలా బాగా ఉన్నది. అందువలన రమగారికి నాయొక్క అభివందనములు తెలుపవలయునని కోరుచున్నాను. "స్త్రీ సమస్యగా పుడుతుంది. సమస్యగా పెరుగుతుంది. సమస్యగానే మరణిస్తుంది. స్త్రీ జీవితమే ఒక సమస్య" అక్షరాల నిజము.

జి. బి. గుండూరావు (బొంబాయి.)

* * *

ఈ వారం "స్త్రీ" గూర్చి రమగారు వ్రాసిన వ్యాసం నన్నంతగా ఆకర్షించలేక పోయింది. నవినయుగపు స్త్రీ జీవితం, వ్యాసంలో వర్ణించినంత గడ్డు సమస్యలాగ లేదేమో ననిపిస్తున్నది.

సరస్వతీ ప్రసాద్ (మద్రాసు)

* * *

"ఒకప్పుడు స్త్రీ— స్త్రీని గౌరవించిన మన భారత దేశంలో ఈనాడు స్త్రీ పాట్లు వర్ణనాతీతం." అనటంలో రచయిత్రి ఆలోచన అర్ధశతాబ్దం వెనక్కు పోయిందనిపించింది. నవ భారతంలో సర్వ హక్కులూ పొందిన స్త్రీ అవకాశం వచ్చినప్పుడల్లా తాను అబలను కానని, సబలనే అని నిరూపించు కుంటూనే ఉంది.

మనోరమ (హైదరాబాద్)

* * *

'స్త్రీ' వ్యాసం చాలా బాగుంది. వ్యాసాన్ని రూపొందించడంలో గల 'రమ' గారి నేర్పు, భావ ప్రకటనలోని తీరు నన్ను బాగా ఆకర్షించాయి. ఇంత చక్కటి వ్యాసాన్ని రచించిన 'రమ' గారు అభినందనీయులు. సమాజంలో స్త్రీ స్థానాన్ని యథాతథంగా చిత్రించారు. ఇలాంటి సహేతుకమైన, విమర్శనాత్మకమైన రచనలే వనితావాణి అభ్యుదయానికి తోడ్పడుతాయి.

ఎస్. ప్రమీలాదేవి (ఆళ్లగడ్డ)

* * *



రమగారు స్త్రీ జీవితములోని మూడు దశలను చక్కగా వివరించారు. 'ఆడపిల్ల' అని అంటూనే దద్దరిల్లే పెద్దలకు, 'ఆడపిల్ల' లోని సృష్టిని పెంపొందింపజేయు శక్తిని, విడమర్చి చెప్పారు. కో ఎడ్యుకేషన్ గల కళాశాలలలోని విద్యార్థినుల అవస్థ వర్ణనాతీతము. ముఖ్యముగా మగవారు నేర్చుకొనవలసిన విషయాలలో స్త్రీని గౌరవించుట కూడా ఒకటి.

బి. పుష్పాంజలి (మడితాడు ఆఫ్ రాయచోటి)

* * *

స్త్రీ అనే వ్యాసం చాలా బాగుంది. ఆ వ్యాసము చదువుతున్నంతసేపు నేటికీ మన దేశంలో స్త్రీకి ఉండే స్థానం ఎలాంటిదో కళ్లకు కట్టినట్టుగా ఉంది. పురుషులతోపాటు సమానంగా స్త్రీలు చదువుకుంటూ, ఉద్యోగాలు చేస్తున్నా కూడా ఆడదనే నిర్లక్ష్యభావం పోనేలేదు. వారు చెప్పినట్లు పెండ్లిచూపులప్పుడు జూలో జంతువుల శల్యపరీక్షలు చేసి పెండ్లి చేసుకొన్న యువకుడు తాళికట్టిన మరుసటిరోజు తనను దగ్గరకు తీసుకొంటే ఆ అమ్మాయి అన్నీ మరచిపోయి అతనే దేవునిగా భావించి ఆరాధిస్తుంది. కానీ అలా గాకుండా అతను ఆమెను కన్నెత్తి చూడకుండా ఎవరో పరాయి స్త్రీగానే చూస్తున్నట్లు ఉంటే ఇంక ఆమె మనస్సు ఎలా ఉంటుందో మనమే చెప్పలేము. స్త్రీ సోదరిగాను, భార్యగాను, తల్లిగాను తన కర్తవ్యాన్ని నెరవేర్చినా కూడా స్త్రీ ఇంకా అబలగానే పరిగణింపబడుతున్నదంటే చాలా శోచనీయం. రచయిత్రికి నా అభివందనములు.

సి. భారతి (కావలి)

* * *

రమగారు వ్రాసిన స్త్రీ' వ్యాసములో ప్రతి ఒక్క విషయం అక్షరాల జరుగుతున్నదే.

ఎన్. లక్ష్మీరెడ్డి (గొన్నబండ)

* * *

అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యన్ను భర్త ఎంత పిచుడైనప్పటికీ, ప్రేమగా చూచుకుంటాడు. పిచత్వమువలన ఏవైనా మాటలు అన్నప్పటికి బాధపడేటప్పుడు చూచి సహించడు. మంచివారిని గురించి వేరే వ్రాయనక్కరలేదు. భార్యను పువ్వులలో పెట్టుకొని పూజిస్తారు. ఈ రోజులలో రెండవ తెగవారే చాలా ఎక్కువగా కనిపించుతున్నారు.

అక్క, చెల్లెళ్ళు చదువుకొని జ్ఞాన సముపార్జన చేసుకొంటూవుంటే ఏ తమ్ముడు, అన్న ఈర్ష్యపడడు.

వివాహ విషయములలో ఆమెగారు వ్రాసిన బి. సి. నాటి ఆచారాలు ఎక్కడో కాని, నడిపించుట, చదివించుట పాడించుట లాంటి శల్యపరీక్షలు చాలా తక్కువ.

భార్యను భర్త చాలా అనుమానించుతాడని, రాక్షసుడులా బాధించుతాడని వ్రాసినారు. ఇది భర్తల యెడలే కాదు, భార్యల యెడల కూడా వర్తించుతుంది. ఎంతమంది భార్యలు, భర్తలను అనుమానించి ఇంటికి రాగానే ఇల్లును నరకముల తయారుచేయుటలేదు. ఎంతమంది భార్యలు, భర్తలను పనికిమాలినవాళ్లుగా చేసి, తమ చేతులలో కీలుబొమ్మలులాగా ఆడించుటలేదు ? ఇది భర్తను అవమానించుట కదా ? ఇవి అన్నియిప్పుడు మన కనులకు కనిపించుతున్న సత్యం. ఆవిడ చెప్పినట్లు ఎక్కడైనా భర్త భార్యను హింసించుతున్నాడు అంటే, లేక నేను వ్రాసినట్లు భార్య, భర్తను హింసించుతున్నది అంటే ఇది అంతా పరిస్థితుల ప్రభావమే.

కనుక స్త్రీని అని, పూర్తిగా స్త్రీ పక్షపాతము వహించు పురుషులను దుయ్యబట్టి వారి మనస్సులను బాధించుట ఏమంత సమంజసముగా లేదు.

డి. టి. సీత (రాయపూరు)

## "పంజాబీల పరిణయం"

పంజాబీల పరిణయం' చాలా బాగున్నది. వారి ఆచార వ్యవహారములను, పద్ధతులను ముగుణగారు ప్రత్యక్షంగా జరుగుతున్నట్లే వ్రాసేరు. ఆ వ్యాసం చదువుతున్నప్పుడు నేను నిజంగా చూస్తున్నట్లే ఉంది. ఇకముందు కూడా అటువంటి వ్యాసాలనే ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.

పూ. లక్ష్మి (శ్రీకాకుళం)

* * *

6—9—63 ఆంధ్రపత్రికలో ప్రచురితమైన "పంజాబీల పరిణయం" చదివాను. రచయిత్రి ఏదో వ్రాసింది. మీరు ఏదో దానిని పత్రికలో ప్రచురించారు. అందులో "ఆజ్ హమారే ముండాకా ముండన్ హై" (వాళ్ల అబ్బాయి పుట్టు వెంట్రుకలు తీయుట) మీరు (పత్రిక వారు) కొంచెమన్నా ఆలోచించకుండా ఎలా ప్రచురించారా అని అనుకొంటున్నాము. ఎక్కడన్నా పంజాబీలకు వెంట్రుకలు తీస్తారా. వారు పుట్టింది మొదలు చచ్చేవరకు మంగలికత్తిని దగ్గరకు రానీయని సంగతి ఆ రచయిత్రికి తెలియక పోవటం చాలా శోచనీయం. (పంజాబ్‌లో ఉన్నట్లు వ్రాసినారు.)

టి. రామలక్ష్మి (పాలకొల్లు) ★




(గత సంచిక తరువాయి)

"మేము మీతో మాట్లాడాలని వచ్చాం" అన్నాడు ప్రకాశం.

ఆమె చిత్రంగా వాళ్ళవంక చూసింది. "నాతోటి మాటాడతారా? ఏం మాటాడతారు?"

"మా ఫ్రెండొకడు పిక్చర్ తీస్తున్నాడు...."

మాట మధ్యలో ఆపి—"రండి—కూర్చోండి" అందామె. అంతా అక్కడున్న కుర్చీల్లో కూర్చు కూర్చున్నాము. "ఇప్పుడు చెప్పండి!" అందామె. ప్రకాశం మొదలు పెట్టాడు.

"మా స్నేహితు డొకడు పిక్చర్ తీస్తున్నాడు. అందులో వీడు—మిస్టర్ విశ్వనాథం హీరోగా బుక్కయ్యాడు." అహల్య విశ్వనాథాన్ని క్రీగంట చూసింది. విశ్వనాథం ఓసారి క్రాపింగ్ సర్దు కున్నాడు.

"వీడు మిస్టర్ సుందరం—కమేడియన్" సుందరం వెకిలిగా నవ్వాడు.

"వీడు మిస్టర్ శంకర్రావ్. విలన్" శంకర్రావు ఏదో ఆలోచిస్తూ ఎటో చూస్తున్నాడు.

"వీడు మిస్టర్ గోపాలం. మ్యూజిక్ డైరెక్టర్. నేను మిస్టర్ ప్రకాశం. పాటలూ—మాటలు రాస్తున్నాను—ఇదీ మా పరిచయం....."

"ఇంతకీ మీరేమంటారు?" అందావిడ.

"మీకు సినిమాల్లో కాస్తో కూస్తో అనుభవం ఉంది. మా కదిలేదు. మీబోటి అనుభవ శాలులర దగ్గిర తెలుసుకోవలసిన విషయాలు చాలా ఉంటా యని నా నమ్మకం. అందుకే మీ దగ్గర కొచ్చాము. మీ అనుభవాలు మాకు చెప్తారని ఆశిస్తున్నాను"

"ఆమె విసుగ్గా చూసింది. "నే నెన్నో పిక్చర్లో యాక్టు చెయ్యలేదు. నా అనుభవం ఏం ఎక్కువని. అయినా అవి మీకు చెప్పడంవల్ల నాకేం ప్రయో జనం."

"మీకూ ప్రయోజనం ఉంది. మీ అనుభవా లన్నీ రాసుకుని—అహల్యగా నా అనుభవాలనే హెడ్డి గుతో మీ జీవిత చరిత్ర రాసి—మీ ఫోటోతో సహా పత్రికలకి పంపి మీవంటి ఆదర్శ నటీమణు లింకా ఎంతోమంది తెర మరుగున ఉండిపోయా రనీ, అటువంటి వారిని వెలుగులోకి తీసుకు రాడాని కంతా కంకణం కట్టుకోవాలనీ ఉద్బోధిస్తాను. దాంతో పెద్ద సంచలనం రేగుతుంది. అందుకే.."

"సరే— అయితే రాసుకోండి చెప్తాను. కానీ ఎలా మొదలు పెట్టమంటారు?"

"మీకా శ్రమ అవసరంలేదు. నే నడిగే ప్రశ్న లకి జవాబులు చెప్పండి. చాలు"

"సరే అడగండి చెప్తాను"

"మీ స్వగ్రామం ఇదేనా?"

"ఇదే!"

"మీ తల్లి దండ్రుల పేర్లు?"

"తల్లి వెంకమ్మ— తండ్రి రామయ్య"

"సుమారుగా మీరు పుట్టిన సంవత్సరం?'

"1945"

"అంటే మీ వయస్సిప్పుడు 18 ఏళ్ళన్న మాట!" సుందరం తన ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశాడు.

"ఒక్క నిముషం వూరుకోరా!" అన్నాడు ప్రకాశం.

"మీ అసలు పేరు"

"సుబ్బమ్మ"

"మీరు పేరెపుడు మార్చుకున్నారు?"

"మొదట సినిమాలో నటించడానికి వెళ్ళి నపుడు డైరెక్టరు గారా పేరు బాగోలేదని తీసేసి, 'తార' అని పెట్టారు. అహల్య కారక్టరు వేశాక నాకా పేరు వచ్చింది. అప్పట్నించీ అహల్యగా పేరు మార్చుకున్నాను."

"సరే— మీకు చిన్నప్పట్నించీ నాటకాలంటే ఇష్టమా? మీరు సినిమాల్లో ఎలా ప్రవేశించిందీ చెప్పగలరా?"

"నాకు చిన్నప్పట్నించీ నాటకాలంటే చాలా ఇష్టం. హైస్కూల్లో ఆడపిల్లల నాటకాల్లో ఎప్పుడూ నాకే ఫస్టు ప్రైజు వచ్చేది. నా నటన సామాన్యమైంది కాదనీ ముందు ముందో మహా నటినై పోతాననీ హిందీ మేస్టారంటూండేవారు. ఓసారి మద్రాసు వెళ్ళాను. అక్కడ మాపిన్నిగా రున్నారు. మా బాబాయి స్నేహితు డొకాయన ఫిలిం డైరెక్టరుట. ఓసారి మా ఇంటి కొచ్చి నన్ను చూశాడు. మా బాబాయితో ఏం మాట్లా డాడో ఏమో కానీ— "అమ్మాయ్— నువ్వు సిని మాల్లో వేషం వేస్తావా?" అని అడిగాడు. నాకు

చాలా సంతోషం కలిగింది. వేస్తున్నాను. ఆ డైరెక్టరు చాలా మంచివాడు. అందాకా ఖాళీ లేదని — అప్పుడు తను డైరెక్టు చేస్తున్న సీతా రామ కళ్యాణంలో అహల్య కారక్టరిచ్చాడు. చిన్న పోర్షనైనా బాగా చేశావని అంతా మెచ్చుకున్నారు. మొదటిరోజు మేకప్‌లో రాముని ముందు నించుని మాట్లాడుతుంటే నాకు చచ్చే సిగ్గయింది. పైగా అందరి దృష్టులూ నామీదేగదా—కెమేరామన్ కూడా నాకేసే కెమేరా పెట్టాడు. ఐనా డైలాగులు చెప్పే సమయానికి నేనా పాత్రలో లీనమైపోయాను. పరిసరాలు మర్చిపోయాను. మనసు నిండా శ్రీరామచంద్రుడే నిండిపోయాడు. ముందు ముందు వృద్ధిలోకి వచ్చే సూచనలు చాలా ఉన్నాయన్నాడు డైరెక్టరుగారు.''

''మీ చిత్రాలేమన్నా తయార్లో ఉన్నాయా?''

''ఆ! ఉన్నాయి. లవకుశ చిత్రంలో ప్రజలు కరువు కాటకాలతో బాధ పడుతూంటారు. అందులో నేనూ ఉన్నాను. తరువాత భేతాళమాయలో కొంతమంది చెలికత్తెలతో రాజకుమారి దేవాలయానికి వెళ్తుంది. రాజకుమారుని చూడాలని చాల మంది జనం వస్తారు. ఆ జనంలో నేనూ ఉన్నాను.''

''మీరు నటిస్తున్న సాంఘిక చిత్రాలేం లేవా?''

''లేకేం ఉన్నాయి. చదువుకున్న అబ్బాయిలు చిత్రంలో డ్రామా వేస్తారు. అందులో డ్రామా చూడ్డాని కొచ్చిన ప్రేక్షకుల్లో నేను ఫ్రంట్ రోలో కూర్చున్నాను. విధి లీలలులో హీరోయిన్ పక్క నాట్యం చేసే నలుగురిలో ఒకరిగా ఇది కొంచెం పెద్ద పోర్షన్—పాటలో నాకూ కొంచెం పాట ఉంది. ''చెలి ఎవరినో తలచింది'' అంటే నేను ముందు కొచ్చి ''తలచిందీ'' అంటాను. మళ్ళీ ఏదో పిక్చర్లో యాక్టు చెయ్యవలసిందిగా విన్ననే డైరెక్టర్‌గారు లెటర్ రాసేడు. ఇది కొంచెం పెద్ద పోర్షనే. మరణశయ్యమీద హీరో చెల్లెలుగా నటిస్తున్నాను.''

'' —కంగ్రాట్యులేషన్స్—మీకు చాలా శ్రమ ఇచ్చినట్లున్నాం—వస్తామండి'' అన్నాడు ప్రకాశం. అంతా లేచారు. ''ఇందులో శ్రమకేముంది — కాఫీ ఐనా తీసుకోకుండా వెళ్ళిపోతున్నా'' రందామె.

అంతా మాటాడకుండా బయల్దేరారు. ''ఒక్క మాట— ఏమైనా వీలుంటే నాక్కూడా అవకాశ మిప్పించమని మీ స్నేహితుడితో చెప్పండి.''

''తప్పకుండానూ!'' అన్నాడు ప్రకాశం. అంతా బైట కొచ్చేశారు.

''ఇక్కడికొచ్చి తెలుసుకుని ఏడ్చిం దేముంది. అంతా ఆవిడ డబ్బా తప్పితే'' అన్నాడు సుందరం. ''ఏమో అనుకున్నాను. కేవలం ఎక్స్‌ట్రారా ఈవిడ'' అన్నాడు విశ్వనాథం.

''మనిషి బ్యూటిగానే ఉంది- మరి!'' అన్నాడు గోపాలం.

''తదువరి కర్తవ్యం'' అన్నాడు శంకర్రావు.

''నాటకాల రావుగారింటికి.......''

నాటకాలరావు గారిది పెద్ద డాబా ఇల్లు. చూడ్డానికి స్టైలుగా ఉంటుంది. వీధరుగు మీద కూర్చునున్నాడాయన కుర్చీలో— చుట్ట కాలుస్తూ—

''నమస్కారమండి!'' శంకర్రావాయనకి

# స్వంతు సినిమాకథ

నమస్కారం పెట్టాడు. కాబోయే విలన్‌గదా మరి.......

''ఎవరు మీరు?'' ఆయన హుందాగా రావణాసురిడిలా నవ్వుతూ అడిగాడు. ''మీతో పనుండి వచ్చామండి. యువ నటులం. మీ సలహాలకోసం....''

ఆయన కళ్ళల్లో గర్వం వెలిగి మాయమైంది. ''రండి— లోపలికి''— రావణాసురుడి డైలాగులు.

అంతా లోపల కుర్చీల్లో కూర్చున్నారు. ప్రకాశం తన మొదటి ప్రశ్నని అడిగాడు: ''మీరు రావణాసురుడి పాత్రను చాలా బాగా పోషిస్తారని విన్నాను. విన్నానేగాని చూసిన భాగ్యం నాక్కలగలేదు. అంచే తనే అడగవలసివస్తోంది. మిగతా రావణాసురుళ్ళకీ, మీకూ తేడా ఏమిటో చెప్పగలరా?''

''నేను అసలు సిసలైన రావణాసురుణ్ణి. మిగతా వాళ్ళంతా నటులు మాత్రమే అదే వాళ్ళకీ నాకూ తేడా. నేను రావణాసురుడిగా యాక్టు చేస్తుంటే— సీత వేషం వేసినావిడ ముగ్ధురాలై నన్ను ప్రేమించింది. ఆవిణ్ణే పెళ్ళి చేసుకున్నా కూడా—''

పాత పుస్తకాల షాపులో ఒకతను తెగ వెతుకుతున్నాడు. ఏమిటయ్యా? అంటే నేను పోయిన యుద్ధకాలంలో రాసిన వంట పుస్తకం అన్నాడు. ఎందుకూ అంటే నాకు రెండో పెళ్ళి అయిందన్నాడు.

పి. రాజేశ్వరరావు (మద్రాసు)

''మదరిండియా తరవాత నర్గిస్—సునీల్ దత్తును ప్రేమించినట్లు'' విశ్వనాథం ఆయన్ని సినిమా యాక్టర్స్‌తో కంపేర్ చేశాడు.

అంతలోనే ఆయన రౌద్రాకారం దాల్చాడు. కళ్ళు ఎర్రబడ్డాయి. ఎల్లాగో తమాయించుకుని అన్నాడు.

''నాకు సినిమా వేషధారులంటే చాలా కోపం. వాళ్ళ సంగతి నా దగ్గర చెప్పి, నాకు కోపం తెప్పించకండి. ఇంతకీ మీరు......''

''నటుడి కుండవలసిన లక్షణాలు తెలుసుకోవాలని వచ్చాం'' మాట మధ్యలో ఆపి, అయనిలా అన్నాడు.

''చెప్తా వినండి—అయినా నటన తెలుసుకుంటే వచ్చేదికాదు. అది పుట్టుకతో రావాలి. అలా అని సాధన చేస్తే రాదని నేననడం లేదు. తప్పకుండా వస్తుంది. అందుకే చెప్తున్నా విన్నండి. నటించేప్పుడు మీరు నటిస్తున్నామనుకోకూడదు. ఆ పాత్రలో మీరు లీనమైపోవాలి''

తన పాత్రలో లీనమైన అహల్య గుర్తుకొచ్చింది సుందరానికి.

''తరువాత మీరు చుట్టు పక్కల దృష్టి ఉంచకూడదు. ఎదురుగా ప్రేక్షకులు చూస్తున్నారనీ.......''

''వాళ్ళలో అహల్యలాంటి ప్రేక్షకుల వేషంలో ఎక్స్‌ట్రా లుంటారనీ'' అనుకున్నాడు గోపాలం.

''మన మిప్పుడు ఇరవయ్యో శతాబ్దంలో ఉన్నామని మర్చిపోవాలి. ఆ పాత్రతోపాటు ఆ కాలానికి వెళ్ళిపోవాలి. ఇవన్నీ అలవర్చుకొన్నవాడే ఎవడైనా నటుడయ్యేది.''

ప్రకాశం చప్పట్లు కొట్టాడు. ''చాలా బాగా చెప్పారండీ—మీరు చెప్పిన లక్షణాలన్నీ అలవర్చుకుంటే మేము మీలా గొప్ప నటులం కావచ్చు.''

''చెప్పడాని కేముంది. చాలా సులభం. కానీ ఇది ఆ చరణలో పెట్టడం కష్టం. అలా పెట్టిన నాడు నాకే మీరు పాఠాలు చెప్తారు'' అన్నాడాయన.

''బాగుందండీ—రావణాసురుడిగా మీ అనుభవాలు చెప్తారా?''

''అనుభవాల కేముంది? ఇందాకా చెప్పినట్లు అప్పుడు నేను మామూలు నాటకాల రావును. లంకాధీశ్వరుణ్ణి. నా చుట్టూ ఏముందో నాకు తెలీదు. సీతా వ్యామోహం—శివభక్తి, ఇవే నాకు తెలిసినవి. ఆ నాలుగ్గంటలూ నా కొళ్ళు తెలీదు.''

''చాలా సంతోషమండీ—ఇంతకీ మీరు ఇతర వేషా లేవయినా వేశారా? లేక.....'' ఇంకా మాట పూర్తి కాకుండానే ఆయన ''ఆయ్'' అని గర్జించాడు.

నిజంగా రావణాసురుడే కాబోలు ననుకుని— భూమి కంపించింది.

''ఒకటేం ఖర్మ—లక్ష వేషాలు వేశాను. రావణాసురుడంటే నాకు నచ్చిన పాత్ర అంతే. తెలిసిందా'' ప్రతీ పదాన్ని ఒత్తి ఒత్తి పలుకుతూ అన్నాడాయన.

రావణాసురుడి ముందు దేవతల్లా, మిత్రులంతా తలలూపారు. ప్రకాశం మాత్రం నారదుడిలా నవ్వుతూ, తను రావణాసురుడి పార్టీయే నన్నట్టు, ''అవునండి—నచ్చిన పాత్రంటూ ఉండడం ఉత్తమ నటుల లక్షణం—'' అనాడు ప్రకాశం.

నాటకాల రావు నవ్వి—''ఇంతకీ మీరేదైనా నాటకం వేస్తున్నార'' అన్నాడు.

''అబ్బే లేదండీ—మా స్నేహితు డొకడు సినిమా తీస్తున్నాడు. అందులో మమ్మల్నందర్నీ నటించమనీ—సినిమా ఫెయిలైనా పరవాలేదనీ బ్రతిమాల్తున్నాడు. మేమూ నటించగలంగానీ, అనుభవంలేదు. మీలాంటి అనుభవశాలుర దగ్గర నటనంటే ఏమిటో తెలుసుకోవాలని వచ్చాం—'' అన్నాడు ప్రకాశం.

హతోస్మి. రావణాసురుడిముందు నారాయణ అనడ మెంతో నాటకాల రావుముందు సినిమా పేరెత్తడ మంతే. నారదుడు ''నారాయణ'' అన్నాడు రావణాసురుడికి ఆగ్రహం ముంచెత్తు కొచ్చింది.

''ఇంతకీ మీరు సినిమా నటులు కాబోతున్నారా? అయితే నా దగ్గర కెందు కొచ్చారు? సినిమా నటులకి నటన అక్కర్లేదు. విగ్రహపుష్టి ఉంటే చాలు. తెలిసిందా—వెళ్ళండి!''

''అది కాదండీ—''ప్రకాశం ఏదో చెప్పబోయాడు.

నాటకాలరావు రావణాసురుడిలా గర్జించాడు. ''దయయుంచి వెళ్ళండి! ఇంక నేను మీకేమీ చెప్పను!''

అంతా లేచి బైట కొచ్చేశారు. తలుపేసిన చప్పుడు చాలా దూరం వినిపించింది.

42 వ పేజీ చూడండి



జరిగిన కథ

భర్త రచన రాయమంటాడు తనకు వస్తువు లభ్యం కాదు. పైగా సంసార తాపత్రయం. కాని గోపాలం అనే కథానాయకుడు సరోజ అనే కథానాయిక లభ్యమయ్యారు....ఐతే రచన ఎలా.... యింతలో అభిమానులు వస్తారు.

(గత సంచిక తరువాయి)

"సరే! కథానాయకుడు ఎలాంటివాడై ఉండాలని మీ ఉద్దేశ్యం."

"మన ప్రబంధాలలోనో, కావ్యాలలోనో గాని హీరో కావలసిన వ్యక్తికి కొన్ని నియమాలున్నా యంటారు. అవేం నాకు తెలీవనుకోండి— సినిమా హీరోకి మాత్రం నొక్కుల జుట్టూ ఫస్టు మార్కులూ ఖాయం."

"మీ రెప్పుడూ నొక్కుల జుట్టు హీరోని సృష్టించలేదా?"

"నా రచనలు ఉత్త గాలి కబుర్లు కాదు. కల్పన కాదు. వాస్తవంగా ఉన్న నొక్కులజుట్టుని కథ కోసం కత్తిరించమంటారా?"

"అయితే కథానాయకుడు కూడా మనలాగే బాధలతో, సమస్యలతో, బలహీనతలతో, నిట్టూర్పులతో, నిరాశలతో ఉండా లంటారా?"

"మువ్మాటికీ—హీరో అనే పాత్రకి ఉమ్మడి లక్షణాలేమీ ఉండవు. ఎవరి చుట్టూ కథ అల్లితే వాడే హీరో! మా చాకలివాడు భార్తిగా పెమ్మర్ని కాల్చుకు తింటున్నాడు. మానిపించేద్దామా అంటే మానని మొరాయిస్తున్నాడు. అతని గురించో కథ రాస్తే అతడు హీరో! అతనికేం నొక్కుల జుట్టు లేదు. అందగాడు కాదు. రాత్రింబవళ్లూ తాగుతూంటాడు. పెళ్లాన్ని పట్టుకు చితక్కొడతాడు. కూతురిని పట్టుకు నానా తిట్లూ తిడతాడు. తప్ప తాగి నేలమీదే పడతాడు. వాణ్ణి గురించి కథ రాస్తే హీరో కాదని ఎవ రనగలరు? —హీరో అంటే కత్తి యుద్ధాలు చెయ్యాలనీ— అప్సరసల్ని ప్రేమించాలనీ, మాంత్రికుణ్ణి చంపాలనీ అనుకోవాలా? పోనీ జానపదాలు వదిలేస్తే సాంఘికంగా మన హీరో కూడా కారు నడిపి కాలేజీలో ఫస్టుప్రైజ్ కొట్టి—జడ్జిగారమ్మాయి ప్రేమించినా నీతికోసం మనసిచ్చిన కూలి పిల్లనే పెళ్లి చేసుకోవాలా? ఏమోనండీ! అటువంటి నియమాలని నేను ఆమోదించను."

"హీరో కూడా మనలాంటివాడే. అయితే అతన్ని చూసి ఇక మనం నేర్చుకోవలసిందేమిటి?"

"హీరో మనకేదో నేర్పుతాడని కాదు. అతన్ని మనం అర్థంచేసుకోగలిగితే చాలు. మన మంచి చెడ్డలూ, లోటుపాట్లూ ఎటువంటి ప్రేరేపణా లేకుండా మనం తెలుసుకునే సావకాశం లేదు—అందుకే నిత్య జీవితాలకు ప్రతిబింబంగా రచన ఉండాలనటం. దాన్నిబట్టి మనకు కొన్ని ఆలోచనలు కలగటానికీ, తద్వారా మంచి మార్పులు రావటానికీ అవకాశం ఉంది. ఏమంటారు?"

"నిజమేనండీ! నాకూ అలాగే అన్పిస్తోంది."

పాలు తాగటం పూర్తిచేసిన పాప, ఒడిలో ఎప్పుడో నిద్రపోయింది. నెమ్మదిగా పక్కమీద పడుకోబెట్టాను.

41 వ పేజీ చూడండి



## జరిగిన కథ

కర్నల్ థామస్‌నెవిల్, తన కుమార్తె లిడియాతో ఇటలీ యాత్రానంతరం ఫ్రాన్స్ వస్తాడు. లిడియా సాహసం గల యువతి. చిత్రలేఖనం తెలుసు. 'కార్సికా' ఫ్రాన్సు ఇటలీల దరిని గల ద్వీపం. అక్కడికి వెళ్లడం కష్టనష్టాలతో కూడిన పని ఐనా లిడియా, నెవిల్‌లు నావ కాప్టెన్ మాతెతో ప్రయాణం అవుతారు. కార్సికాకు బయలుదేరారు. వారితో లెఫ్టినెంట్ "ఆర్సోడెల్లా రెబ్బియా" అనే కార్సికను కూడా వచ్చాడు. కర్నల్‌కి రానురాను యీ రెబ్బియాతో పరిచయం పెరుగుతుంది. మూడు రోజుల ప్రయాణం తర్వాత వారి నౌక అజాచ్చియో గల్ఫ్ సమీపించింది. వారు కార్సికా చేరారు. పాస్‌పోర్టు ఆఫీసరు మాటలవల్ల, ఆర్సో తండ్రి హత్యకు లోనయ్యాడని మిస్ లిడియా గ్రహిస్తుంది. ఇంతలో ఆర్సో చెల్లెలు కొలంబా అతన్ని వెతుక్కుంటూ అజాచ్చియోకి వస్తుంది. కర్నల్‌గారి సత్రంలోనే దిగుతుంది. కొలంబా, ఆర్సో ఆంటన్‌లు పియత్రనెరాకి వెళ్ళిపోతారు. స్వగ్రామంలో కొలంబా బ్రాందొలాచ్చియో అనే బందిపోటు దొంగకు సహాయం చేస్తున్నట్లు ఆర్సో ఆంటన్ తెలుసుకుంటాడు. అతన్నీ అతని సహచరుడినీ కూడా కలుసుకుంటాడు. పొరుగింటి బాప్టిస్ట్ పియత్రి చనిపోగా పరామర్శకు వెళ్లిన కొలంబా, ఆర్సో ఆంటన్‌లు, తమ విరోధి బారిసీనిని కలుసుకుంటారు.

## 13

ఇక కొలంబా సంగతి: తను ఎవరి విషయమయి ఘోరశపథం చేసిందో ఆ వ్యక్తి కనిపించటంతో ఆమె ముఖకవళిక భయంకరంగా మారిపోయింది. మొహం పాలిపోయింది; గొంతుక జీరపోయింది; పద్యాల పాదాలు పెదవుల మీదనే ఆగిపోయాయి, కాని...త్వరలోనే కోలుకుని మరికొంత ఉద్వేగంతో బల్లాతా చదవటం కొనసాగించింది:

"ఏడుస్తున్నప్పుడు — తన శూన్యమయిన గూడుదగ్గిర-పక్కనే పక్షులు రెక్కలు రెపరెప లాడిస్తూ ఉంటే—ఎంత అవమానం."

ఒకనవ్వు వినపడింది అందరికీ; వచ్చిన ఇద్దరు యువకులకీ ఈ ఉపమానాలు వింతగా అనిపించాయేమో!

"...లేచింది; తన రెక్కలు తెరిచింది-తన ముక్కు నెత్తురులో కడిగింది! — చార్లెస్ బాప్టిస్! నీ మిత్రులు కడసారిగా సెలవు తీసుకుంటున్నారు—వారి కన్నీరు పారుతునే ఉంది—అనాధ శిశువు మాత్రం ఇక ఏడవదు నువ్వు రోజంతా నిద్రలోనే మునిగి ఉన్నావు—నీ కుటుంబం మధ్యలో—అనాధ అయిన బిడ్డ తండ్రికోసం ఏడుస్తుంది—హంతకుల అఘాతాలకి—వెనకనించి తగిలిన దెబ్బలకి-తన తండ్రి ఎర్రని నెత్తురు రంగుకి-పచ్చని ఆకుల పొదలకింద—కాని ఆమె నెత్తురు వృధాపోనివ్వదు—నిరపరాధి రక్తం—పియత్రనెరాలో చల్లుతుంది—భయంకరమయిన విషం తయారవుతుంది—పియత్ర నెరాకి ఇదే చిహ్నం —ఇంతవరకు అపరాధి నెత్తురు-నిరపరాధి నెత్తురుతో కలిసిపోవాలి."

ఈమాటలతో కొలంబా ఒక కుర్చీమీద పడిపోయి ముసుగు కప్పేసుకుంది. వెక్కి వెక్కి ఏడ్చిన శబ్దాలు వినిపించాయి. ఆమెతోబాటు తక్కిన స్త్రీలుకూడా ఏడవడం ప్రారంభించారు. మగవారు కొందరు అయిష్టంగా మేయర్ వంకా, అతని కొడుకులవంకా చూడటం మొదలు పెట్టారు వీరిరాక ఎంతో అసభ్యంగా ఉందని నసిగారు కొందరు ముసలివారు. మరణించిన వ్యక్తి కొడుకులు అతన్ని అక్కడినుంచి వెళ్లిపోవలసిందిగా కోరటానికి సిద్ధం అయ్యారు. కాని ఇది అవసరంలేకపోయింది. అతనే తలుపుదగ్గిరికి వెళ్లాడు. కొడుకులు ఇద్దరూ అప్పటికే వీధిలోకి వెళ్లిపోయారు. అధికారి ఏవో మాటలతో చిన్న పియత్రిని సముదాయించి బయటికి నడిచాడు. ఆర్సో తన చెల్లెలిని సమీపించి ఆమె రెక్కపుచ్చుకుని లేవదీసి గది వదిలి పోవటానికి ఉద్యుక్తుడయ్యాడు. "వారివెంటే వెళ్లండి!" అన్నాడు పియత్రి తన స్నేహితులు కొంతరితో. "ఎవరూ వారిదగ్గిరకి రాకుండా చూడండి!"

ఇద్దరు ముగ్గురు యువకులు తమ కత్తులు ధరించి ఆరో, అతని చెల్లెలి వెంట ఇంటి ముఖద్వారం వరకూ వెళ్ళి మరీ సాగనంపారు.

కొలంబా ఆయాసపడుతూ, ఆవేశంలో ఒక్కమాట కూడా మాట్లాడలేకపోయింది. తల అన్నగారి భుజం మీద ఆన్చివేసింది. ఆమె ఒక చేతిని ఒకదానిని తన చేతుల్లోకి తీసుకున్నాడు ఆర్సో. ఏమంటే ఎలా బాధపడుతుందో అని ఆర్సో ఆమెని ఒక్కమాట అనలేదు. ఇంటిని చేరుకున్న తర్వాత ఆమె మనస్సు కుదుటపడేవరకూ ఊరుకోవటం మంచిదనుకుంటూ ఉండగా ఎవరో తలుపుతట్టారు; సవెరియా లోపలికి వచ్చి, "అధికారి వచ్చా"రని చెప్పింది. ఇది విన్న కొలంబా ముఖంలో మళ్లీ కొత్త జీవనకళ ప్రవేశించింది. వణుకుతూనే ఒక కుర్చీకి ఆనుకుని నుంచుంది.

అధికారి తను అంత ఆలస్యంగా వచ్చి వారికి ఇబ్బంది కలిగించినందుకు మన్నించమని కోరాడు. 'బల్లాతా' పాడటం వల్ల మనస్సుకి ఎంత శ్రమో చెప్పాడు. ఆమె చివర కట్టిన పద్యాలు చెప్పతగినవి కావని సూచించాడు. తర్వాత కంఠస్వరం మార్చి, "దెల్లా రెబ్బియా గారూ మీ ఇంగ్లీషు మిత్రుల అభినందనలు తీసుకువచ్చాను. మిస్ నెవిల్ మీ చెల్లెలికి 'వెయ్యి శుభాకాంక్షలు' అందచెయ్యమంది. మీ కోసం ఒక ఉత్తరం — కూడా పంపించింది!" అన్నాడు

"మిస్ నెవిల్ దగ్గరనుంచి ఉత్తరమా!" అని అరిచాడు ఆర్సో.

"దురదృష్టవశాత్తు ఆ ఉత్తరం నా దగ్గర లేదు. కాని అయిదు నిముషాల్లో మీకు చేరేట్లు చేస్తాను. దెల్లా రెబ్బియాగారూ, మిస్ నెవిల్

38 వ పేజీ చూడండి



# కలగా నిలిచిన సొరంగం

క్రలలు కరిగిపోయినా స్మృతులు మాత్రం మిగిలి ఉంటాయిట. సరిగా ఇలాగే జరిగింది నెపోలియన్ విషయంలో. 1802 లో ఓ ఫ్రెంచి ఇంజనీరు ఇంగ్లాండుకు ఫ్రాన్సుకు మధ్య సొరంగ మార్గం ఏర్పాటుచేస్తే బాగుంటుందని సూచించాడుట. 'ఇంగ్లీషు ఛానల్' అతి సన్నగా ఉండేచోట అంటే డోవర్ — కేలెయస్‌ల మధ్యో, ఫోక్‌స్టోన్ బౌలోగ్నె దగ్గరో, భూగర్భంలో సొరంగమార్గం ఏర్పాటుచేయటం ఈ ప్రతిపాదన ఉద్దేశ్యం.

ఆనాడు మొదలు గత 150 ఏళ్లుగా ఈ విషయం నలుగుతూ ఉంది. పథకాన్ని పునరుద్ధరించేందుకు సమావేశాలు జరుపటం, ధనం వసూలుచెయ్యటం వగైరాలన్నీ జరిగాయి గానీ, అసలు పని మాత్రం ప్రారంభం కాలేదు. యుద్ధమంటూ వస్తే భూగర్భమార్గం శత్రువుల దాడికి వీలౌతుందేమోనని భయంతో వాయిదాలు వేసుకుంటూ వచ్చారు. ఆటంబాంబులు, జెట్ విమానాలు బయల్దేరిన ఈ యుగంలో ఈ భూగర్భమార్గాన్ని దాడికి ఉపయోగించే అవసరమే లేదు.

అందుకనే ఇటీవల యిద్దరు అమెరికన్‌లు ఒక ఆంగ్లేయుడు, ఒక ఫ్రెంచి జాతీయుడు ఈ పనిని ప్రారంభించాలని నిర్ణయించుకున్నారట. దీనికి తోడు కొందరు ధనవంతుల సహకారం కూడా లభించే సూచనలున్నాయిట.

ఈ సముద్రం అడుగుభాగం చాలా మెతకగా ఉంటుందని, అందువల్ల పెద్ద పెద్ద గొట్టాలు సులువుగా చొప్పించవచ్చనీ పరిశీలనలవల్ల తేలింది. సైకిళ్ల దగ్గర్నుంచి, రైళ్లదాకా కూడా ఈ గొట్టాలగుండా ప్రయాణంచేసే అవకాశం ఉంటుందిట. ఫ్రాన్సు నుండి ఇంగ్లాండు దాకా సైకిలు తొక్కటమంటే చాలా వింతగానే ఉంటుది.

ఈ పథకానికి ఉద్దేశించిన డోవర్ పట్నం చాలా పురాతనమైంది. ప్రసిద్ధమైందీ కూడా. కారణ మేమంటే యూరపు ఖండంలో అతి దగ్గరి రేవుపట్నం డోవరే. ఈ తీరపు తెల్లని ఇసుకతిన్నెలమీద ఎత్తయిన దుర్గం ఒకటుంది. ఈ దుర్గంలో ఫరావోల గోపురం క్రీ. శ. 46 నాటిది ఉంది. క్రైస్త్వాలయాల్లో అతి ప్రాచీనమైన చర్చీలు కూడా ఉన్నాయి.

డోవర్‌కు దగ్గర్లోనే డీల్ అనే సముద్ర తీర ప్రాంతం ఉంది. క్రీ. పూ. 55 లో



డోవర్ దుర్గం (ఇంగ్లాండ్) లోని కానిస్టేబుల్ బురుజు

జూలియస్ సీజర్ ఇంగ్లాండు మీద దండయాత్రకు వచ్చి ఇక్కడే దిగాడు. ఇప్పుడిది అందమైన 'బీచ్' లలో ఒకటి. ఇక్కడికి 7 మైళ్ల దూరంలోనే ఉన్న ఫోక్‌స్టోన్ కూడా సందడిగల సముద్ర ప్రాంతాల్లో ఒకటి.

యుద్ధకాలంలో డోవర్ బాగా దెబ్బతిన్నా త్వరలోనే కోలుకొంది. ఈ పట్నానికి సరిగ్గా ఎదురుగానే ఫ్రాన్సు తీరంలో కెలెయస్ రేవుపట్నం ఉంది. సందడి గల ఈ రేవుపట్నం కూడా అతి ప్రాచీనమైందే 13 వ శతాబ్దం నుంచీ ఉంది. యుద్ధకాలంలో పాత కట్టడాల్లో చాలాభాగం నాశనమై పోయాయి. అలాగే కెలెయస్ దగ్గర్లో మత్స్య పరిశ్రమకు కేంద్రంగా ఉన్న లూగ్నెలో కూడా 85 వంతుల భవనాలు యుద్ధకాలంలో నాశనమైపోయాయి. కాని, ఈ పట్నాలు రెండు త్వరలోనే అభివృద్ధిని సాధించాయి. ఇంగ్లాండును జయించే ఉద్దేశ్యంతో సీజర్ తన 800 నౌకాదళంతో దండయాత్ర కుపక్రమించింది ఈ బౌలోగ్నె రేవుపట్నం దగ్గర్నుంచేట. దరిమిలా 1803 వ బౌలోగ్నె తయారీలు 2000 చదరపు పడవలు 900 ల నౌకలతో నెపోలియన్ కూడా ఈ రేవుపట్నం నుంచే ఇంగ్లాండును జయించేందుకు బయల్దేరాడు. కాని ట్రఫాల్గర్ దగ్గర జరిగిన యుద్ధంలో నెల్సన్ ఫ్రెంచినౌకా దళాన్ని ముంచివేయటంతో నెపోలియన్ కల నెరవేరనే లేదు.

కెలెయస్ పారిస్ రోడ్డుకు పడమరగా ఉన్న ఇసుకతీరాలు, అక్కడవారి వాహ్యాళికి చక్కగా ఉపయోగిస్తున్నాయి.

— టెంపిల్ మానింగ్. ★




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

## గ్రహస్థితి

మిథునంలో రాహువు, సింహంలో బుధుడు, కన్యలో సూర్యశుక్రులు, తులలో అంగారకుడు, ధనుస్సులో కేతువు, మకరంలో శని, మీనంలో గురువు, ధనుర్మకర కుంభ మీనాలలో చంద్రుడు.

**27-9-1963 శుక్రవారము మొదలు**
**3-10-1963 గురువారము వరకు**

### మేషం:

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ వారం కుటుంబ విషయాలు అంత తృప్తి ఈయవు. శ్రమపడినప్పటికి ఉపయోగం తక్కువ. ఇంతకుముందు ఇతరుల చేతికి పోయిన వస్తువులను గురించి ఆశ వదులుకుంటారు. చేతిలోని ధనం ఖర్చు పెట్టిన తరువాత అవసరాలు పెరుగుతవి. కొన్ని సమయాలలో స్వల్ప విషయాలు కూడా కలహాలకు దారితీస్తవి. భాగస్థులతోను కోర్టు వ్యవహారాలలోను సామదాన పద్ధతులను మాత్రము అనుసరించటం అవసరం. ఆలోచించకుండా శక్తికి మించిన వాగ్దానాలను చేసి బాధపడతారు. మీ క్రింది పనివారితో జాగ్రత్తగా ఉండవలసిన సమయం. 27, 28 తేదీలలో వృత్తిలో శ్రమ, ఆడంబరపు ఖర్చు.

* * *

### వృషభం:

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఈ సమయంలో పైకి దర్పంగానే ఉంటారు. ఆరోగ్యం మాత్రం సరిగా ఉండదు. మీకు ముఖ్యులైన వారే కొన్ని సమస్యలను లేవతీయటానికి చూస్తారు. వృత్తిలో మీ దూరదృష్టివల్ల పైవారి ఆదరాభిమానాలను పొందగలుగుతారు. ధన విషయంలో మాత్రం కొంత శ్రమ కనుపిస్తు ఉంటుంది. శుభ, సంతోష విషయాలలో పాల్గొంటారు. ఒక సందర్భంలో మీ మనస్సుకు విరుద్ధమైన పనులనే చేయవలసిన అవసరం కలుగుతుంది. సంఘ కార్యాలలో మీ శక్తి పెరుగుతుంది. ఇంతకు ముందు ఏర్పడిన అభిప్రాయ భేదాలు, ప్రతిబంధకాలు సమసిపోతవి. 28, 29 తేదీలలో పనులలో నిదానము, సంతోషవార్తలు.

* * *

### మిథునం:

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

సుఖం తక్కువ. బాధ్యతలు మాత్రం పెరుగుతవి. క్రొత్త ప్రయత్నాలు ఏవీ అంతగా లాభించవు. స్నేహితులవల్ల ప్రయోజనం కన్నా శ్రమ, ఖర్చులు అధికంగా ఉంటవి. వృత్తిలో గౌరవప్రదంగా ఉంటుంది. మాటలలో తొందర పడవద్దు, ప్రయాణ సూచనలున్నవి. కుటుంబంలో తరచు అనారోగ్యాలు కనుపిస్తవి. ఈ సమయంలో మీ ఆలోచనలు సాహసంతో కూడి ఉంటవి. వ్యవహారరంగంలో ఇతరులమీద ఆధారపడవలసి వస్తుంది. ధనాదాయం బాగుంటుంది. అధికారులతో సంప్రదింపులు అనుకూలిస్తవి. వాహనాల మీద ప్రయాణాలలో జాగ్రత్తగా ఉండండి. 29, 30 తేదీలలో ఆందోళన, వృథాఖర్చులు.

* * *

### కర్కాటకం:

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

వ్యవహారరంగంలో జయప్రదంగా ఉంటుంది. అయితే సులభంగా మాత్రం ఉండదు. మంచి వారితో స్నేహ సంబంధాలు ఏర్పడి మనశ్శాంతి లభిస్తుంది. ఈ సమయంలో మీ ఆలోచనలను, పనులను విమర్శించే వారు ఉంటారు. కుటుంబంలోని కార్యక్రమాలలో పరస్పర సహాయం లభిస్తుంది. శుభవార్తలు వింటారు. అధికారుల వల్ల చిక్కు రావచ్చుననే సూచనలు కనుపించినా ప్రత్యక్షంగా అటువంటిది ఏమీ ఉండదు. పదిమందికి సంబంధించిన కార్యక్రమాలలో మీ బాధ్యత పెరుగుతుంది. ధనవ్యయం చేయు సందర్భంలో దూరదృష్టి అవసరం. పుణ్యకార్యాలు జరుగుతవి. 30, 1 తేదీలలో కష్టవార్తలు, కార్యభంగం.

* * *

### సింహం:

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

స్వయంకృషి పైన ఆధారపడతారు. గౌరవము, ధనాదాయము బాగుంటవి. అపవాద సూచనలు కనుపించగలవు. అధికారులవల్ల మేలు కలుగుతుంది. స్నేహితుల మాటలలో ఏది నిజము, ఏది కాదు అని నిర్ణయించటం కష్టం. వృత్తి వ్యాపారాలలో మీ ఆలోచనలను మార్చుకొనవలసి వస్తుందే కాని, ఫలితం బాగుంటుంది. కుటుంబంలో మీ కోర్కెలు పూర్తికాక పోవచ్చు. మీకు కావలసిన హంగులు, సౌకర్యాలు సమయంలో అమరవు. వ్యవహార విషయాలలో గౌరవం లభిస్తుంది. సంఘ కార్యాలలో పాల్గొంటారు. విద్యా

## ఈ వారము ధరలు

పసుపుధర వారం ఆరంభంలో మందీ, కాని, క్రమంగా పెరుగుతుంది. వేరుశనగ పప్పు నూనె ధరలు కొద్దిగా పెరుగుతుంది. మాపుల ధర సాధారణంగా ఉంటుంది. ప్రత్తిధర పెరుగుతుంది.

విషయంలో అనుకూలమైన సమయం. 1, 2 తేదీలలో సంతోషవార్తలు, ఇష్టవస్తు లాభము.

### కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

సమయము, సందర్భము కనిపెట్టి నడుచుకొనవలసి ఉంటుంది. మీరు ఎవరి సహాయం కోరి వెళ్ళినా మధ్యవారివల్ల ఆటంకాలు ఏర్పడే అవకాశాలున్నవి. శక్తిని మించి ఖర్చు చేస్తారు. వారం మధ్యలో కష్టవార్తలు తెలుస్తవి. బంధుమిత్రుల మనస్తత్వాన్ని అనుసరించి మీ కార్యక్రమాలను జరుపుకొనవలసి ఉంటుంది. కుటుంబంలో చిన్నచిన్న చికాకులు వస్తూ పోతూ ఉంటవి. ధనాదాయం బాగుంటుంది. దైవానుగ్రహంవల్ల మీ మనోనిగ్రహం బాగుంటుంది. శుభకార్యాలు కలసి వస్తవి. ఇతరుల నిమిత్తం మీ పనులకు చిక్కులు కల్పించుకోగల స్థితి రాకుండా చూడండి. బలవంతులతో పోటీలకు దిగవద్దు. 2, 3 తేదీలలో శుభవార్త, దైవకార్యాలు.

* * *

### తుల:

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ప్రస్తుతం మనోనిగ్రహం తగ్గుతుంది. ప్రతి పనిలోను శ్రమ పెరుగుతుంది. ముందు ఆశ కనుపించినంత విశేషంగా యథార్థమైన ఉపయోగం ఉండదు. కలహాలు అంకురించగల సమయం. పైకి గౌరవంగానే ఉంటుంది. దూరపు ప్రయాణాలు చేస్తారు. శుభకార్యాలలో పాల్గొనవలసి ఉంటుంది. "గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్లు" మాట్లాడేవారు తటస్థ పడతారు. ఖర్చు విషయంలో ముందు వెనుకలు చూచి చేయటం అవసరం. పై హంగులు అన్నీ బాగానే ఉంటవి మొత్తముమీద సుఖము, శాంతి తక్కువ. మీరు ఏ మాత్రం పొరపాటు పడినా ఫలితం పోతుంది. 2, 3 తేదీలలో కలహాలు, ఖర్చులు.

* * *

### వృశ్చికం:

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

జరుగవలసింది ఒకటి, జరిగేది మరొకటి. బంధు మిత్రులు కూడా మీకు వ్యతిరేక ధోరణిలో మాట్లాడతారు. వృత్తిలో మీ ఆలోచనలు ఫలిస్తవి. అయితే కరకుదనంతో వ్యవహరించవలసి ఉంటుంది. ధర్మకార్యాలు చేస్తారు. ఉన్నత స్థితిలో ఉన్నవారితో పరిచయం లభిస్తుంది.

అనారోగ్య బాధలు కనుపిస్తవి. ఇంతకు ముందు కదలికలేని వ్యవహారాలలో అనుకూలమైన మార్పు వస్తుంది. ప్రయాణం తటస్థపడుతుంది. మీ భావాన్ని తెలుసుకోకుండా వ్యతిరేకించే వారు ఉంటారు. ధనాదాయం బాగుంటుంది. ఒకేమాట మీద ఉండటం అవసరం. 1, 2 తేదీలలో ధనలాభం శుభవార్తలు.

* * *

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

అన్ని విధాల అనుకూలమైన సమయం. ఎవరు ఏమిచెప్పినా మీ పనిని మీరు చేసుకొని పోగలుగుతారు. మనశ్శాంతి, ధనాదాయము బాగుంటవి. ఈ సమయంలో అయినవారి ఆదరాభిమానాలు అంతగా లభించవు. వృత్తిలో కూడా స్థిమితమైన మార్గం ఏర్పడుతుంది. విలువగల వస్తువులు కొంటారు. ప్రసంగాలలో ఎంతైనా ఓర్పు అవసరం. బంధువులవద్ద నుంచి శుభవార్తలు తెలుస్తవి. ఈ వారం ఆరంభంలో అకస్మాత్తుగా మనోవిచారం కనుపించినా క్రమంగా పరిస్థితులు మెరుగు అవుతవి. అల్లులతో చనువు తగ్గించుకొనండి. 30, 1 తేదీలలో సంతోషవార్త. కార్యసిద్ధి.

* * *

## మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఇది కొంచెం శ్రమకరమైన కాలం. వృత్తిలో మీరు తొందర పడినంతగా అవకాశం కలసిరాదు. ఫలితం సాధారణంగా ఉంటుంది. స్నేహితులను నమ్మటంవల్ల ప్రయోజనం ఉండదు. మొత్తంమీద స్వయం కృషితోనే నిదానంగా పైకి రాగలుగుతారు. పశ్చిమ దిశనుంచి లాభ వార్తలు తెలుస్తవి. కుటుంబంలో ఇంతకు ముందుకన్నా సంతోషము, సుఖము లభిస్తవి. శుభకార్య ప్రయత్నాలు అనుకూలించవు. సాధ్యమైనంతవరకు ఇతరుల కార్యభారాన్ని తగ్గించుకొనండి. ఏ విషయంలోను గౌరవం కోసం పట్టుదలలు పెంచుకోవద్దు. బంధువులవల్ల ఖర్చులు అధికం. 29, 30 తేదీలలో ధనలాభం, మంచిస్నేహం.

* * *

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఒక సమయంలో ఇతరుల విమర్శకు నిలబడవలసి వస్తుంది. అయితే జయం లభిస్తుంది. కుటుంబంలో శుభకార్యాలు జరుగుతవి. సంఘంలో పలుకుబడి బాగుంటుంది. తరచు పదిరకాల మనుష్యులతో ఏదో ఒక కార్యకలాపం జరుపుతు ఉంటారు. విశేషంగా ధనం వచ్చి ఖర్చు అవుతూ ఉంటుంది. చాలా భాగం తీరుబాటు లేకుండా శ్రమపడవలసిన సమయం. ఇతరుల వ్యవహారాలలో జోక్యం పెట్టుకొనటం వల్ల భారం పెరుగుతుంది. వారం రెండవ భాగంలో నిరుత్సాహం తోచవచ్చు. కాని, కార్యానుకూలమైన సమయం. పిల్లల ఆరోగ్యంబాగుండదు. 28, 29 తేదీలలో దేహశ్రమ, దుబారా ఖర్చు.

* * *

## మీనం!

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

గ్రహబలం బాగుంది. ఈ సమయంలో ఏర్పడే చిక్కులు వాటంతట అవిగా తొలగిపోతవి. ఉద్యోగ రంగంలో మీ కృషి ఫలిస్తుంది. సుఖాన్ని లెక్క పెట్టకుండా మాట నిలుపుకొంటారు. బంధుమిత్రులలో మంచి పేరు వస్తుంది. ప్రయాణాలు చేస్తారు. కొన్ని సమయాలలో అధికారులతో పేచీలు వస్తవి. తరచు సందేహాలకు గురి అవుతారు. గౌరవం నిమిత్తం ఖర్చులు పెరుగుతవి. ఉత్తర, తూర్పు దిశలనుంచి శుభవార్తలు తెలుస్తవి. కోర్టు కచేరీలలో శ్రమ అధికంగా ఉంటుంది. ముందు ఎప్పుడో జరుగు పనులకై ప్రయత్నాలు సాగుతవి. 27, 28 తేదీలలో అపవాదులు, కార్యభంగం.






'మీ చిట్టి తమ్ముడికి మాట్లాడటం వచ్చిందా'?
'ఆ ... ఇప్పుడు నోరు మూసుకోవడం నేర్పుతున్నాం.'

# ప్రేమ గాలం

వీరాజీ

### జ రి గి న క థ

సురేఖను భాస్కరానికీ భాస్కరాన్ని సురేఖకు పరిచయం చేస్తుంది, పద్మావతి. భాస్కరం సవతి తల్లి జానికమ్మగారు అతన్ని కన్నబిడ్డ కంటె ఎక్కువగా ప్రేమిస్తుంది. భాస్కరానికీ; కూతురు వసంతకూ ఒకేసారి వివాహం చేయాలని ఆమె ఆరాట పడుతుంది. తత్ఫలితంగా భాస్కరాన్ని పెళ్లిచూపులకు బలవంతంగా ఒప్పించి తీసుకెళ్తుంది. పెళ్లి కూతురు సురేఖ అని తెలియగానే భాస్కరం మనస్సులో కల్లోలం చెలరేగుతుంది. సురేఖ దొడ్డమ్మ అయిన ధనమ్మకు మాత్రం భాస్కరంలో అన్నీ మంచి గుణాలే కన్పించి ఎలాగైనా భాస్కరాన్ని తన అల్లుడుగా చేసుకోవాలని పట్టుదల పెరుగుతుంది. భాస్కరం పద్మావతిని ప్రేమించడం నిజమా, కాదా అనే సందేహం కూడా సురేఖకి కలుగుతుంది. ధనమ్మకు దూరపు బంధువు ముకుందరావును వసంతకు ఇచ్చేటట్లు కూడా అప్పుడే ఏర్పాటు జరుగుతుంది. తను సురేఖను వద్దంటే ధనమ్మ తన కూతురుకే ముకుందరావును ఇచ్చి చేస్తానంటోంది. చెల్లెలి సంబంధం తన మూలంగా చెడిపోతుందని భాస్కరం; ముకుందరావుని వివాహం చేసుకుందామని కల్లో గూడా అనుకోని సురేఖకు తను భాస్కరాన్ని వద్దంటే ధనమ్మ తనను ముకుందరావు కిచ్చి చేస్తుందేమో అన్న భయంతో సురేఖా ఎటూ మాట్లాడలేకపోతారు. చివరకి భాస్కరం తన పెళ్లి ఏడాది వాయిదా వేస్తాడు. ఇంతలో యూనివర్సిటీ తెరుస్తారు. సురేఖ, పద్మ యిద్దరూ ఎం. ఏ లో చేర్తారు. భాస్కరం కూడా ఫైనలియర్ పూర్తి చేయటానికి వస్తాడు. సురేఖ అంతా చెప్పిఉంటుందని భాస్కరం అనుకొని పద్మతో ఏమీ చెప్పలేకపోతాడు. ఎగ్జిబిషన్‌లో కూడా పద్మావతిని కల్సుకొని ఎలాగైనా జరిగింది చెప్పాలని చాలా ప్రయత్నించాడు. భాస్కరం భాస్కరం స్నేహితుడు మూర్తి శైలజను ప్రేమిస్తాడు. శైలజ కూడా పద్మావతికు సురేఖకు స్నేహితురాలు. జానికమ్మగారు వసంత పెళ్ళి యత్నంలో మునిగి వుంటుంది. పిక్‌నిక్‌కు వెళ్లారంతా.

## 36

శైలజకు పద్మావతి ఉండాలనే ఉన్నది తను కూడా.... ఆడపిల్లలో పరువు మర్యాదలు, స్వత సిద్ధమైన భయం ఇవి జాస్తి గనుక మనస్సును వారించి మరీ ఏకాంతాన్ని కోరిన ప్రియునితో ఒంటరితనాన్ని వదులుకుందికే సిద్ధమయింది శైలజ "ఇప్పుడప్పుడే కాదు....' అన్నదామె మనసు.

పద్మావతికి మరీ సంకటంగా ఉన్నది పరిస్థితి. 'అవతల సురేఖ భాస్కరం ఇద్దరూ దగా చేశారు. వాళ్లు నన్ను కొండ ఎక్కించేసి క్రింద కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నా'రనుకుంది. మూర్తికి కూడా భయంగాను బిడియంగాను ఉన్నది. ఇద్దరాడపిల్లలు తనూ.

శైలజను ఏకాంతంగా దూరంగా తీసుకుని పోవాలని ఉంది మళ్లీ భయంగానూ ఉంది. పద్మావతి మనసంతా దిగువనే ఉండి పోయింది. కొండంతా, గులకరాళ్ళు చిన్నచిన్న దుబ్బుల మయం —చీపురు మొక్కలున్నాయి అక్కడా అక్కడా ....

"వెధవ పని చేశాను .... భాస్కరంగారు నన్ను మోసం చేస్తారని కలలో కూడా అనుకోలేదు." అనుకుంది. వెనుదిరిగి వెనుదిరిగి చూస్తూనే ముందు ముందుకు వెళ్ళసాగింది పద్మావతి.

శైలజకు మూర్తినీ అనుసరించాలని మనసు పీకుతున్నది — పద్మావతిని చూస్తే భయం — బెంగ — సంకోచం.

"ఏం ! అయిందా ? అమ్మాయిగారి వెంచర్ !?" మీది గుట్టమించి చెయ్యి అందిస్తూ అడిగాడు మూర్తి ఆనందంతోనూ ఆలసటతోనూ రొప్పుతూ.

"మరేం !.... తల్చుకుంటే నేను మిమ్మల్ని ఓడించ గలను" శైలజ అనుకోకండా అతని చెయ్యి అందుకు ముందుకు ఎక్కుతూ అన్నది "పద్మావతిగారు వెనక పడిపోయింది."అన్నది—

దగ్గరసా చెయ్యి పట్టి లాక్కుంటున్న మూర్తిని వారించి దిగువకు చూసింది శైలజ.

మూర్తికి శైలజ సమ్మోహనంగా అగుపిస్తున్నది. చెమట పట్టిన ఆమె నుదుట ముంగురులు అతుక్కు పోయాయి. ఎండకు సోలి, వాడిన పువ్వులా అయిపోయిందా పిల్లమొహం....

ముంగురులు సవరించాడు.

ప్రపంచంలోని ఏ శక్తీ, ఏ ఆశా, ఏ భయమూ కూడా అతనికి తోచలేదు. ఆమెను తన గుండెల కదుముకోవాలనిపిందింది. అతని కళ్లల్లో తీవ్రమైన కాంక్ష— ఆ పిల్లను ప్రాధేయపడుతున్నది.

అతని చెయ్యి వదిలి అతని కళ్లల్లోకి చూసిన శైలజ చలించి పోయింది. చేతులు కన్నా బలమైన మంత్రం ఆ నాలుగు కళ్ళ కలయికకు ఉన్నది. ఆ తరుణంలో— ఎవరూ ఎవరికన్నా బలమైన వారు కారు.

బలహీనతకు దాసులై పోయారు. పద్మావతి వెనుదిరిగి దిగిపోతూండడాన్ని వారు గమనించనే లేదు.

"శైలా !"

మూర్తి ఆమెను సున్నితంగా అక్కునచుముకుని ముందుకు వంగి జాత్తు మూర్కొన్నాడు. అతని గుండెలమీద చెయ్యివేసి దూరంగా త్రోసి అటుతిరిగి సిగ్గుపడిపోయి అక్కడే కూచుని తల చేతుల్లో దాచుకుంది శైలజ. చిరుచెమటలు క్రమ్మి గుండె దడదడలాడుతున్నది.

ఆ ప్రక్కనే మండు టెండలో అదే పండువెన్నలంత హాయినిస్తున్నట్లు మోకాళ్ళమీద ఆని కూర్చొని 'కోపం వచ్చిందా' అన్నాడు. చెవిదగ్గరగా అతి రహస్యం చెప్పినట్లు మూర్తి— —బతిమాలాడు ! ఆమె చెంపల నాఘ్రాణిస్తూ..

"మీరు దొంగలు" శైలజ చిలిపిగా చూసింది.

"నేను కాదు.... నేను దాసుణ్ణి.... మీరే.... మీరే.... అసలు నువ్వే...."

"నేను.... నేను.... అమ్మయ్యో ! పద్మావతిగారు వెళ్లిపోయిందేమో.... తను చూస్తే ఇంకేమైనా ఉందా ?..."

లేచి నలుదిక్కులా చూడసాగింది శైలజ.

మూర్తికి ధైర్యం వచ్చింది.

అటూ ఇటూ చూస్తే ఎండతప్ప యెవ్వరూ లేరు. పద్మావతి దిగిపోయి ఉంటుంది.... "కావాలంటే ఆనక క్షమాపణ చెప్పుకోవచ్చును...."

మూర్తి రెపరెపలాడుతూ ఎగురుతూన్న

ఆమె పమిటను అందుకుని ఆమెను దగ్గరకి లాక్కున్నాడు.— ఆ పిల్ల కరిగి పోయింది.

రెండు క్షణా లిద్దరూ లోకాన్ని మరిచిపోయారు. ఇద్దరూ కళ్లు మూసుకున్నారు.... "ఒక్కటై పోవాలనుంది" ఇద్దరికీ

"అబ్బ...."

శైలజ ఒక్క ఉదటున విడిపించుకుని కొంగుతో పెదాలు ఒత్తుకుంటూ చకచకా దిగి పోసాగింది.

మూర్తి గుండె అంతకంటే వడిగా కొట్టు కుంది. "పడతావ్ ? మెల్లిగా.... ఆగు.... ఆగు నా మీద ఒట్టే..."— భయంతో మూర్తికి చెమట పోసింది. శైలజ మాత్రం ఎవరో వెను తరుముతున్నట్లు వడిగా అలవాటైనట్లు సునాయాసంగా దిగిపోసాగింది.

*  *  *

పదకొండు గంటలైంది. తొలి విడత ఒడ్డ నిలు చెట్ల క్రింద విస్తళ్లు వేసి ప్రారంభించారు —విస్తళ్లెగిరి పోతున్నాయి, గ్లాసులు పడిపోతు న్నాయి. నవ్వులు కేకలు అల్లర జోరుగా ఉంది. దానికి గాలి తోడైంది.... వోహ్ !....

పద్మావతి కాళ్లు పీకిపోయాయి. ఒళ్లంతా పులిసినట్లు నొప్పులు, చెమట, దుఃఖం, కోపం, చెప్పులో ఒకటి తెగిపోయింది. కాదనుకున్న సరే వెతుక్కుంటూ వెళ్లింది భాస్కర్రాన్ని.

సురేఖా భాస్కరం మొదట తాము విడి పోయిన "పల్లకీ మానుచెట్టు" దగ్గరే ఉన్నారు.

పద్మావతిని చూస్తూనే భాస్కరం లేచి వెళ్లాడు సురేఖ అప్పటి కప్పుడు అక్కడ వెలసిన దుకాణంలో అరటిపళ్లు కొంటున్నది— అవి పద్మావతికి ఇద్దా మనే....

"హలోవ్ ! నువ్వే గెలిచావ్ పద్మా !" ఆ పిల్ల సానుభూతి కోసమని మరింత కుంటుతూ దెబ్బ తగిలిన చేతిని కట్టుతో సహా క్షమాపణ పత్రంలా ముందుకి జాచుతూ ఎదురేగాడు భాస్కరం.

పద్మావతి "ఇంకా సిగ్గులేపోతేసరి" అనుకుని "వోడిపోయాను— మీరేం వెటకారం చేయ నక్కరలేదు...." అంది.

"నో ! నో !...."

"ఏమిటి నో, నో,... నా బుద్ధి గడ్డితిని నేను మిమ్మల్ని నమ్ముకుని ఈ పాడు పిక్నిక్కని..."

భాస్కరం అనుకున్నదే ఈ ఉధృతం ఐనా కాస్త చకితుడై

"ఎక్స్క్యూజ్ మీ ! నేను.... నేనూ పడ్డాను పద్మా...." జాలిగా చెయ్యి చూపించాడు.

చెయ్యి కాదు పద్మావతి చూస్తః చేతిని కట్టు కున్న సురేఖ చేతిరుమాల్ని చూసింది. ఒళ్లు మండిపోయింది. అంతలో "ఓయ్ ! అరటి పళ్లు తినవోయ్ ! సేద తీరుతుంది....ఇంతకీ ఆ గంధర్వులు

36 వ పేజీ చూడండి





అమ్మ దానిని
పత్రికలలో చూసింది
నాన్నతో చెప్పింది
అప్పుడు నేను విన్నాను...
ప్రతి దుకాణములోను ప్రతి పట్టణములోను
పిల్లల కొరకు ఆహారము - గ్లాక్సో
పేర్చబడి వుంది.
ఎంతో ఎక్కువగా పేర్చబడి వుంది.
ఇంకా మీకు తెలుసునా
గ్లాక్సోతో నేను బలముగాను
ఆరోగ్యవంతముగాను
పెరుగుతానని
ఎంత సరదాగా వుంది!

గ్లాక్సోలో, ఇంచుమించు, తల్లి
పాలలో వుండే గుణాలన్నీ
వున్నాయి మీ బిడ్డ బలముగాను
ఆరోగ్యవంతముగాను పెరుగుటకు
కావలసిన వన్నీ వున్నాయి గ్లాక్సో
బేబీ పుస్తకం ఉచిత ప్రతి(తెలుగులో)
50 న పై (తపాలా ఖర్చుల నిమిత్తం)
గ్లాక్సో, వుడ్స్ రోడ్, మద్రాస్-2
ఈ చిరునామాకు పంపండి




Glaxo

గ్లాక్సో—పసి బిడ్డలకు సంపూర్ణ పాల ఆహారము

GLY-2-TEL.

## నా అనుభవంలోకెల్లా పెద్దపరిశోధన - 20

# అంతుచిక్కని హత్య

### కెప్టెన్ బ్రూస్ సల్లివాన్ (న్యూయార్క్ - యు. యస్. ఏ.)

అతన్ని ఒక్కొక్క దేశంవారు ఒక్కొక్క రకంగా పిలిచారు. బ్రిటిష్‌వా రతన్ని "పోకిరి" అని, రష్యావారు "డబ్బు ఆశ కలవా" డని, జర్మనీ వారు మరొకటనీ, మరొకటనీ పిలిచేవారు. అతని సౌధంలో పడక గదిలో పాన్పు పక్కగా, అర్ధ నగ్నంగా ఉన్న అతని (సెర్జ్ రాబిన్‌స్టైన్) శరీరాన్ని చూశాక, "ఇక తతంగం మొదలు" అనుకున్నాను.

1955 వ సంవత్సరం—ఆనాడు జనవరి 27 వ తేదీ. న్యూయార్క్ పట్టణంలో అరవై ఒకటి, అరవై రెండు వీధుల మధ్యనున్న ఐదవ ఎవెన్యూలో తన సొంత భవనంలో మూడవ అంతస్తులో సెర్జ్ రాబిన్‌స్టైన్ హత్య గావింపబడ్డాడు.

సమాధానం రాని ప్రశ్నలవర్షం పరస్పరం కురిపించుకుంటూ, ఒకళ్ల నొకళ్లు తోసుకొంటూ ఆ గదంతా మాటలతో నింపుతూ, జనసమూహం గంద్రగోళం ప్రారంభించారు. చుట్టుపక్క ఇళ్లవాళ్లు, డిటెక్టివ్‌లు, వేలిముద్రల నిపుణులు, జిల్లా ఎటార్నీ ఆఫీసు నుంచి వచ్చిన అపరాధ పరిశోధకులు, మా డాక్టర్ మిల్లర్ హెల్పర్న్, నా పై ఉద్యోగి, పోలీసు కమీషనర్ ఫ్రాన్సిస్. డబ్ల్యు. ఆడమ్స్ అంతా ఆ గుంపులో ఉన్నారు.

అన్ని రకాల రిపోర్టులు మా బల్లలు చేరాయి. న్యూయార్కు రహస్యపీరు డెవడూ ఈ హత్య చేసి ఉండడానికి వీల్లేదు. మార్లిన్ మన్రో కన్నా పేరు ప్రఖ్యాతులు (?) గల ఒకానొక కోటీశ్వరుని హత్య అది. అతని విషయాలు, కార్యక్రమాలు ఎప్పుడూ దినపత్రికలు పెద్ద అక్షరాలతో ప్రకటించేవి. అతని ధనాన్ని గురించి, ఆ ధనం సంపాదించిన విధానాన్ని గురించి చాలా కథలున్నాయి. డబ్బును వడ్డీచే గుణించి, గణించాడనీ, వెర్రి—వేలం వెర్రిగా గడించాడనీ కొందరనేవారు. అదీ గాక, లెక్కలేనంతమంది స్త్రీలతో కాలం గడిపేవాడనీ, దేశ బహిష్కరణకు కావలసిన అర్హతలన్నీ ఉన్నాయనీ మరికొంద రనేవారు. ఈ హత్య వార్తా పత్రికలలో ప్రథమ స్థానం అలంకరించినపుడు చదువరుల ఆనందానికి హద్దు లేకుండా పోయింది.

హత్య చేయబడిన తీరు, తదితర పరిసర ప్రదేశాలు మేము చాలా సునిశితంగా పరీక్షించాము. పత్రికా ప్రతినిధులకు వీలైనంత సమాచారం ఇవ్వడానికి, వీలైతే యీ కేసు పరిష్కరించడానికీ అనువైనంతగా పరీక్షించాము.

ఒక పెద్ద గదిలో రెండు పెద్ద పడక మంచాలు ఉన్నాయి. మూడు భాగాలుగా మడవడాని కనువైన ఒక స్క్రీన్ ఒకటి ఉంది. మందపాటి లేతాకుపచ్చ దుప్పటి ఒకటుంది. గోడల కలంకరింపబడియున్న నగ్నస్త్రీల పటాలు, చైనావారి చిత్రాలు చూసి గృహ యజమాని 'అసహ్యకరమైన వైభవాలు' కలవాడని ఇట్టే తెలుస్తుంది. సెర్జ్ రాబిన్‌స్టైన్—అరడజనుమంది సుందరాంగుల మధ్య నెపోలియన్ దుస్తులతో నిలబడి తీయించుకున్న ఫోటో ఒకటి 'అద్దం ముందు బల్ల' మీద ఉంది. ఒక కుర్చీమీద అతని కోటు, టోపీ అవి ఉన్నాయి.

బట్టల బీరువాల్లోని బట్టలన్నీ బయట వెదజల్లబడి ఉన్నాయి. చీరలు, జాకట్లు, తల పిన్నులు పౌడరు, స్నోలు, లోపల కట్టుకునే బట్టలు తదితర ఆడవారి సరంజామా ఇల్లంతా వెదజల్లబడి ఉంది. అతని శవం పక్కన ఒక దువ్వెన, ఏవేవో కాగితాలు తప్ప పనికొచ్చే 'వివరాలు' ఏమీ లేవు.

డాక్టరు శవపరీక్ష చేస్తుండగా, మేమంతా అతని చుట్టూ మూగాము. రాబిన్‌స్టైన్ కాళ్లూ, చేతులు బలమైన తాళ్లతో కట్టేసి ఉన్నాయి. నోరు, మెడ, ముక్కు మాత్రం జిగురు వంటి ఒక రకం 'టేపు' తో అతికేసి ఉన్నాయి. హత్యకి దొంగతనం కారణమా !! అని నాకు ఆశ్చర్యం కలిగింది. దొంగతనమే కర్తవ్యంగా పెట్టుకోక, ఆ హంతకు డెవడో అతన్ని చంపడానికి నానా యాతనలూ పడ్డాడు. అలాటి హంతకుణ్ణి నే నిదివరకెన్నడూ చూడలేదు.

తను గ్రహించిన విషయాలు చెప్పడానికి డాక్టరు లేచి నించుని చుట్టూ చూసి, "గురువారం ఉదయం ఐదున్నర గంటలకు హత్య జరిగి ఉండాలి. శ్వాస రాకుండా బంధించడంవల్ల అతను చనిపోయాడు. మెడమీద, నోటిమీద కొన్ని గీరలున్నాయి. అదేగాక, ఒక ఎముక, మెడమీద చర్మాన్ని పొడుచుకు వచ్చింది. కనుక ఆ భాగంలో వెన్నుపాము విరిగిఉండచ్చని నా అభిప్రాయం. శవపరీక్ష చేస్తే—నికరంగా తెలుస్తుంది" అన్నాడు.

ఆ ఇంటి నౌకరు విలియం మార్చర్‌ని పిలిచాము. హత్య విషయం పోలీసులకు ఫోనుచేసి అతనే చెప్పానని చెప్పాడు. "సుమారు ఏడు గంటలకు అలవాటు ప్రకారం—యజమానికి ఏమైనా కావాలేమోనని అడగడానికి వెళ్లాను. వెళ్ళేసరికి ఆ స్థితిలో చూశాను. ఏ వస్తువునూ నేను ముట్టుకోనే లేదు. వెంటనే పోలీసులకు తెలియపరిచాను. రాత్రి నాకు ఏవిధమైన కేకలు వినిపించనే లేదు. వినబడిఉంటే పక్కమీంచి అప్పుడే లేచి ఉండేవాణ్ణి" అన్నాడు.

రాత్రి అతని భవంతిలో ఐదుగురు స్త్రీలు పడుకున్నారట ! హతుని తల్లి డెబ్బయి అయిదేళ్ల పండు ముసలి. ఆవిడను ఆవిడ పరిన మందిరంలో కలుసుకున్నాము. ఆవిడ మాటల ఉచ్చారణ స్పష్టంగా లేక, రిపోర్టు రాసుకుని వాళ్లు కొంచెం తికమక పడ్డారు. "నాటకం నుంచి పదకొండున్నర (రాత్రి) గంటలకు వచ్చాను. వచ్చి తిన్నగా పడకగదిలోకి వెళ్లి పడుకున్నాను. రాత్రి ఏవిధమైన గొడవలూ నాకు వినబడలేదు" అందావిడ.

ఆనక, ఆమె అక్క ఎజీనా ఫారెస్టర్‌ని కలుసుకున్నాము. ఆవిడకు ఎనభైమూడేళ్లున్నాయి. ఆమె రెండో అంతస్థులో తన గదిలో నిద్రపోయానని చెప్పింది. మిగిలిన ముగ్గురు ఆడవాళ్లలో ఒకామె వంటమనిషి, మిగిలిన యిద్దరు ఇంటి పనివారు. వాళ్లందరు ఎవరి గదులలో వారు పడుకున్నారట ! రాత్రంతా ఎట్టి శబ్దాలూ లేక, నిశ్శబ్దంగా గడిచిందని వారన్నారు.

అయినవాళ్లని ఈవిధంగా ప్రశ్నిస్తే తేలే విషయం ఏమీ ఉండదని తేలింది. ఈ హత్య ఎవరు చేశారు ? ఎందుకు చేశారు ? హంతకుడు గాని, హంతకురాలు గాని ఆ భవనంలోకి ఎలా ప్రవేశించారు ? అనే ప్రశ్నలకు సమాధానాలు తేలాలి.

వీలున్న చోట్లన్నీ పరిశీలించాను. తలుపులు, ద్వారబంధాలు, కిటికీలు అన్నీ నిశితంగా పరీక్షించాను. బలాత్కారంగా తెరచినట్లు గాని, విరిచినట్లు గాని జాడలు లేవు. ఇంటికి ఉన్న కిటికీలన్నీ కూడా తాళాలు వేసి ఉన్నాయి. ఒక తలుపును నేను పరీక్షిస్తుండగా 'జిమ్' అనే అతను వచ్చి — ఆరు నెలల క్రితం ఆ తలుపు పాడైతే సెర్జ్ రాబిన్‌స్టైన్ తనచేత బాగుచేయించాడని చెప్పాడు. ఆనక మళ్లీ దాన్ని బాగచేయవలసిన అవసరం రాలేదని కూడా నే నడగకముందే చెప్పాడు.

ఆ ఇంట్లో ఇక వివరాలేం లేవని తెల్సుకున్నాము. వేలిముద్రల నిపుణులు పౌడర్లు జల్లి నానా పాట్లు పడుతున్నారు. ఆ గదంతా 'జిగేల్'మనే మెరుపుతో నిండే వరకు పోలీస్ ఫోటోగ్రాఫర్లు, పత్రికా విలేఖరులు ఫోటోలు తీశారు. ఆ ఇంట్లో, ఉన్న పనివారిని మళ్లీ మళ్లీ ప్రశ్నించారు.

ఈ విషయం అంత త్వరగా ఎలా వ్యాపించిందో నా కర్థంకాలేదు. నేను ఆ భవనం దాటి రోడ్డు మీదకు వచ్చేసరికి ఆ రోడ్డంతా జనం తండోపతండాలుగా ఉన్నారు. ఆటపాటలతో, విలాసాలతో, ఆడ నవ్వులతో ఆనందించి, ఆరితేరిన ప్రప్రథముడు మరణించాడు అనే విషయం న్యూయార్కంతా చుట్టేసింది. గౌరవంగా బ్రతికిన ఆ మేడ యీనాడు బజారు పాలయ్యింది. వేసి ఉన్న తలుపు సందుల్లోంచి, కిటికీ సందుల్లోంచి చూసే జనం ఎక్కువైపోయారు. పూలమ్మే వాళ్లతో, క్రోటనులమ్మే వాళ్లతో, కార్లమీద తిరిగే గౌరవమైనవాళ్లతో, వారి కార్లతో నిండే ఆ రోడ్డు నల్లటి భూతాలవంటి పోలీసు కార్లతో నిండిపోయింది.

రాబిన్ చనిపోయేలోగా అతను ఎక్కడెక్కడికి వెళ్లినది, ఎవరెవర్ని చూసినది తెలుసుకోవాలి. మెడైసన్ ఎవెన్యూ ఆఫీసులో అతని గుమాస్తాలు —సెర్జ్ నాలుగున్నర వరకూ ఆఫీసులో ఉన్నట్టు, ఆనక తన వ్యాపారంలో వాటాదారుడు, స్నేహితుడు అయిన టి. స్టాన్లీ అనే అతని కారులో ఎక్కి వెళ్లినట్లు చెప్పారు. రాబిన్‌స్టైన్ 'మియామి'

34 వ పేజీ చూడండి



★ అందానికి ఈ అమ్మాయి
పేరు యీ మధ్య బాగుంది.
"వహ్ కౌన్ థీ?" సాధన.



అదృష్టం ఢిల్లీ వానల్లాంటిది.

అనుకున్నప్పుడు రాదు. అర్హతకల చోటికి రాదు.

వచ్చినా, అకస్మాత్తుగా వస్తుంది. వచ్చింది కదా అని మురిసేలోగా అదృశ్యం అవుతుంది.

అయ్యో పోయిందే అనుకునేలోగా మళ్ళీ రావచ్చు. లేక, రాకపోవచ్చు...

వరద సుందర్రావు దగ్గరికి అదృష్టం చాల కాలంవరకు రాలేదు......అడ్రసు సరిగా వ్రాయని ఉత్తరం లాగున ఆలసించింది. అయితేనేం...... వచ్చినప్పుడు మాత్రం వరదలా వచ్చింది.

అది ఎట్లన్నన్?

*　　*　　*

మూడేళ్ళక్రింద ఒక శ్రావణ సుముహూర్తాన వరద సుందర్రావుని, జానకి పెళ్ళాడింది.... ఏం, అలా ఎందుకనాలి, వరద సుందర్రావే జానకిని పెళ్ళాడాడని ఎందు కనకూడదూ—అంటే?

అంతకు నాలుగు నెలల్రకితం వేరే ఇంకొక పెళ్ళిలో—పొడుగాటి జుత్తును ఎడంచేత్తో ఎగదోసుకుంటూ, లాల్చీ పంచెలతో హడావిడిగా తిరుగుతూ, నవ్వుతూ, మాట్లాడుతూ, కళ్ళు తిప్పుతూ, కలకల లాడుతూ, తిరుగుతూవున్న— ఆ అబ్బాయిని జానకి అనే చిన్నది మొదట చూచింది

"వూ!"—అనుకుంది.

ఆ అనుకోవడం వరద సుందరం చెవులపడి అతగాడు కళ్ళతో.......'వూ?' అని అడిగాడు.

చూడని చూపుతో, నవ్వని నవ్వుతో....... జవాబు చెప్పకయే చెప్పి......ఒయ్యారంగా మెడ తిప్పి లోపలికి వెళ్ళిపోయింది. ఆ అమ్మాయి. ఈ మూకీ ఏకాంకికను ఓరకంట గమనించిన ఆ అమ్మాయి ఒదిన కళ్యాణ కంకణం ధరించింది. వాళ్ళాయనతో 'ఆ' సంబంధం విషయం చూడమన్నది.

ఆ రాత్రి పేకాటలో వరద సుందరం ఇరవై నిముషాలలో ఇరవై రెండు రూపాయలు పోగొట్టుకున్నాడు. ఇస్పేటు రాణిని క్రింద పడేస్తూ— "క......ళ్ళు!" అన్నాడు. కళావరు పట్టు తీసి పెడుతూ, "ఆహా......ఆమెడ!" అన్నాడు. ఆ పారాయణంలోని తతిమ్మా ముగ్గురూ—"సుందరాని కీవేళ వేడిచేసినట్లుంది, ఆట చాలిద్దాం" అని లేచారు.

.....జానకి అన్నయ్య, సుందరం నాన్నలు ఉత్తర, పత్రాలు రాసుకోవడం, జాతకాల పొంతనాలు చద

వడం, పెళ్లి చూపులు జరగడం (ఇదంతా ఉత్త 'రెడ్—టేప్' అనుకోండి. అసలు నిర్ణయం అయిపోయింతర్వాత ఆఫీసు ఫైళ్ళు తిరిగినట్లు)ఇదంతా అయింతర్వాత మంగళగిరి ఆలయంలో జానకీ సుందరాల కల్యాణం సలక్షణంగా జరిగింది..... ఇందులో 'ఇనిషియేటివ్' అన్నది—అనగా 'ఓం' అని కార్యంలోకి అడుగు వెయ్యడం అన్నది, జానకి కళ్ళనుండి బయలు దేరింది గనక, జానకి వరద సుందరాన్ని పెళ్ళాడింది — అవి (పై నెక్కడో ఒక పేరాలో) అగుపిస్తుంది.

తథాస్తు!

సరే, వివాహం జరిగింది. రెండు వైపులనుండీ బంధు మిత్రులు నాలుగు వందలమందిదాక వేంచేశారు. దాదాపు నాలుగు వందల బహుమతులూ వచ్చాయి. అందరూ కూడా వధూవరుల అదృష్టాన్ని అభినందించారు.

హడావిడి అంతా ముగిశాక, "మావూరు రారాదూ? కొన్ని రోజులుండి వద్దురుగాని......" అంది జానకి ఒదిన.

సరికదా అని పెళ్ళికూతురూ, వాళ్ళాయనా కలిసి హైదరాబాదు చేరుకున్నారు......

.....వయసు మనసులు భూమిమీదే ఆకాశాన్ని స్పృశించుకుని ఎగిరాయి. ప్రపంచం క్రొత్త రంగు దాల్చింది.

ఒకరోజు—

దగ్గర కొస్తున్న సూరీడిని చూసి, పడమటింటివారి పడుచు సిగ్గు పడేవేళ—

"స్టెడీ జానకీ, స్టెడీ!—" అన్నాడు వరద సుందరం.

"ఒక్క నిముషం—" అని జానకి చీర కుచ్చెళ్లని సర్దుకుని నిల్చుంది.

సుందరం పెదవి విరిచాడు........"మళ్ళీ నువ్వు ఫోకస్‌లోనుండి బయటి కెళ్ళిపోయావు...... కాస్త ఇటువైపురా.......ఆ.......అదీ.......మరీ అటు కాదు........ఆ జిన్నియాలు బొత్తిగా కనపడ్డం లేదు......" అని కెమెరాలోకి చూస్తూ సర్దుతున్నాడు..జానకి ప్రక్కగా ఒక గళ్ళలాగు కన్పించింది. కెమెరా కటకంలో తలెత్తి చూశాడు వరద సుందరం. పెద్ద మీసాలున్న గళ్ళలాగు ఆసామీ జానకికి కాస్త వెనక నిల్చుని చూస్తున్నాడు. వాణ్ణి క్రింద పడేసి వాడి ముక్కుని తొక్కు వచ్చడిగా చేద్దామన్న చక్కటి అయిడియా వచ్చింది గాని.......వాడికీ చేతులున్నాయి. తనకూ ముక్కుంది .......వాడే తన అయిడియాని కాపీ గొడితే!...... అదీగాక, అది పబ్లిక్ గార్డనాయె....... వాడిని ఎలా వెళ్ళమనడం........ఛీ.......వెధవ ప్రపంచం... ప్రతి దానిని మరవకుండా చూస్తుంది కదా!

ఈ పిడకల వేటంతా తెలియని జానకి, తన ఫోటో చిరునవ్వుని తీసి, అవతలవుంచి—"ఊ......" అంది.

కెమెరాతీసి, భుజానికి తగిలిస్తూ, "రా జానకీ, పోదాం—" అని నడిచాడు సుందరం. జానకి వెంబడించింది నాథుడిని—అబిడ్స్ అనబడే అయోధ్యకు.

ఆ అయోధ్య మధ్య వున్న అందమయిన, విశాలమయిన, ఖరీదయిన హోటల్లో కూచుని కాఫీని పిలిపించారా యువ దంపతులు.

కాఫీల పొగల తెరల చాటున కళ్ళూ కళ్ళూ పలకరించుకుంటుండగా—

వరద సుందరాన్ని గుమ్మంలోనే పసిగట్టి, చేతనున్న సిగరెట్టుని పారేయ నిచ్చగించనివాడయి, గబ గబ దాని ఆయుస్సుని అంతంచేసి, అరవై టన్నుల సంతోషంతో, అంతకు తగిన సర్వ మేళవింపుతో—"వరద సుందరుడూ—ఒరేయ్" అంటూ వచ్చి వీపుని తట్టినవాడు మధుసూదనరావు...... 'మూదిరావు' అన్న నామాంతరంతో అనేకానేక ప్రేమరితా ప్రచురిత, గేయా గేయాలను రాసినవాడు!

"ఏంవోయ్.......వరదా! నీకు పెళ్ళి అయింది కదూ........ఐమీన్......అయిందిలే........నేను రాలేకపోయానుగాని.......వూ! ఎట్లా అయింది పెళ్ళి? బాగా అయిందా, అవున్లే—కాకుండా ఎట్లా ఉంటుందిలే.......ఐ మీన్ అదే నీ పెళ్ళి బాగా అయిఉంటుందిలే......." అని గొడుగులేనివాడి నెత్తిన పిడుగురాళ్ళు వర్షించినట్లు, సంభాషణ అనబడే స్వగతం మొదలెట్లాడు మూదిరావు.

---

ఒకావిడ భీమా కంపెనీ మీద దావావేసి, ఇంతలో చచ్చిపోయింది. ప్రతివాది తరఫు న్యాయవాది "వాది చచ్చిపోయింది కనుక, కేసు కొట్టివేయాల్సిందని" కోరాడు.

వాదితరఫు న్యాయవాది అడిగాడు. "ఆమె చనిపోయిందని దాఖలా ఏమిటి?"

ప్రతివాది తరఫు న్యాయవాది చాలా జాగ్రత్తగా సమాధానం చెప్పాడు.

"ఆమె చనిపోయిందో లేదో నాకు తెలియదు. ఆవిడ దహన క్రియలు జరిగినట్లు మాత్రం నాకు తెలుసు."

రామయ్య (రెంటచింతల)

---

ఆ వరదలో పడి కొట్టుకు పోరాదనుకున్న వరద సుందరం—మూదిరావు పోకడకు చిన్న పోచంపాడు 'డాం' లాంటిది కట్టి—జానకిని పరిచయం చేశాడు. అవీ ఇవీ ఏవో అడిగాడు. మూడో కాఫీ తెప్పించాడు. కాఫీ అయిందికాని మూదిరావు విడవడే!

"రాకన్ మానవు హాని వృద్ధులు"—అన్న భర్తృహరి వాక్యాన్ని మననం చేసుకొన్నవాడయి, జానకితో లేచినాడు వరద సుందరుడు. కూడా వచ్చాడు గిరజాలు ఎగరేసుకుంటూ మూదిరావు. —బస్సుల మోత, బళ్ళ రద్దీ దాటి చిన్న వీధిలోకి వచ్చారు ఎవరూ మాట్లాడ్డంలేదు......ఒక్క మూదిరావే వర్షిస్తున్నాడు చెవిలోని జోరీగగా. సుందరం మనసు విషాదంతో మేకప్ మొదలెట్టింది. తమ లోకాన్ని ఆ పూట కలుషితం చేయడానికి మనుషులందరూ కలిసి కట్టుకున్న కంకణంలా కనుపించాడు మూదిరావు.......జానకి ఆదర్శ భారత సతియై పతివెంట నడుస్తూంది.

హఠాత్తుగా మూదిరావు ఒక అస్త్రం వదిలాడు—"వరదం! నీకూ—గేయాలు చదవడం ఇష్టమా.......వినడం ఇష్టమా......?"

అపశకంగా కొంతమంది నోళ్ళు కుట్టేయడం ఇష్టం—అని చెబుదామని జానకి అనుకుంది.... అవును.........అనుకుంది, అంతే!

దైవోపహతుడు—వరద సుందరం—"గేయాలు చదివితేనే బాగుంటాయి—" అన్నాడు, ఆముదం కన్నా కూల్ డ్రింకు మరోటి ఉండబోదన్న ఘోరణిలో......ఈ నిరాశ వెనకాల ఒక చిన్న ఆశాజ్యోతి జీరో వాట్‌ది, ఉంది. గేయాలు చదివితేనే బాగుంటాయి అంటే, ఆ గేయకర్త—'ఇదిగో చదివి చెప్పు' అని ఓ పుస్తకం చేతికివ్వవచ్చు. లేదా 'రేపిస్తాలే' నా సంపుటం' అనవచ్చు.......మొత్తం మీద ఇప్పుడు తప్పించుకోవచ్చు......అన్నది సుందరం ఆలోచన. కాని, అప్పటి కయ్యది అప్రస్తుతమయింది. ఆ పూట అతడి అదృష్టం అధ్వాన్నంగా ఉండింది.....

"......ఆ......అదీ! నాకు తెలుసోయ్ నాకు తెలుసు......నీకు మంచి మంచి అభిరుచులున్నాయనీ........అయినా ఈ రోజుల్లో మాంచి టేస్టున్నవాళ్ళే అవుపడరోయ్.......ప్ప్ ప్ప్! ఇదిగో చూడు సుందరం! ప్రస్తుతం నా దగ్గర గేయాలేవీ లేవు గానీ......"

"అమ్మయ్య" అనుకోబోయాడు వరద.

"......గానీ నే నొక గేయం రాశాను 'శాంతి' మీద! అది నాకు కంఠంతా వచ్చు. చదువుతా విను......" అని ఒక చేత్తో సుందరం భుజం పట్టుకుని, నడి రోడ్డుమీద ఆపి, ఇంకో చేతిని భావయుక్తంగా కదిలిస్తూ, కళ్ళు మూస్తూ, తెరుస్తూ—గుహలో లోపలినుండి వచ్చే పులి గర్జనలాంటి స్వరంతో—

"కావాలి రావాలి
అందమయిన అమ్మాయి లాటి శాంతి
ఆనందపు అర్ణవమయిన శాంతి......
......అలాటి
శాంతికోసం అహర్నిశలు
ఆరాధన చేస్తున్నా......"

అంటూ మొదలెట్టాడు.

అతి కష్టంతో వరద సుందరం నడక సాగించాడు. వచ్చే పొయ్యేవాళ్ళు ఎగా దిగా చూడ్డం సిగ్గనిపించింది జానకికి.

ఎక్కుపెట్టి వదిలేసిన బాణం లాగున గాలిలోకి దూసుకు పోతుంది మూదిరావు గేయ స్వరం.

"శాంతి రాగం తపసులాగా
అలాపన చేస్తున్నా—
శాంతి దీపం వెలగాలని
ఆవాహన చేస్తున్నా—"......

జానకి నెమ్మదిగా సుందరం చొక్కా లాగింది.

తెగించాడు వరద......."ఒరేయ్ అబ్బాయ్ మూదీ! కాస్త మా ఆవిడ ఆరోగ్యం బాగులేదట—వస్తా......"

"మేదిమీద యుద్ధ పంకు......?......అబ్బెబ్బే.... అది గేయంలే! ఏవిటీ......ఆరోగ్యమా......ఓ! యూ మీన్ ఆరోగ్యవా......సరేసరే......ఒరేయ్ ఎలా ఉందంటావు గేయం......" అన్నాడు అక్కడే నిలబడిపోయిన మూదిరావు.



తలనొప్పా?



పంటినొప్పా?



ఒంటినొప్పా?



బహిష్టు రోజులా?

# సారిడన్ 'రోష్'

## వేసుకోండి

నొప్పిని పోగొట్టును, సేదదేర్చును,
నవోత్సాహమును కలిగించును







ఒకే సారిడన్ బిళ్ల చాలును
ఒక బిళ్ల ఖరీదు 13 నయా పైసలు



నొప్పులనుండి త్వరితముగా ఉపశమనమును పొందుటకు సారిడన్ వేసుకోండి. తలనొప్పి, పంటినొప్పి, ఒంటినొప్పి, మామూలు అస్వస్థతలకు సారిడన్ దివ్యమైనది. సారిడన్ త్వరితముగా, నిరపాయముగా మరియు నిశ్చయముగా పనిచేస్తుంది. మీరు ఒకే బిళ్ల వేసుకొంటే సరిపోతుంది! పిల్లలకు ¼ నుండి ½ బిళ్ల వరకు చాలును.

'రోష్' తయారు ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

JWT/VT 4793

# కోటి విద్యలు

"నీ గేయానికేరా దివ్యంగా ఉంది ...." అని గబగబ గంతులు వేసుకుంటూ నిష్క్రమించాడు వరద సుందరం—జానకిని లాక్కెడుతూ.

"దివ్యం దివ్యం—" అని రెండు సార్లు అనుకుని ఆపాటికి చీకటయి పోవడం గమనించి—వీధిలాంతరు క్రింద కెళ్ళి నిల్చుని చిన్న నోటు పుస్తకం తీసి, ఓ ఖాళీ పేజీ మూలాగా, "దివ్యం, భవ్యం, నవ్యం" అన్న పదాలు ఒకదాని కింద ఒకటిగా రాసుకుని నడిచాడు సూదిరావు... ..

"అయినా మీకు అంత వోపిక పనికి రాదండీ" అంది ఇల్లు చేరిన జానకి.

ఆమె మొహంచూసి తన యాతనంతా మరిచి పోయిన సుందరం అన్నాడు—"ఏం చెయ్యమన్నావు జానకీ, వాడు చిన్నప్పటినుండీ నాతో చదువుకున్నాడూ......"

అయినా......ఆయన మిత్రుల వరస బొత్తిగా నచ్చలేదా అమ్మాయికి. ఆ వూరు విడిచి పోతామని ఆ రాత్రే ఒదినతో చెప్పింది జానకి.

మరునటి రోజు......అనేక తపాల ముద్రలూ ఎర్ర సిరా రాతలూ కల ఒక రిజిస్టర్ కవర్ వచ్చింది వరద సుందరరావుకి....

ఈ సందర్భంలో కథాంతరంగా ఒక్క విషయంబు నుడువలె.

ఘనత వహించిన సర్కారువారి ఉద్యోగాలలో అనేక తరగతులూ, అనేక రకాలూ ఉన్నాయి అందులో ఒక్కటి 'తుమ్మితే వూడే ముక్కు రకం' ఒకటి. ....ఈ రకం ఉద్యోగాలలో పెద్ద వింత ఏవిటంటే—ఆఫీసు వాళ్ళు 'హాచ్!' అని ఓ కాయితం ఇస్తారు. అంటే ఇవతల ఆ కాగిత వాయినం పుచ్చుకున్నవాడికి ఉద్యోగం వూడిందన్నమాట! ఇలాటి వాటిని 9 ఏ 1 అనీ, 10 ఏ(1 అనీ అంటారు. . .అలాగంటే ఏవిటి అని అర్థాలు అడక్కండి.. రూల్స్ నవ్విపోగలవు.

అయ్యలారా! ఇలాటి తొమ్మిదీ పదీ నెంబరు ఉద్యోగాలలో ఒక దానిని అలంకరించినవాడు వరద సుందరుడు.

జానకి కనుసీమల స్వర్గాలో, ఝుమ్మన్న విహరిస్తూ - తన సెలవు ఆరు రోజులే నన్నది మరిచి పోయి ఎద్దెనిమిది రోజుల దాకా, అదే—సూది రావు గేయం వినే రోజు దాకా ఉండిపోయాడు సుందరం.

అలా ఉండిపోవడం ఫలితమే ఆ రిజిస్టర్డ్ కవర్రాజము.

కవర్ చదివి మడిచాడు వరద సుందరం.

నిన్నటినుండి ఘడియలు బాగులేవు.

ఫోటోలోకి గబ్బిలాలు మీలాసా లొచ్చాయి.

హోటలు కాఫీలోకి గేయాల సూదులొచ్చాయి.

ఈ పూట ఉద్యోగానికి జలుబు చేసింది.

ముక్కు తుడుచుకున్నాడు. వరద పెళ్ళయి నెల దాటలేదు. ఉద్యోగం వూడింది ఎంత, య్యొంత దారుణ పరిస్థితి!......అయినప్పటికీ సుందరరావు దుఃఖించెనా?

దుఃఖించనేలేదు.

"ఏవిటండీ అదీ....." అని ఎర్రగా పండిన తన నాలుకని చూచుకుంటూ అడిగింది జానకి.

ఒక క్షణం జానకిని చూశాడు సుందరం. తుంచేసిన మందార పువ్వుల్లా ఉన్నాయి......ఆమె పెదవులు.

"జానకీ.... ..ఓ సారి నవ్వు......" అన్నాడు సుందరం

జానకి నవ్వింది—కళ్ళతో కారణం అడుగుతూ.

ఆ నవ్వుని చూసి.....'ఆ.....వెధవ ఉద్యోగం పోతే పోయింది లెద్దూ.....' అనుకున్నాడు ఆ నవ్వు గలావిడ వాళ్ళాయన.

జానకి చేతులమీద చెక్కిలినానించి మంచం మీద కూచుంది.

అందమయిన ఆ దృశ్యాన్ని మనసుమీద నిలుపుదామనుకుని ఓసారి కళ్ళు మూసుకున్నాడు సుందరం. మనసు తెరమీద మందార పువ్వులతో బాటు ఎర్ర తపాల ముద్రలూ కనుపించాయి....ఠొమ్మని కళ్ళు తెరిచేశాడు కళ్ళ నాయకుడు.....

మళ్ళీ ఓ క్షణం కళ్ళు మూసుకున్నాడు. చిటికెలు వేస్తూ గడ్డం గిల్లకున్నాడు. గడ్డం గిల్లకుంటూ బుర్రగోక్కున్నాడు.

హఠాత్తుగా బాంబు పేలినట్లు—ఇవన్నీ మానేసి ఎగిరి గంతేశాడు.

"హా తెలిసెన్.....జానకీ......" అన్నాడు.

"నేను నిన్ననే చెప్పానా గేయాలు మంచివి కావనీ......మీకేమో ఇప్పుడు తెలిసొచ్చిందా?" అని పెదాలను నాలుకతో తడుపుకుంది జానకి.

"అబ్బే అది కాదు మైథిలీ, అదికాదు.....విను చెబుతా. ..." అని వరద సుందరరావు తన అయిడియాకు అక్షరాలతో ప్రాణం పోశాడు.

జానకి ఒప్పుకోలేదు. సందేహం సూచించింది. ఇంకేదన్నా ఆలోచిద్దాం అంది.

కాని, సుందరం కృతనిశ్చయుడయినాడు

* * *

ఇదంతా జరిగి ఏడాది కాలేదుగాని, వరద సుందరరావు కీనాడు అదృష్ట దేవత గొడుగు పడుతూంది. కారణం? అతడు పెట్టిన దుకాణం వెయ్యి చేతులతో ఆర్జించడమే .....పెళ్ళి వంటి సందర్భాలలో బంధు మిత్రు లందజేయవలసిన బహుమతిగాని—శిరమచ్చో వామ పాదమున తొలగం త్రోయించుకున్న శ్రీ కృష్ణులవారు సత్యాదేవి కిచ్చే పారిజాత వృక్షంగాని—మంత్రిగారింటికి పంపవలసిన పార్సెలుగాని—ఏదయినాసరే, వరద సుందరరావు దూకాణంలో దొరకని వస్తువేలేదు! ప్రతీ సాయంకాలమూ గుంటూరు గుంటూరంతా అతడి కొట్లో ఉంటుందనడం కొంచెం మాత్రమే అతిశయోక్తి......

మరి ఈ మార్పు ఎలా సంభవించింది?

అలనాడు జానకీ సుందరులు గేయాన్ని విన్న మరురోజు—ఉద్యోగానికి తుమ్ము లొచ్చిన అవామాన్యపూట—ఆలోచనలో కళ్ళు మూసుకున్నప్పుడు, పెళ్ళిలో తమకు బహుమతిగా వచ్చిన

నలభై రెండు వెండి గంధపు గిన్నెలూ
పదిహేడు టాయిలెట్ సెట్లూ
తొమ్మిది వెండి లోటాలూ
ఎనభై పుస్తకాలూ
మూడు దంతపు కృష్ణుడి బొమ్మలూ
ఆరు నగల ఖాళీ పెట్టెలూ
ఇరవైఆరు ఫోటో ఫ్రేములూ
పన్నెండు టార్చిలైట్లూ
ముప్ఫైఐదు కుంకుమ భరిణలూ
పదహారు వెండి వెంకటేశ్వర్ల పటాలూ

వగైరా అంతా వరసగావచ్చి నిలిచాయి వరద సుందరం మనోవీధిని.

మారు మాట్లాడకుండా, వూరెళ్ళిపోయి వాటి నన్నిటినీ గాజు బీరువాలో పెట్టేసి బహుమతి వస్తువుల దుకాణం తెరిచినాడు—అదృష్టం వరించిన వాడు—జానకీ నాథుడు. 






# అంతుదొరకని హత్య

27 వ పేజీ తరువాయి

వెళ్లడానికి టిక్కట్లు రిజర్వు చేయించుకున్నట్లు అతని కార్యదర్శి చెప్పింది. అతను మియామికి జనవరి 28 వ తేదీన రిజర్వు చేయించు కున్నాడట !! తమ తమ ఉద్యోగాలు ఏమవుతాయో అన్న ఆందోళన తప్ప యజమాని చావు గురించిన ఆందోళన వారికి లేదు.

ఈ తతంగం అంతా అయిన తరువాత ఎస్టేల్ గార్డనర్‌ని కలుసుకోవాలనుకున్నాను. సెర్జ్ రాబిన్‌స్టైన్ నౌకరు విలియమ్ మార్ట్లర్ని కలుసుకున్నప్పుడు అతను — తన యజమాని గార్డనర్ భార్య "అందాలరాశి" తో విందుకు వెళ్లాడని చెప్పాడు. న్యూయార్కులో ఒక షాపులో ఆమెను చూశాను. మార్ట్లర్ ఆమెను సరిగా చూసిఉండలేదనిపించింది. లేకుంటే ఆమె అందమైనది గాక, చక్కని అవయవ సౌష్టవం, ఆకర్షణ కూడా కలది అని చెప్పి ఉండేవాడు. ఆమె నుదురుమీద మూడు చోట్ల మెలితిరిగిన ముంగుర్లు గాలికి వూగుతూ ఆమె అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి.

ఆమె ఆఫీసు రూములో వయ్యారంగా కుర్చీలో కూర్చుని, వెనక్కు జారపడి, సిగరెట్టు ముట్టించింది. నేను మరో సిగరెట్టు వెలిగించాను.

"సెర్జ్ రాబిన్‌స్టైన్ నాకు బహు కొద్దిరోజుల నుంచీ తెలుసు." అని బాగా అలసట పొందినదానివలె ప్రారంభించింది. "రెండు వారాల క్రితం అనుకుంటాను, అవేళ జనవరి 13 వ తేదీ—వైట్ బాల్ వద్ద అతన్ని కలుసుకున్నాను. ఆరోజు రష్యావారి నూతన సంవత్సరావతరణ దినం. మీకు తెలియదూ" అని నన్నడిగింది. తెలీదని నేను తక్కున ఒప్పేసుకున్నాను.

"గతరాత్రి : ఔను. మే మిద్దరం కలుసుకుని ఆనాటికి మూడోరోజు. ఇద్దరం కలిసి ఒక చిన్న హూళ్లో భోజనం చేశాము. ఆనక, పట్టణంలో ఉన్న క్లబ్బుల్లో కొన్నిటికి వెళ్లాము. నైనో లారూలో ఒక ఆట చూడటంతో నాటి మా కలయిక ముగిసింది."

"ఆనాడత నేమైనా మానసికంగా బాధపడుతున్నట్లు మీకు కనుపించాడా ?"

"లేనేలేదు. పైగా చాలా హుషారుగా కూడా ఉన్నాడు. కాని చాలాసార్లు ఎవరెవరికో ఫోనులు మాత్రం చేశాడు. నా కటువంటి అంతరాయాలు గిట్టకపోయినా, డబ్బు కలవారికి లక్ష శతకోటి పను లుంటాయి. అదేదో ఆ జాతికి చెందిన గొడవయ్యుంటుందని నన్ను నేను సమాధాన పరచుకున్నాను."

"ఆనక మిమ్మల్ని ఇంటిదగ్గర అతను దిగబెట్టాడా ?"

"లేదు" అందామె గమ్మున."అప్పటి కింకా పెద్దగా ఆలస్యం అవనేలేదు. అందుకని తన ఇంటికి వచ్చి కాస్త వైన్ త్రాగమన్నాడు. నేను ఒప్పుకున్నాను. రెండు గంటల కనుకుంటాను. నన్ను గుమ్మం వరకూ వచ్చి సాగనంపాడు."

"మీరప్పుడు ఏవిధమైన దుస్తులు వేసుకున్నారో కాస్త తెలియజెయ్యండి" అన్నాను నేను. ఆమె నాకేసి అదోక రకంగా ఒక్కసారి

చూసి, నా కర్థంకాని వర్ణనలతో ప్రారంభించి 'సాయంకాలం వేసుకునే' నల్లటి దుస్తులు ధరించాననీ, అంతకన్నా నల్లటి చేతిసంచీ చేతిలో ఉందనీ, ఆ చేతి సంచిలో ఏవేవో చెప్ప విలులేని సరుకు లున్నాయని, ఎర్రటి కోటు వేసుకున్నాననీ చెప్పింది :

"మత్తెక్కించే ఎరుపయుంటుంది" అనుకున్నాను నేను. ఆనక ఆమెవద్ద శలవు తీసుకుని బయట పడ్డాను. మర్నాడామెను కలుసుకునే సరికి క్రితంరోజా దర్పం ఆమెలో లేదు. తనను రాబిన్సన్‌ను వెంటాడినట్టు ఎవరో చెప్పి భయపెట్టారని చెప్పింది. ఎవరో యిద్దరు వ్యక్తులు 'నినోలారూ' లో తనసేకేసి అదో రకంగా చూశారనీ, అలా చూసే వాళ్ళు చాలామంది ఉంటారు అని అప్పుడు సమాధాన పరుచుకున్నాననీ ఆమె చెప్పింది. "ఆనాటి రాత్రి ఆమెను, సెర్జ్‌ని ఎవరో వెంటాడారనే విషయం నే నంతగా నమ్మలేను" అని డిప్యూటీ ఛీఫ్ ఇనస్పెక్టర్ ఎడ్వర్డ్ ఫిలి చెప్పాడు.

పాట్‌రే అనే ఆమె నాకు రెండో సాక్ష్యం. సెర్జ్‌కి సంబంధించిన 'ట్రాన్స ఈరా పెట్రోలియం కార్పొరేషన్' లో ఆమె అతనికి కార్యదర్శి. సెర్జ్‌ని గురించి ఆమెకు తెలిసినంత మరెవ్వరికీ తెలియదు. కాని, ఆమె మాత్రం చాలా నిక్కరంగా, వ్యాపార సరళిలో మాట్లాడింది. మేము ఎవర్ని అనుమానించినా సరే, ఆ వ్యక్తిని తీసుకుపోయి, పాట్‌రేకి చూపించి, ఆమెకు ఆ వక్తి పరిచయమేమో అనే విషయం నిర్ధారణ చేసుకున్నాము.

* * *

"సెర్జ్ మీ కెన్నాళ్లనుండి తెలుసు ?" అన్నాను నేను "ఐదేళ్ళనుంచి" అని ఆమె సమాధానం చెప్పి, తన చేతిలో ఉన్న పెన్సిలుతో ఒక పుస్తకంమీద ఐదు అని అంకె వేసింది.

"మీ రిద్దరూ మంచి స్నేహితులా ?"

"వివాహం కూడా చేసుకుందా మనుకున్నంత స్నేహితులం" అని ఏవో గీతలు ఆ పుస్తకం మీద గీసింది.

"అతన్ని గురించి మీకు తెలిసినదంతా చెప్పండి" ఆమె ప్రారంభించింది. కాని, అదేమంత ప్రేమ కథ కాదు. ఒక రకమైన పోట్లాటలతో, అసూయలతో, రాజీలతో నిండిన కథ. సెర్జ్ తనను గత సోమవారం కలిశాడని చెప్పింది. కాని, మంగళ, బుధవారాలలో చాలాసార్లు ఫోను చేశాడని చెప్పింది.

బుధవారం రాత్రి—అంటే సెర్జ్ ఎస్టిల్‌తో నున్నపు డున్నమాట !

"బుధవారం రాత్రి నా కతను ఫోను చేసినపుడు సుమారు రెండుగంటలయ్యుండచ్చు" అని చెప్పింది. అనగా ఎస్టిల్ వెళ్ళిన తరువాత నన్నమాట అనుకున్నాను.

"ఫోనులో ఏమని చెప్పాడు ?" అన్నాను.

"తన ఇంటికి రమ్మన్నాడు. కానీ, నేను చాలా నిద్రమత్తులో ఉన్నాననీ, రాలేననీ చెప్పాను" అంటూ ఆమె ఆ పుస్తకంమీద ఏవో గీతలు గీసింది.

సెర్జ్—పొందిన దానితో సంతృప్తి లేనివాడనీ, పొందదలచుకున్నది పొందలేనివాడనీ, వాటికి ఆశపడేవాడనీ, ఆవేశపడే స్వభావం కలవాడనీ, పాట్‌రే గ్రహించిందని నాకు తోచింది. ఆమాత్రం తెలివి స్త్రీజాతికి అసహజమేమీ కాదు.

* * *

సెర్జ్ రాబిన్‌స్టైన్‌కి పరిచయమున్న ఆడవారంతా పాట్‌రేకి తెలుసు. ఆమె ఇచ్చిన పేర్ల జాబితా ప్రకారం పరిశోధన ప్రారంభించాను.

మొదట నేను ఒకామెను కలుసుకున్నాను. ఆమె పాట్‌రే, ఎస్టిల పేర్లు వింటూనే మండిపడింది. ఆమె పేరు బెట్టీ రీడ్. చక్కగా ఎలుగెత్తి మోహనమైన స్వరంతో పాట పాడగలిగిన కంఠం కలది. ఆమె చక్కని గొంతెత్తి పాట పాడితే ఎంతటివాడికైనా చరణం ఎత్తుకొని, ఆమెతో యుగళగీతం పాడాలనిపిస్తుంది. సెర్జ్‌కి మొట్టమొదటి ఇష్టురాలిని నేను ఒక్కతినే అనే దర్పం ఆమెలో ఉంది. ఒక సంవత్సరం అతనితో గడిపింది. ఆమె అతనికన్నా చాలా పొడగరి.

"నిజానికి ఆయన నన్ను వివాహం చేసుకోవాలని అభిప్రాయపడ్డారు" అందామె. "టెన్నెస్సీలో ఉన్న మా ఇల్లు అమ్మేసి రమ్మని నా తల్లిని అడిగాను. కానీ, ఆయన్ని గురించిన పుకార్లు వినడంవల్ల నా తల్లి నాతో వచ్చి న్యూయార్కులో ఉండడానికి సమ్మతించలేదు" అంది.

ఆమె చాలా ఖులాసాగానే మాట్లాడింది. కాని ఆ మాటలలో పనికొచ్చే విషయం చాల తక్కువ. పైగా నాకేదో తెలియని విషయం చెప్పినట్టు సంబరపడింది.

'సెర్జ్—ఆయనే నా జీవితస్వామి' అనే వెర్రి వూహను పెట్టుకుని, బార్బరాకుక్ అనే నటి ఉద్యోగం, సద్యోగం లేక అలాగే ఉండిపోయింది.

ఈ కేసంతా ఆడమయమే ! అందరితోనూ మాట్లాడాము. కానీ, అతన్ని హత్యచేసే అవసరం ఎవరికి కలిగిందో బోధపడలేదు అంధకార బంధురం వంటి ఈ కేసు పరిష్కారంమీద ఏవిధమైన చిన్న వివరం, సహాయం అనే కిరణాలు జనం వైపు నుంచి రాలేదు. అతని జీవితంలో ఇంతమంది ఆడవారికి ప్రమేయ మున్నట్లుంది. గాని, ఒక్క మగవాడికి కూడా ప్రమేయ మున్నట్టు తోచలేదు. రాబిన్సన్‌ని ఆడవారంతా తమాకు తోచిన రీతిలో ఉపయోగించుకున్నారు. గాని, వారిలో ఎవరికైనా అతనిమీద 'ప్రేమ' ఉందా !— లేక అంతమందిలో ఎవరిమీదనైనా అతనికి 'ప్రేమ' ఉందా ! అనే విషయం అనుమానాస్పదం. నార్సిసస్ ఒక గ్రీకుదేవతలాగ తన ఆనందాన్ని, అనుభవాన్ని లోపలే యిముడ్చుకున్నాడేమో !

దాదాపు ఒక యాభై మందిని నానా ప్రశ్నలు వేశాక, అతను నిజమైన సంతోషం లేనివాడని, జీవితంలో ఒంటరి అని, తుంటరి అని, డబ్బు పుష్కలంగా పోగుచేసుకున్నాడని, అనవసరపు వూహాలు, చెడ్డ స్నేహాలు కలవాడనీ, ఆడవాళ్ళ 'పిచ్చి' అధికంగా కలవాడని, కలవాడు కనుక వెళ్ళిందని, శుద్ధ వాదస్తుడని, కోపిష్టివాడని, ఎవరెన్ని చెప్పినా వినని మొండివాడని, డబ్బు చేతిలో ఉంటే చేయలేనిది లేదనే స్వభావం కలవాడని, ఆడవారిని కేవలం సంతోషానికి ఉపయోగించుకోవచ్చుననే అభిప్రాయం కలవాడని, నేను అభిప్రాయ పడ్డాను

కాని అతనికి తన తల్లి అంటే అమితమైన ప్రేమ. ఆమెముందతను శాంతంగా ఉంటాడు. తల్లి కొడుకుల మమతలకి వాళ్ళిద్దరే సాటి. కాని, బాహ్యప్రపంచాని కతనో స్త్రీలోలుడు.

స్ఫిన్క్స్ (స్త్రీ ముఖం, సింహ శరీరం కల రాక్షసి) లాగ ఎన్నడూ తన మనస్సులో ఉన్నది బయట పెట్టేవాడు కాదు. ప్రతివాళ్లను ద్వేషించేవాడు. తన వ్యాపారానికి, పురోగమనానికి అడ్డు వచ్చే చట్టాన్ని దుమ్మెత్తి పోసేవాడు. తను పొందదలుచుకున్న స్త్రీలను లాలించి, బుజ్జగించి నట్టే వ్యాపారంలో పొందదలుచుకున్నవాటిని కూడా లాలించేవాడు

'మోసగాడు, వంచకుడు' అని మాత్రం అతన్ని అనలేము. ఏ చట్టంలో దొంగదారులున్నాయో, ఏ చట్టానికి పక్కదారులున్నాయో, తప్పించుకునే మార్గాలున్నాయో ఫిలడల్ఫియా న్యాయవాదులకన్నా అతనికే ఎక్కువ తెలుసు. నీతికి, నియమానికి వ్యతిరేకంగానే అతను డబ్బు సంపాదించాడనీ నలుగురూ అభిప్రాయపడినా, నిరూపించడానికి తార్కాణాలు లేక—ఆ అభిప్రాయం అట్టే ఉండిపోయింది **(సశేషం)**



ఏరి ?" అంటూ సురేఖ స్నేహితురాలి దగ్గరికి ఆప్యాయంగా వచ్చింది.

*　　*　　*

"చెల్లే ! తెలివైన దానివి ఎలాగైతేనేం.... అదుగో ఆయనగారికియ్యి" పద్మావతి అటు మొహం తిప్పుకుని ఎడంగా వెళ్ళిపోయింది.

"డియర్ ! నీవు బాగా అలిసిపోయావు.... మీ భాస్కరం గారికి ఇవాళ గండం గడిచింది—నిజంగా కొండ ఎక్కితే ఆ పెద్ద మనిషి అక్కణ్ణుంచే పడునేమో...." - సురేఖ అనునయంగా ఆ పిల్ల దగ్గరిసా వెళ్ళింది.

భాస్కరం ఏం చెయ్యలేని పరిస్థితి అది - నలుగురూ మూగుతారు – నలుగురూ గమనిస్తారు.

అలాగే బెల్లం మొత్తిన రాయిలా వూరుకున్నాడు.

పద్మావతి అక్కసు చల్లారలేదు. – రకరకాల నీచమైన మాటలు వచ్చాయి "కొండమీంచి పడకుండా నీవు కొంగున కట్టుకున్నావ్‌గా" అందా మనుకుంది.

"ఛీ ! ఛీ ! ఇంత మభ్యపెట్టడం ఎందుకు? దగాకోర్‌లు" అందామనిపించింది. కాని సంస్కార పటిమ నంతా ఉపయోగించుకుని నిగ్రహించుకుని "పాపం ! నువ్వు లేపోతే ఆయనగారు ఆ రెండో చెయ్యికూడా మరో రంగురుమాలు కట్టుకోవాల్సి వచ్చేది — అన్నది బుస్సున బుస్సున చూస్తూ.

"ఇంద ! ఇవి రెండు తిను.... భోజనాలకి వెళ్దాం.. అన్నట్లు వాళ్ళేరీ?" ఏ మాటన్నా అది చిలికి చిలికి గాలివాన ఔతుంది గనుక — మరోమాట అనలేదు సురేఖ

పద్మావతి దూరంగా ఉన్న పదిమంది ఆడపిల్లల గుంపులోకి చూస్తూ "అక్కడున్నారేమో చూసొస్తా .... నువ్వు భాస్కరంగారిని చూస్తూ ఉండు"—అని గబగబా అడుగులు ఈర్ష్యాసూయలతోనూ ఉడుకుమోతుతనం కోపంతోనూ తడబడ వేస్తూ వెళిపోయింది.

"సారీ !" అన్నది హతాసుడై నిలబడ్డ భాస్కరాన్ని సురేఖ.

"మీరు క్షమించండి.... అదైనా ఈ మంద భాగ్యుడికి కాస్త శాంతి"

భాస్కరం మాటలకు సురేఖ ఏమీ అనలేదు. ఖిన్నురాలై అరటిపళ్ళను అతని చేతం బడేసి తాను కూడా పద్మావతితోపాటే తమ బృందం విడిసి ఉన్నవేపు కదిలింది.

భాస్కరం చెయ్యి చూసుకున్నాడు. ఒక చేతను సురేఖ రుమాలు — నెత్తురు మరకలయ్యాయి దానికి. రెండోచేత ఆ పిల్ల ఉంచిన అరటి పళ్ళు—

సురేఖ దూరమయ్యేదాకా కన్నార్పకుండా చూస్తూ నించున్నాడు.

శైలజ అటు స్త్రీల జట్టులోకి పారిపోడాన్నిగాని, మూర్తి తన కోసరం వచ్చి దగ్గరిగా నించున్న వైనంగాని అతను గమనించలేదు.

"ఒరే ! భాస్కరా !"

"ఊం."

"ఈ అరటి పళ్ళేమిటి ఈ చెయ్యేమిటి ?"

# ప్రేమకు పగ్గాలు

25 వ పేజీ తరువాయి

మూర్తి ఆశ్చర్యపోతున్నాడు.

"ఇదా ! ప్రసాదం తిను" అన్నాడు భాస్కరం.

## 37

పద్మావతి ఒళ్ళు మరిగి పోయింది. మనసు కుమిలి పోయింది. మనుష్యులు డబ్బును ప్రేమిస్తారని పదేపదే వినుకున్నది. నొచ్చుకున్నది. తన ఉద్దేశంలో భాస్కరం సురేఖ పట్ల చూపుతున్న చనువు ఆమె 'డబ్బు'ను చూసేనని — లేకపోతే ప్రేమకు మరో నిర్వచనమిచ్చి అది నిలకడలేనిదనీ మనుష్యుల అవసరాలతోను అవకాశ అనవకాశాల వల్ల మారుతుందనీ అనుకోవాలి. పద్మావతికి ఉక్రోషంగానూ స్త్రీ సహజమైన ఈర్ష్యగానూ ఉన్నందున మరోమాట తోచలేదు.

మర్నాడు 'తలనొప్పి'గా ఉంది జయమ్మగారు కాస్త గాభరాపడ్డది. "మాత్రలు మింగకు కావాలంటే ఏ అంజనమో తైలమో రాసుకుందువు గాని" అంటూ ఆమె కూతురి వంటిమీద చెయ్యి వేసి చూసింది.

ఒక ప్రఖ్యాత హాలీవుడ్ తారకి యిలా వుత్తరం వచ్చింది. "గౌరవ ప్రదమైన తారగారూ గౌరవప్రదమైన మీ ఫొటో ఒకటి సాధ్యమైనంత గౌరవప్రదమైన నగ్న భంగిమలో పంపండి"

"అబ్బె ! ఒళ్ళు వెచ్చగా లేదు...." అన్నది తనకు తనే ధైర్యం చెప్పుకుంటున్నట్లు.

"నే బళ్ళోకి పోలేనమ్మా !" కణతలు నొక్కుకుంటూ మంచాన వాలిపోయింది పద్మావతి

అప్పట్లో అది "మిష"యే ఐనా రానురాను, ఆలోచనల ఉధృతానికి తలవేడికి "శిరోవేధ"గా పరిణమించింది. భాస్కరాన్ని సురేఖనూ పిక్‌నిక్‌లో చూసిన దగ్గర్నుంచి, ఏ పనీ తోచటం లేదు. ఏ దారీ తెలియడంలేదు

"సురేఖ నన్ను ప్రేమిస్తున్నానన్నది మోసం ! భాస్కరంగారూ అలాగే అన్నాడు కాని ఆ ఇద్దరూ మోసం చేశారు.... ఇద్దరూ దిగజారి పోతున్నారు."

అదే బాధ, దుఃఖం, కోపం అహం – పద్మావతి భరించలేక లేచి పచార్లు చేసింది.

మధ్యాహ్నం పన్నెండు గంటలైంది. అవతల ఎండ మండిపోతున్నది. ఆమె హృదయం దహించుకు పోతున్నది.

"ఇక ఏం పోతావే అమ్మాయ్ ! ఎండ జాస్తీగా ఉన్న దవతల" అని జయమ్మగారు కూతురు కాలేజీకి పోతున్నదేమో ననుకొని వారించింది.

"ఇంకెందుకులే ! వెధవ కాలేజీ" అని లోపల లోపల గొణుక్కుంది పద్మావతి.

అంతలో సురేఖ గతంలో చాలాసారు నవ్వుతూ వేళాకోలమాడిన మాటలు "నీ భాస్కరాన్ని మాత్రం ఎత్తుకుపోనులేవే" అన్నవి — "లేవి పోడమా ! పోతే పోతానుగాని నీ ప్రియుడితోకాదు.. ధైర్యంగా ఉండు" అన్నవీ మాటలు జ్ఞాపకానికి వచ్చాయి కాస్త మనస్సుకి వూరట

"కాని.... కాని .. భాస్కరంగారే దాన్ని చూసిందగ్గర్నుంచి... ఛీ" –

పద్మావతికి భాస్కరం కావాలి ! చదువుకోడం, ఉద్యోగం చెయ్యడం ఇలాంటి వెన్ని చేసినా తృప్తిలేదు. హాయిలేదు "భాస్కరం గార్ని పెళ్ళి చేసుకుందామనుకున్నాను.... ఉహ్. ఈయనకూ ఈయనగారి పిల్లలకూ చాకిరీ చేద్దామనుకున్నాను. కాని.... వీళ్ళకు పొడుపోదాముందు ఈ నా ప్రేమ నా గౌరవం అన్నీ అగుపించవ్...."అని బాధపడ్డది.

అయితే అలా ఎంతసేపు ఆలోచించి మాత్రం...

"ఒకవేళ నేనే పొరపడ్డానేమో ! పాపం ! సురేఖ అన్నట్టు ఆయన కొండ ఎక్కుదామని వస్తూంటేనే పడిపోయి...." ఈ ఆలోచన రావడంతోనే పద్మావతికి చెయిజారిన అమూల్యమైన వస్తువేదో దొరికి నట్లైంది ! ధైర్యం కలిగింది.... ఆకలేసింది. "అమ్మా" అన్నది గట్టిగా ఉద్వేగంగా.

"కాస్త ఉప్మా చెయ్యనే? అమ్మాయ్?" ఆమె గుమ్మంమీద తలపెట్టుకుని కాసేపు అలా కన్ను మూసుకుని ఉన్నది –కూతురికేకకు లేచి కూచుని అడిగింది

"నేనే చేస్తాలేవే.... కాస్సేపు నువ్వు అలాగే పడుకున్నావుగా...." అన్నది పద్మావతి – లేచి వంట ఇంట్లోకి వెళ్తూ.

*　　*　　*

"ఛీ ! ఛీ ! దుర్మార్గురాలిని పాపం ! ఆయనకెంత దెబ్బ తగిలిందో. కనీసం దెబ్బతగిలిందనేనా నేను . ఆయనను మన్నించవచ్చునే !" కుంపటి అంటిస్తూ తలపోసింది.

"నేను ముందు వెళ్ళిపోయాను. వెనుక ఆయనగారు పడిపోయాడు... సురేఖ సమయానికి అక్కడ ఉన్నది... బహుశా గాయమై నెత్తురు కారిందేమో అది దాని రుమాల తీసి కట్టి ఉంటుంది ,..."—

"అయ్యో ! నేనెంత వెర్రిదాన్ని అలా ముందుగా కొండమీదకు పారిపోవడం ఏమిటీ ? పాపం ! సురేఖా మంచిదే. ఆయనా మంచివారే...." అనుకుంటూ ఉద్వేగంగా లేచింది

భాస్కరాన్ని కల్సుకుని క్షమాపణ చెప్పుకుని తన వాణ్ణి చేసుకోవాలి— సురేఖను అనునయించి ప్రతిమాలి—. ..

"అమ్మాయ్ ! అదేమిటే అవతల కుంపటి రగిలి రవ్వలై పోతూ ఉంటే.... నువ్వు వీధిలోకి వెళ్దామన్నట్టు బయట నించున్నావ్? "

జయమ్మగారు కూతురు ధోరణి చిత్రంగా వుండటంతో విస్మయ మందింది. తానే లేచి గోధుమ రవ్వతీసి 'ఉప్మా', చెయ్యడానికి ఉద్యుక్తురాలైంది.

గుమ్మంలో నించున్న పద్మావతికి, భాస్కరం వస్తాడేమోనని ఆశ !

"తన పిచ్చి ! ఎందుకని ? ఎలా వస్తారూ ?"—

"పోనీ ! సురేఖ రారాదూ !" అలా ఎన్ని తలపోసినా ఎవ్వరూ రాలేదు సాయంకాల మయింది.

*　　*　　*

మర్నాడు సురేఖను చూడగానే పలకరించాలనుకున్నది పద్మావతి. ఏ పనిమీదా ఆమె మనసు

నిలవడంలేదు. ఏ వస్తువు మీదా లక్ష్యం కుదరడంలేదు....

క్లాసులో సురేఖను చూస్తూనే కుంచించుకు పోతుంది పద్మావతి. ఆ ముందురాత్రి నించీ తాను అనుకున్న దంతా మరిచి పోయింది. విశాల హృదయంలో, పిక్‌నిక్‌లో జరిగిన సంగతిని మరిచి పోవాలి. భాస్కరం స్నేహం దక్కించుకోవాలీ అనుకుంటూ. రెండుసార్లు బస్సుహారన్‌కి ఉలిక్కి పడి మూడు సార్లు సైకిళ్లకు అడ్డంపడి ఆలోచిస్తూ వచ్చిన పద్మావతి సురేఖను మామూలుగా కలుపుగోరుతనంగా పలకరించలేక పోయింది.

సురేఖే పలకరించింది. — ఆమె నవ్వు నిర్మలంగానే ఉన్నా అందులో వెటకారం అగుపించింది పద్మావతికి.

"ఏవోయ్ ? క్లాసుకి రాలేదు ?" సురేఖ బెంచీమీద కూచుంటూనే అడిగింది.

"నా కర్మ" అంది పద్మావతి.

"కాదు నీ క్రియ.... అసలు నీ సంగతి నాకేం బాగోలేదు" సురేఖ నవ్వడానికి ప్రయత్నం చేసింది.

పద్మావతి మొహం ముడుచుకుంది తప్ప ఏం మాటాడలేదు. అంతలో చేతినిండా గుప్పెడు సుద్దముక్కలతో లెక్చరర్ ప్రవేశించాడు.

## 38

క్లాసునించి విశ్రాంతి భవనానికి వెళ్ళేటంత వరకూ సురేఖ పద్మావతిని ఆవేశంగా కూకలేయసాగింది.

"నువ్వు మనుషుల్ని నీచంగా చూడకూడదు. పరిస్థితులను అర్థం చేసుకో గలగాలి.... పద్ధతులను వీలైతే మార్చుకోవాలి.... మనం అనుకున్నవన్నీ అలాగే అవుతాయనుకో కూడదు... భాస్కరంగారి స్నేహాన్ని గాని నా తత్వాన్నిగాని అపార్థం చేసుకోగూడదు... నీకా హక్కు లేనేలేదు."

"పద్మావతి ముక్కు పుటాలు పొంగుతున్నాయి కాని ఆవేశం చాత ఏమీ అనలేదు. ఎట్టకేలకు 'నీ ఉపన్యాసం అయితే ఇక నోరు మూసుకో'' మంది.

'చిత్తం'' అన్నది సురేఖ

నోరు మూసుకుని— స్నేహితురాలి అలక తీరిందనే భావించింది కనుక నవ్వేసింది. పద్మావతి భుజంమీద చరిచించిది.

పద్మావతి కూడా నవ్వడానికి ప్రయత్నం చేసి "బహుశా, నేను భాస్కరంగారిని సరిగ్గా అర్థం చేసుకోలేదేమోనే.... గుడ్‌లక్ ! ఐయామ్ సారీ'' అంటూ గిరుక్కున తిరిగి చెకచెకా విసవిసా వెళ్లి పోయింది పద్మావతి.

చకితఐపోయింది సురేఖ. 'విద్యుతాఘాతం' తగిలినట్లుందా "గుడ్‌లక్" అన్నమాట. పద్మావతి "తీసి పెట్టి ఒక చెంప దెబ్బవేసినా" ఇంత ఆశ్చర్యపడకపోయేను గాని ఇలా ఈటెల్లాంటి మాటలతో 'దెప్పి పొడిచి' వెళిపోవడంతో, నాలుగైదు క్షణాలు ఆట్టే సిరై పోయి నిలిచి పోయింది!

* * *

పద్మావతికి ఆటుతర్వాత క్లాసులకు వెళ్ల బుద్ధి కావలేదు. లైబ్రరీకి వెళ్లింది. తెలిసిన వారెవరి కంట పడకుండా ఆఖరి వరుసలో బల్లకి పెడ మొహంగా కూచుని రెండు పెద్ద పుస్తకాలు ముందు పడేసుకుంది. పేజీలు కాని అక్షరాలు గాని అగుపించడంలేదు. నిమిషాలే గడుస్తున్నాయో గంటలే తిరుగుతున్నాయో ఆ పిల్లకి తెలియలేదు.

"భాస్కరం మంచి వాడని కొంచెం సేపూ దగాకోరు, చంచల హృదయుడు అని కొద్దిసేపూ ఆమె మనసు ద్వంద్వానుభూతులకు లోనై వ్యాకుల పడసాగింది.

అంతలో ఆమె ప్రక్కనే ఎవరో కదిలినట్లైంది ఉలిక్కి పడి చూసింది. భాస్కరం. కన్నీళ్ళొక్కటే తక్కువ పద్మావతి మొహంలో!

"నీకు.... నీకు.... క్లాసులేదూ ?" భాస్కరం సంకోచంగా అడిగాడు.

"ఉంది" లేచి పైట సరిగ్గా వేసుకుని నోట్ పుస్తకం తీసుకుని అతనికి తన మొహం చూడగల అవకాశం ఇవ్వకుండా అటు తిరిగి వెళిపోసాగింది.

భాస్కరం నలుగురి మధ్యా— అందులోనూ లైబ్రరీలో "నిశ్శబ్దము" అనే ఇంగీషర్డం బోర్డులను చూస్తూ— ఆ పిల్లను పిలవడం గాని అనుసరించడంగానీ చేయలేక పోయాడు.

కాని నాలుగు క్షణాల తేడాలో ఇవతలకు వచ్చి ఆమె ఎటు వెళ్లిందాని నలు దిక్కులా కలియజూశాడు. కాని పద్మావతి జాడ అగుపించలేదు.

'మా అమ్మాయి బంగారం లాంటి' దన్నాడు తండ్రి.

'దానికి విలువెక్కడ ? మా అబ్బాయి పంచదారలాంటి వాడు' అన్నాడు వియ్యంకుడు.

సారంగపాణి (మద్రాసు)

క్లాక్ టవర్ చూశాడు— ఒంటి గంటా ఇరవై నిమిషాలు !

"క్లాసు ? ఇప్పుడా ? నాన్‌సెన్స్" అనుకున్నాడు. పద్మావతికి ఇంకా 'కోపం తగ్గలేదు అనుకున్నాడు.'

'షష్టి పూర్తి హాలు'కేసి ఆశగా చూశాడు శైలజ వస్తోంది అటునించి. కాని భాస్కరం ఎటో చూస్తున్నట్లు ఆ పిల్లను తప్పించుకు వెళ్లిపోయాడు—

భాస్కరానికి మధ్యాహ్నం ప్రాక్టికల్ క్లాసుంది! పద్మావతి కోసరం వెళితే మధ్యాహ్నం "క్లాసు" వదులుకోవాలి. అదీగాక పద్మావతి యూనివర్సిటీ ఆవరణలో ఉందో ? ఇంటికే వెళ్లిపోయిందో....

ఎండ తీక్షణంగా కాస్తోంది.

అలాగే పదినిమిషాలు ఎటూ నిర్ణయించుకోలేక నిలబడిపోయాడు.

"సరే ! క్లాసుకి వెళ్తాను.... సాయంకాలం వాళ్ల ఇంటికి వెళ్తాను" అనుకుని ఒక నిర్ణయానికి వచ్చినట్లు, కాలేజీకేసి గబగబా నడిచాడు.

ఆ మధ్యాహ్నం అతని ప్రయోగం పూర్తిగా దారి తప్పింది. ఏసిడ్ ఫ్యాంటుమీద పోసుకున్నాడు. "టెస్టు ట్యూబ్"లు ఎరసగా పగలగొట్టుకున్నాడు. ఆ సాయంకాలం కూడా నేరుగా "రూమ్‌"కి వెళ్లి —పక్కనే ఉన్న సోమసుందరాన్ని పిలిచి నీకు నచ్చిన సినిమాకి తీసికెళ్తమన్నాడు.

సోమసుందరం సంతోషంగా 'నీ మణీపర్సా ? నా మణీపర్సా ? ఏది తేవాలి ?' అన్నాడు.

"నాదే" — భాస్కరం మొహంకూడా 'రుద్దుకో' లేదు. బయలుదేరాడు.

"వో. కే. దెన్ యిట్స్ యువర్ పార్టీ రైట్" అన్నాడు సోమసుందరం.

"హోయ్ ! సోప్స్.... తిన్నగా పద.... నీ ఇష్టమైన సినిమాకి పద. నా పార్టీయే ఐనా నీదీ ఇష్టం." విసుక్కున్నాడు భాస్కరం.

పద్మావతి ఇంటికి వెళ్దామనుకున్న భాస్కరం ఆ విధంగా ఓ "మర్కట మల్లయుద్ధం" లాంటి సినిమాకి వెళ్లాడు.

* * *

ఐతే భాస్కరం కన్నా సున్నితమో అభిమానమో ఎక్కువగా గల సురేఖ మాత్రం కాలేజీ నించి ఆఖరి "గంట" కాగానే "అవ్‌రాండ్స్" కేసి నడిచి వెళ్లింది. పద్మావతి ఇంటిని సుళువుగానే గుర్తు పట్టింది.

ఇదివరకు ఒకసారి చూసి ఉన్నందున జయమ్మగారు సురేఖను "అనుకోకుండా వచ్చావమ్మాయ్! రా ! రా!" అంటూ ఆహ్వానించింది.

"పద్మావతి నోట్సు ఇస్తానందండీ" అంటూ ఆమెకు నమస్కారంగా చేతులు జోడిస్తూనే అన్నది సురేఖ.

జయమ్మగారు 'పద్మా'ని పద్మావతిని కేకవేసి ఈ ఇద్దరికీ కాఫీ కలిపి ఇద్దామని వంటగదిలోకి వెళ్లింది.

"కూచో" మన్నది పద్మావతి సురేఖను తెచ్చి కోలునవ్వుతో ఆహ్వానించింది.

"నీకు ఒంట్లో బాగోలేదా ?" సురేఖ మంచం అంచున కూచుంటూ అడిగింది.

జయమ్మగారు కాఫీలు కప్పులో పోసి "అమ్మాయ్ !" అని కేకేసింది. గది వంటగది అన్నీ ఒక చోటే గనుక, ఆమె ఇటుతిరిగి చూసి, మంచం అంచున అంటీ అంటనట్లు కూచున్న సురేఖను చూసింది.

"అమ్మాయ్ ! చాపవేసి కూచో పెట్టకోరుటే" అన్నది కూతురికి మర్యాద ఎలా చెయ్యాలో తెలియనందుకు నొచ్చుకుని.

"ఫర్వాలేదండీ ? అది కూడా కాస్త ముస్తాబవుతే మేం బీచ్‌కి వెళ్తాము" సురేఖ నవ్వుతూ అన్నది.

పద్మావతి ఆశ్చర్యపోయింది. వస్తానా ? రావా ? అని కూడా తననడగకుండా సురేఖ హుకుమ్ వేసినట్లు అనడంతో "నాకు తలనొప్పిగా ఉందే" అన్నది. మెల్లిగా

"సరిలే నాకూ ఉందిలే లేపద" సురేఖ లేచి స్వయంగా జయమ్మగారు తెచ్చిన కాఫీ అందుకుని.

"ఎందుకండీ ఇంతశ్రమ.... మేం మీకు పెట్టిఇవ్వడం పోయి మీరేమాకు ఇవ్వడం"అన్నది.

"అమ్మాయ్ ! మీరు ఈ పనులన్నీ చేస్తే డిగ్రీ లెలావస్తాయి ?.... అదీగాక ఈ పనులు అవసరమైనప్పుడు మీరు చేస్తారు.... అదీ ఆడజన్మలోనే ఉన్నది" అన్నదామె.

పద్మావతి ప్రత్యేకించి ముస్తాబవలేదు సురేఖ వెనకనే యాంత్రికంగా బయలుదేరింది.

"సురేఖను కూడా భోజనానికి తీసుకురావే అమ్మాయ్ ! మీరెళ్లగూ "టౌన్"లోకే పోరుగా" జయమ్మగారు కేకేసింది.

(ఇంకా వుంది)

మీ చెల్లెలిని చాలా పొగడుతూ మాటాడింది!" ఆర్నో ఒకసారి తల పంకించాడు. "మీ రిద్దరంటే ఆమెకి చాలా ఇష్టం. బయటికి నాజూకుగా చిలిపిగా కనిపించినా ఆమెది చాలా

## కొలంబా

21 వ పేజీ తరువాయి

పదునయిన బుద్ధి."

"చాలా ఆకర్షణీయమయిన మనిషి" అన్నాడు ఆర్నో.



"ఆమె కోరిక మీదనే ఇక్కడికి వచ్చానండీ! మీకు జ్ఞాపకం చెయ్యడం ఇష్టం లేదుకాని ఒక విచారకరమయిన వృత్తాంతం నాకు బాగా తెలుసు. బారిచినీగారు మళ్ళీ మేయర్ ఉద్యోగం చేస్తున్నారు. నేనేమో ఆయన కింద పని చేస్తున్నాను! మీకేవేవో కథలు కొందరు చెబుతున్నారని నాకు అనుమానంగా ఉంది. ఇవి మీరు నమ్మడం భావ్యం కాదు!"

"కొలంబా," అన్నాడు ఆర్నో కుర్చీలో నుంచి లేస్తూ. "నువ్వు బాగా అలిసిపోయావు వెళ్ళి పడుకో!"

కొలంబా తల అడ్డంగా ఆడించింది. ప్రశాంతంగానే అధికారి వంక చూస్తూ ఉండిపోయింది.

"బారిచినీగారు ఈ విరోధం ఇంతటితో ఆపెయ్యాలని కోరుతున్నారు... అంటే, అదే ఈసందేహాలు మనస్సులో పెట్టుకోరాదని... నావల్ల చేతనయిన దేమయినా ఉంటే సంధి కుదర్చటానికి ప్రయత్నిస్తాను..."

"అయ్యా" అన్నాడు ఆర్నో నిదానంగా. "ఎడ్వకేట్ బారిచినీ మా తండ్రిగారిని హత్య చేశాడని నేనెప్పుడూ అనలేదు కాని ఆయన చేసిన ఒకపనికి మాఇద్దరి మధ్య స్నేహం ఉండటానికి వీలులేదు. బందిపోటు పేరున్న ఉత్తరం మా నాన్నగారు వ్రాసినట్లు నేరం మోపాడు, ఆయన. కొంతవరకు, మా నాన్నగారి మరణానికి ఇదే కారణం కదా!"

ఆ అధికారి కోలుకొనటానికి ఒక క్షణం పట్టింది. "మీ తండ్రిగారి స్వభావం కొంచెం దురుసయినది కాబట్టి ఆయన అన్నా ఫరవాలేదు కాని మీరుకూడా ఇలా ఆరోపించటం సరికాదు... బారిచినీ ఇటువంటి దొంగ ఆరోపణ చెయ్యటానికి అవసరం ఏముంది? ... ఆయన ఇంత

వాడంతవాడని చెప్పను కాని— చట్టం వివరాలు బాగా తెలిసిన వాడు..."

"అయ్యా, ఉత్తరం బారిచినీ రాయించిందని నేనటం లేదు కదా," అన్నాడు ఆర్సో మళ్లీ లేచినుంచుని. "మానాన్నగారు రాయించిందని ఆయన ఆరోపించాడు. మా తండ్రి గారి గౌరవం నా గౌరవమే కదా!"

"ఆయన ఎంత అభిమానం కల మనిషో నాకు తెలీదా?" అన్నాడు అధికారి. "అయితే ఆ ఉత్తరం రాసిన దెవరో... తెలిసిన విషయమే..."

"ఎవరు?" అని కేక వేసింది కొలంబా అతనివైపు అడుగు వేస్తూ.

"ఒక దౌర్భాగ్యుడు, ఎన్నో నేరాలు చేసినవాడు ... సహించరాని, మన్నించరాని నేరాలు చేసినవాడు! ఒకదొంగ, తోమాసోబియాంకీ అనేవాడు! బాస్తియా కారాగారంలో ఉంటున్నాడు! వాడే ఈ ఉత్తరం రాశాడని తేలిపోయింది!"

"ఆ మనిషి ఎవరో నాకు తెలీదు," అన్నాడు ఆర్సో. "ఎవరు వాడు?"

"ఈ ప్రాంతంవాడే" అంది కొలంబా. "ఒక పిండిమరవాడి తమ్ముడు. వట్టి అబద్ధాలకోరు, నమ్మలేనంత చెడ్డవాడు!"

"చూశారుగా వాడి పన్నాగం!" అని చెప్పడం మొదలుపెట్టాడు అధికారి తిరిగీ. "మీ చెల్లెలుగారు చెప్పిన అబద్ధాలకోరున్నాడే, వాడి పేరు థియోడోర్; బారిచినీకి మీ తండ్రిగారికీ నీటి విషయమయి తగాదా వచ్చింది చూశారా, అక్కడ నీరుతోడే మర ఒకటి వేద్దామనుకున్నాడు. కర్నల్ గారి స్వభావం నాకు తెలుసు కదా, వెంటనే ఒప్పుకున్నారు. బారిచినీ గారు అంత తేలికగా, ఏమీ పుచ్చుకోకుండా వప్పుకోడనీ తోమాసోకి తెలుసు. బారిచినీగారికి డబ్బుమీద ఆశ లేకపోలేదు! తన అన్నకోసం బందిపోటు దొంగ సంతకం పెట్టి ఉత్తరం పడేశాడు...తర్వాత జరిగిందంతా మీకు తెలుసు!...ఇదుగో పై అధికారులు రాసిన ఉత్తరం చదివి చూడండి; మీకే అంతా తెలుస్తుంది; నేను చెప్పింది నిజమో, కాదో!"

ఆర్సో ఆ లేఖ తీసుకుని చదివాడు. వివరంగా తోమాసో వ్యవహారం అంతా వ్రాసిఉంది. కొలంబా కూడా తన అన్నగారి భుజం వెనుకనుంచి ఉత్తరం అంతా చదివింది.

పూర్తి అయిన తర్వాత, "మా అన్నయ్య రాకముందు బారిచినీ ఒక నెలరోజుల పాటుగా బాస్తియాలో ఉన్నాడు తోమాసోకి లంచం ఇచ్చి ఈ నేరం వప్పుకునేట్లు చేసి ఉంటాడు!" అని అరిచింది.

"అమ్మాయిగారూ!" అన్నాడు అధికారి చిరాకుగా. "మీరు అన్నీ చెడుగానే చూస్తున్నారు నిజం ఇలా కనుక్కోగలమా? అయ్యా, మీరు అనవసరంగా ఆవేశపడటం లేదు. ఏమంటారు చెప్పండి! అమ్మాయిగారు చెప్పినట్లు వాడు చెయ్యని తప్పు వప్పుకుంటూడుంటారా?"

ఆర్సో శ్రద్ధగా ఉత్తరం అంతా తిరిగి చదివాడు, ఒకమాట విడవకుండా. బారిచినీని చూసిన తర్వాత అతని పాతనమ్మకాలే దృఢం అయినాయి. తనకి నమ్మకం కుదిరిందని చెప్పబోతూ ఉండగా కొలంబా బిగ్గరగా అంది;

"తోమాసోబియాంకీ ఉత్త దొంగ! జయిలులోనుంచి తప్పించుకుంటాడు చూస్తూ ఉండండి!"

అధికారిగారు ఒకసారి భుజాలు ఎత్తి దించేశారు.

"అయ్యా, నాకు తెలిసిందంతా మీకు చెప్పాను. ఇక వెళ్ళిపోతాను. మీరే ఆలోచించి చూసుకోండి! మీ చెల్లెలికన్నా ఎక్కువ నిదానంగా మాత్రం ఆలోచిస్తారని నా ఆశ..."

ఆర్సో కొలంబా తరఫున వచ్చి చెప్పబోయాడు. తోమాసోయే నేరస్థుడని తన నమ్మకం అన్నాడు. గ్రామాధికారి సెలవు తీసుకొనటానికి లేచి నుంచున్నాడు.

"ఇంత ఆలస్యం కాకపోతే నా వెంట వచ్చి మిస్ నెవిల్ ఉత్తరం తీసుకొమ్మని కోరేవాడిని... అలాగే బారిచినీగారితో కూడా మాట్లాడి అన్ని విషయాలూ చక్కబెట్టుకోవచ్చు."

"బారిచినీ ఇంట్లో ఆర్సో దెల్లా రెబ్బియా అడుగుపెట్టటమా!" అని అరిచింది కొలంబా.

"అమ్మాయిగారే ఈ ఇంటి పెద్దగా మారిపోతున్నారే?" అన్నాడు అధికారి హాస్యధోరణిలో.

"అయ్యా మీరు పొరబడుతున్నారు," అంది కొలంబా రాయివంటి స్వరంలో. "ఎడ్వకేట్ సంగతి మీకు తెలీదు. ఇదంతా ఒక పెద్ద కుట్ర ఆర్సోకి అవమానం తెచ్చిపెట్టే పనిమాత్రం చెయ్యమనకండి!"

"కొలంబా!" అన్నాడు ఆర్సో. "నీ ఆవేశం నీ బుద్ధిని పనిచెయ్యనివ్వకుండా చేస్తోంది!"

"ఆర్సో! ఆర్సో! నిన్ను వేడుకుంటున్నాను! నామాట విను! నీకూ బారిచినీకి మధ్య రక్తంచిందిన విరోధం ఉంది; అతని ఇంటికే మాత్రం వెళ్లకు!"

---

'ఏకచక్రే మహాభోగి అన్నారు కదా? ఏమయ్యా? నా ఖర్మ!' ఒక కారు డ్రైవరు జ్యోతిష్కుణ్ని అడిగాడు. 'నీవృత్తిప్పుడు గవర్నరు గారి కారుయొక్క చక్రమే గదా!' అన్నాడు అతను.

రామయ్య (కాకినాడ)

---

"చెల్లాయి!"

"అన్నయ్యా, వెళ్లక! వెళ్లావో ఈఇంట్లో ఒకక్షణం ఉండను. ఇక నువ్వు నన్ను మళ్లీ చూడవు... ఆరోన్, నన్ను కనికరించు!"



అని మోకాళ్లమీద పడింది.

"అమ్మాయిగారు ఇంత పట్టు పట్టడం నాకు విచారం కలిగిస్తోంది," అన్నాడు అధికారి. "ఆమెకి నచ్చ చెప్ప గలుగుతారని మాత్రం ధైర్యం ఉంది లెండి." అని బయటికి వెళ్ళిపోయాడు. ఆరోన్ అతనివెంటనే వెళ్లాడు.

"ఇవాళ రాలేను." అన్నాడు. "రేపు..."

"రేపు పొద్దునే..." అన్నాడు అధికారి.

"అన్నయ్యా," అని కేకవేసింది కొలంబా. "కనీసం రేపు సాయింత్రం వరకూ ఆగు. మళ్లీ నాన్నగారి కాగితాలన్నీ పరీక్షచేసి చూడనీ... ఇది కాదనకు!"

"సరే! రాత్రికే చూడు... రేపంతా ఈబాధ నేను పడలేను... క్షమించండి అధికారిగారూ...నాకూ మనస్సేమీ బాగా లేదు... రేపుఅన్నీ చూసుకుందాము..."

"రాత్రికి అన్నీ కుదుట బడతాయి లెండి," అన్నాడు అధికారి వెళ్ళిపోతూ. "రేపటికి మీ సందేహాలన్నీ తీరిపోతాయని ఆశిస్తాను."

"సవెరియా!" అని పిలిచింది కొలంబా. "లాంతరు తీసుకుని అధికారిగారి వెంట వెళ్ళు. అన్నయ్యకి ఒక ఉత్తరం వచ్చిందిట ఇస్తారు."

సవెరియా లాంతరు తీసుకుని వెళ్ళింది.

"కొలంబా," అన్నాడు ఆరోన్ అధికారి వెళ్ళిన తర్వాత. "నాకు చాలా బాధ కలిగిస్తున్నావు. సాక్ష్యాన్నే నమ్మవా?"

"రేపటివరకూ గడువిచ్చావుగా," అంది ఆమె. "చాలా తక్కువే కాని నేను ఆశ పూర్తిగా వదులుకోలేదు."

అని పైన ఒక గదిలోకి వెళ్ళిపోయింది. ఆ గదిలో కర్నల్ డెల్లా రెబ్బియాగారి 'డెస్క్' తీసి ఏవో కాగితాలు సర్దుతున్న శబ్దం కిందకి వినిపించింది.

(ఇంకావుంది)

"అమ్మా ! మంచినీళ్లే !"

నానిగాడికి కూజాలో నీళ్లు ఒంచి యిచ్చాను. ఏనిమనిషి వస్తే అంట్లు పడేసి గదిలోకి వచ్చాను—

అతిథులు సరదాగా కబుర్లలోకి దించినట్టు న్నారు నానిగాణ్ణి. వాడు నాలాగే పుల్‌స్టాప్ లేకుండా తెగ మాట్లాడేస్తున్నాడు—"మా అమ్మ కథలు చెప్పుతుంది రోజూ. రేపు మా నాన్న బిస్కత్తులు తెచ్చాడు. మా చెల్లికి అన్నలా ఇవ్వను. నేనూ, మా నాన్నా జట్టు. ఎంచక్కా సైకి లెక్కి వెల్తాం." అంటూ.

"చూడండీ ! మీ అబ్బాయి ఎలా కబుర్లు చెబు తున్నాడో. చాలా మంచివాడిలా ఉన్నాడండీ !"

"లేదండీ ! మీరు పొరబడుతున్నారు. మా పిల్ల లిద్దరికీ తోకలు మాత్రమే తక్కువండీ !"

"అదేమిటండీ అలా అంటారు ? మే నమ్మం మనుండీ !"

"నానీ ! నువ్వో కథ చెప్పమ్మా ! మామయ్య గారూ, పిన్నిగారూ అంతా వింటారటూ." అన్నాను వాణ్ణి బుజ్జగిస్తూను.

"ఉహూ !" అంటూ మొరాయించాడు కాస్సేపు.

"వాణ్ణి మూడ్‌లోకి తీసుకురావాలండీ ముందు. కాస్సేపు పొగిడితే ...."

"నానీ ! నువ్వు బాగా కథలు చెప్తావట. చెప్పమ్మా !" అంటూ ఓ రెండు నిముషాలు బతిమలాడితే వేసిన రేడియోలాగా వెంటనే మొదలుపెట్టాడు—" ఆ రాజుకి మూడు కొడుకు లమ్మా !"

"ఏ రాజుకోయ్ ?"

"ప్రారంభంలోనే చూశారా ఎంత సస్పెన్సో" నేను.

"అలాగా ? సరే చెప్పు."

"ఆ రాజుకేమో మూడు కొడుకులు."

"మూడు కాదమ్మా ఏడుగురు."

"అబ్బ మూడేనండీ !" విసుక్కున్నాడు వాడు.

"పోనీ అలాగే ఒప్పుకుందాంలెండి. దేశంలో జనాభా ఎక్కువవుతోంది. బర్తుకంట్రోలు అంటూ ప్రభుత్వం గొడవ చేస్తోంది. రాజుగారికే ఏడుగురు కొడుకులైతే ప్రజ లెందుకు సంతానం తగ్గించు కుంటారు ?"

"అవునండీ ! కాలాన్నిబట్టి సాహిత్యం మారా లిగా మరి. "సరే ! తర్వాత ?"

"ఆ కొడుకులేం చేశారో చెప్పు నానీ."

"వేట కెళ్లారు."

"ఎక్కడికీ ?"

"వేటకండీ—అంటే వేటకి." నేను.

"ఓహో ! తర్వాత ?"

"ఒక్క చేప ఎండలేదు."

"అదేమిటి ? అసలు చేప లెక్కడివీ ?"

"మంచి టెంపో ! చేపలు తెచ్చారనే అను కుందాం."

"అలాగా ! తర్వాత ?"

"నా బంగారు కన్నంలో వేలెందుకు పెట్టావ్ ? అంది చీమ."

"గొప్ప ముగింపు ! బావుంది ! చాలా బావుంది."

"ఆ కథ మీకూ తెలుసు కదండీ ! అందుకే టూకీగా చేసేశాడు." అంటూ నవ్వుకున్నాం కాస్సేపు.

"మరింకో విషయం చెప్పాలండీ."

# నా డైరీలో...

19వ పేజీ తరువాయి

"అడగండీ—అదేమిటలా అనుమానిస్తున్నారు.? నాకు తెలిసినంతవరకూ చెప్తాను."

"మరేంలేదండీ ! రచనాశైలి బొత్తిగా వ్యవహా రికంగాకుండా కాస్త గ్రాంధికంగా, పటిష్టంగా ఉంటే బావుంటుంది కదండీ ?"

"బావుంటుంది—బొత్తిగా చెరుకురసంలా కాకుండా ద్రాక్షరసంలా ఉంటే బావుంటుందని నా ఉద్దేశ్యం. భాష నేర్చుకోటానికి కథలు చదవ నక్కర్లేదండీ. స్కూళ్లున్నాయి. కాలేజీ లున్నాయి. చదివేవారిలో నూటికి నూరుమందీ అర్థం చేసుకో గలిగినప్పుడే రచనకు సార్థకత. "పిల్లి" అని రాస్తే అర్థం చేసుకుంటారు అందరూ. మార్జాల మనో, బిడాలమనో రాస్తే ఎంతమంది కర్థ మవు తుందో చెప్పండి ? అర్థం కానివాళ్ల మాటేమిటి? సాంఘికమైన జీవిత సమస్యలు చర్చించుకొంటూ గ్రాంధిక భాష ఉపయోగించాల్సిన అవసరం ఏమిటి ? వ్యాకరణాలూ, నిఘంటువులూ దగ్గర

ఒకడు:- పదిరూపాయల చిల్ల రుందా ?

సుబ్బారావు:- ఉందిగా కావాలా? పదీ నోటూ?

ఒకడు:- చిల్లర కాదు అప్పు అడుగుదామని.

ఆనందకృష్ణ (విశాఖపట్నం)

పెట్టుకుంటారా పాఠకులు ? సామాన్య పాఠ కుడు అర్థం చేసుకోలేని భాష ఉపయోగించి ఏం చెప్పగలిగినట్టు ? పటిష్ఠమైన భాష ఉండాల్సి నప్పుడు పుస్తకాలు వేరు. అవి విద్యార్థుల కోసం, పండితుల కోసం, చర్చల కోసం మరి మీరేమను కుంటారో గానీ నా ఉద్దేశ్యం మాత్రం ఇదే !"

"అసలు రచన ప్రయోజనా లేమిటంటారు ?"

"ఉత్తమ రచన సంఘ సేవకు ఉపయోగిస్తుం దనుకోవచ్చు. పాఠకుల్ని వెర్రెత్తించి తాత్కాలికంగా మతులు పోగొట్టి ఏమీ ఆలోచించుకోలేని స్థితికి తెచ్చే రచనలు చాలా ప్రమాదకరమైనవి. వాటి వల్ల ఉన్న సమస్యలు పరిష్కారం కావు సరిగదా, లేని గొడవలు పుట్టుకొస్తాయ్."

"ఎన్ని తరాలకైనా మన సాహిత్యం ఇలా నిబంధనల మధ్యే నడవాలంటారా ? సంఘ జీవితంలో మార్పులు ఊహిస్తూ అభ్యుదయ రచనలు చెయ్యకూడదా ?"

"మార్పు అనేది ఎంతో బలమైన పునాదితో బయల్దేరాలి. మనం జీవిస్తున్న విధానాల కంటే కొత్తగా రాయబోతూన్నవి ఎక్కువ సుఖశాంతుల్ని యివ్వగలవనే నమ్మకం ఉండాలి. ఇవ్వాలి కూడాను. అలా కాకుండా ఉన్న బాధల్ని ఇంకా అధికం చేస్తోన్నప్పుడు ఇక మార్పెందుకూ ?—మంచి నీళ్లు మానుకుని పాలు తాగొచ్చు. అంతేగానీ మంచినీళ్లు మానేసి ఉప్పునీళ్లు తాగితే ప్రయో జన మేమిటి ? చూడండీ ! ఈ మన వివాహ వ్యవస్థ అర్థరహితమంటారు కొందరు అభ్యు దయ రచయితలు—వారు చెప్తున్నట్టు పెళ్లిళ్లు మానుకుని అందరూ స్వేచ్ఛగా తిరుగుతూంటే ఎన్ని సమస్యలు వచ్చి నిలుస్తాయో ఆలోచించారా ? బాధ్యతల మాటేమిటి ? బిడ్డల మాటేమిటి ? మాట్లాడితే ప్రభుత్వ గృహాలూ, ప్రభుత్వ నిల యాలూ ! అవన్నీ కప్పల తక్కెడలా కారాగారాల్లా తయారవుతాయి. నాలుగు గోడల మధ్య కూర్చుని మొగుడూ, పెళ్లాం అంటూ కొన్ని నియమాలకు లోబడి బ్రతుకుతూన్నప్పటి శాంతి సౌఖ్యాలు ఆ మార్పులో ఉండే అవకాశాలేం లేవు—ఆచరణ యోగ్యంగాని రచనలు ఎందుకు సృష్టించా లంటాలను ?"

"మార్పులంటూ జరిగే స్థితిలో కొందరు పరిస్థితులకు బలైపోవాల్సి ఉంటుందంటారు కదండీ ! కొంతకాలానికి అభ్యుదయ భావనలే ఆచరణయోగ్యం కావచ్చు."

"సరే ! ఆ బలైపోవాల్సిన కొందరిలోనూ మీరు ఉండాలంటే ఒప్పుకుంటారా ? నేను ఉండా లంటే ఒప్పుకుంటానా ? అటువంటి మహత్తర త్యాగం కేవలం నమ్మకం కోసం, న్యాయం కోసం జరుగుతుంది కానీ అర్థరహితమైన ఆవేశాల కోసం కాదు."

"సరే ! ఇక ఆ విషయాలు వదిలేద్దాం. ఆఖరి మాట— ఓ రచయిత తాలూకు రచనకూ, వ్యక్తి గత జీవితాలకూ దగ్గర సంబంధం ఉంటుం దంటారు. నిజమే నంటారా ?"

"కావచ్చు, ఉండనూ వచ్చు. ఉండకపోనూ వచ్చు. రెండిటికీ సావకాశం ఉంది."

"డొంకతిరుగుడుగా మాట్లాడుతున్నారండీ మీరు."

"అబ్బే ! లేదండీ ! రచయిత వ్యక్తిత్వం కొన్ని పాత్రలలో ప్రతిబింబించటం జరగచ్చు. అంత మాత్రాన ఏదో పాత్రని తీసుకొచ్చి రచయితకి అంటగట్టటం మాత్రం అన్యాయం."

"మీకు మీవారి కోఆపరేషను ఏవిధంగా ఉంటుందండీ ?"

"అసలు మావారి సహకారం ఉంటుందని నే నన్నానాండీ ?"

నవ్వుకున్నాం—"మీరు చాలా బద్ధకస్తులనీ .... మీవారి ప్రోత్సాహమే లేకపోతే రాయనే లేరనీ ...."

"నయం. వారి ప్రోత్సాహం లేకుండా నేను గాలి పీల్చలేనన్నారు కాదు. మీకు మావారి నేస్తాలె వరో చెప్పివుంటారండి అదంతా."

"మీవారి స్నేహితులా, మీకు శత్రువులు కాదు కదండీ !"

"అసలు మావారే నాకు పెద్ద శత్రువండీ ! నా మొహం ! నేనేం మనిషి నన్నట్టు చూస్తుం టారు."

"ఒకటి చెప్పండి— మీరేదైనా రాసుకుంటూ కూర్చుంటే ఆపూట ఆయనేమైనా సాయం చేస్తారా ?"

"ఓ తప్పేడు బియ్యం వార్చి పిల్లల్ని ఆడించ గలరులెండి. కాని అలాంటిపూట ఎప్పుడొచ్చిందీ అంటాను."

సావుగంట చాలా సరదాగా గడిచిందనిపించింది.

# నా డైరీలో...

"మా చెల్లాయి ఈమధ్యేదో కథ రాసిందండి!" అన్నారాయన చెల్లెలికేసి చూస్తూ.

"ఆహా! అలాగా? ఎప్పుడూ? ఏ పత్రికలోనూ? మళ్ళా ఏమైనా రాస్తున్నారా?" అన్నాను కుతూహలంగా.

"అమ్మో! అది రాసినందుకే కుళ్లి కుళ్లి ఏడుస్తున్నానండీ—మళ్లానా?"

"అదేం?" అన్నాను ఆశ్చర్యంగా చూస్తూ.

"ఆ కథలో, ముగింపులో కథానాయకి తన వ్యక్తిత్వం నిలుపుకోవటంకోసం నాయకుణ్ణి తిరస్కరిస్తుందండీ! అలా రాయటం పెద్ద పొరపాటైంది. వాళ్ల లెక్చరరొకాయన దీన్ని వేరేగా పిల్చి సన్న సన్నగా చివాట్లెట్టి ...."

"ఎందుకూ? ఏమనీ?" అర్థంకాక అడిగాను నేను.

"ఇప్పట్నుంచి నీ ఊహ వింత పెడసరంగా తిరగటం ఏమిటి? అలా పురుషుణ్ణి కించపరుస్తూ కథ రాయటంలో నీ ఉద్దేశ్యం ఏమిటి? చిన్నపిల్లవి అలా పిచ్చి పిచ్చి వేషాలెయ్యకు. అయినా శ్రద్ధగా చదువుకోవాల్సిన వయస్సులో నీకీ కథలూ, నాటకాలూ ఎందుకూ అంటూ ఓగంట తల వాచేలా ...."

"ఎంత చిత్రంగా ఉందండీ? మరి మీరేం ఘాటుగా జవాబివ్వలా?"

"అమ్మో! నోరే విప్పలేకపోతే జవాబు కూడానా? అందులోనూ ఘాటుగానా? మా లైఫంతా వాళ్ళ చేతుల్లోనే ఉంటోంది కదండీ!"

"నిజమే! ఆవేశపడి ప్రయోజన మేముంది లెండి. కుక్కకాటుకి చెప్పుదెబ్బలా మరేదో ఎత్తు ఎత్తాలి. ఈసారి పెన్ నేమ్‌తో ఆయనమీదో కథ రాయండి" అన్నాను నవ్వుతూ.

"మరి వస్తామండీ! చాలాసేపు కూర్చుని మిమ్మల్ని శ్రమపెట్టాం.

"ఎంతమాట! మీ ఫేమిలీతో గడిపిన ఈ పావుగంటా చాలా సంతోషంగా ఉందండీ!"— లోపలికి వెళ్లాను — రెండు నిమ్మకాయలు కోసి కాస్త పంచదార వేసి షర్బత్ చేసి ....(నేను చేస్తే షర్బత్ బాగ వుందంటారు మావారు) అతిథులకు యిచ్చాను.

"ఎందుకండీ మీ కింత శ్రమ? మీరు తీరిగ్గా కూర్చుని మాట్లాడారు. అదే మాకు తృప్తిగా ఉంది." అంటూ నా శ్రమకి వారంతా నొచ్చుకున్నారు. నా ఓపికను ప్రశంసించారు కూడా.

"ప్లీజ్! మీ ఆటో .... కావాలండీ!" అంది పుస్తకం అందిస్తూ కథ రాసి బాధపడుతూన్న అమ్మాయి.

"అబ్బే! నా ఆటో ఏమిటండీ?" అన్నాను అయిష్టంగా.

"జస్. మీ రైటింగ్ చూసినప్పుడు ఈసమయం గుర్తొస్తుంది కదండీ!"

ఏదో బుద్ధి పుట్టినట్టు రాసి పుస్తకం తిరిగి యిచ్చాను. పరస్పరం వీడ్కోలు చెప్పుకొని తలుపులు వేసుకుంటూంటే — "అమ్మా! నేను ఆడుకుంటానే!" అన్నాడు నానిగాడు — టైం చూశాను. మూడున్నరా!

"సరేలే! వెళ్ళు!" అంటూ అంటూ వాణ్ణి పక్కింటివారి పిల్లల దగ్గరికి సాగనంపి కాస్త బద్ధకంగా ఉంటే పాప పక్కలో పడుకున్నాను. ఏదో పుస్తకం తిరగవేస్తూ — పుస్తకం వెళ్లి నేల మీద పడింది. నేను కాస్త నిద్రలోకి జారిపోయాను. త్రుళ్లిపడి లేచి టైం చూస్తే నాలుగూ పది! "అమ్మో! ఏందారి?" కంగారు కంగారుగా లేచాను. ఆవురావురుమంటూ వచ్చే ఆ పెద్దమనిషి కేదో చిరుతిండి (టిఫెన్) చెయ్యకపోతే ఓ దారుణమైన, సుదీర్ఘమైన, ఉపన్యాసం వినాల్సి వస్తుంది కిమ్మనకుండా. పచ్చిమిరప ముక్కలూ, పోపు సామానూ, గోధుమరవ్వా తయారుచేసి స్టౌ అంటించబోయాను. నీతో మాట్లాడ నన్నట్టు మొరాయించింది — కోపం ముంచుకొచ్చింది. ఓ డజను అగ్గిపుల్లలూ, ఓ అర్ధశేరు కిరసనాయిలూ తగలేసి — ఆ ప్రయత్నం విరమించుకుని విటూర్చాను. "స్టౌ బాగుచేయించండీ! బొత్తిగా తిప్పలు పెడుతోంది" అని గొగోలపెట్టనిరోజు లేదు. కాని ......

(సశేషం)

---

# స్టంటు సినిమాకథ

18 వ పేజీ తరువాయి

"నాటకాల్లో కూడా ఇలాగే యాక్టు చేస్తాడు కాబోలు" అన్నాడు గోపాలం—"ఆయన సంగతి కేంలేగాని— గురూ! మనం చిన్న రిహార్సల్ వెయాలి" అన్నాడు శంకర్రావు.

"సరే—అయితే అంతా భోజనాలు చేసొద్దాం. ఈలోగా ఏదైనా మంచి ఐడియా తడుతుందేమో చూస్తే—అప్పు డంతా కలిసి కాలవగట్టుకి పోదాం" అన్నాడు ప్రకాశం.

"సరే—నా కాకలిగా ఉంది కూడా" అన్నాడు సుందరం.

కమేడియన్ తిండి విషయా లెక్కువగా మాట్లాడాలని సుందరం అభిప్రాయం. అనేక తెలుగు సినిమాలు చూసిన అనంతరం అతనికి కలిగిన అభిప్రాయం ఇది.

*　　*　　*

మిట్ట మధ్యాహ్నం పన్నెండు గంటలకి అంతా కాలవ గట్టుమీద సమావేశ మయ్యారు. తన కొచ్చిన ఐడియాని ప్రకాశం ఇలా చెప్పడం మొదలెట్టాడు. "మనం యాక్టు చెయ్య బోయేది స్టంట్ ఫిల్ములో కాబట్టి వినండి. శంకర్రావు దొంగల నాయకుడు. ప్రస్తుతానికి లేకపోయినా కొంతమంది అనుచరులుంటారన్నమాట. హీరోయిన్ ఇక్కడ విహారాని కొస్తుంది. పాట కూడా ఉంది. దూరానఉన్న ప్రియుణ్ణి పిలుస్తున్నట్టు పాడుతుంది....."

"సరే—బీస్ సాల్ బాద్‌లోది కాపీ కొడతా" నన్నాడు గోపాలం.

"ఉండు. నన్ను పూర్తిగా చెప్పనీ—పాటలో మ్యూజిక్ జరుగుతూంటే దొంగల నాయకుడు అనుచరులతో గుర్రంమీద రావడం చూపించడం నప్పెస్పన్నమాట. ఈ సన్నివేశమంతా అడివిలో జరుగుతుంది."

"ఒక్క సందేహం—ఇంతకీ హీరోయిన్ అడివిలోకి విహారాని కెందు కొచ్చింది—" అన్నాడు సుందరం.

"స్టంట్ పిక్చర్లో హీరోయిన్లడివిలోకే వెళ్తారు. లేకపోతే కథే లేదు. ఇలాంటి ప్రశ్నల్నే చచ్చు ప్రశ్న లంటారు. అసలు స్టంట్ పిక్చర్లని చూసి ఆనందించడమేగాని— సంభవమేనా—అసంభవమా అని ఆలోచించకూడదు. అందుకే స్టంటు పిక్చర్ల కాన్వాసుకి డైరెక్టరు పేరు రాయరు. అంతే కాదు. చూసి ఆనందించండని కూడా రాస్తారు" తనకు తెలిసిన విధంగా స్టంటు పిక్చరంటే ఏంటో చెప్పి మళ్ళీ మొదలెట్టాడు ప్రకాశం.

"పాట పూర్తవగానే దొంగల నాయకు డొచ్చి— హీరోయిన్నీ—చెలికత్తెల్నీ దోచుకుందుకు ప్రయత్నిస్తాడు దూరానఉన్న కమేడియనిది చూసి భయపడిపోయి హీరో దగ్గరికి పరుగెడ్తాడు. పాట ఎక్కణ్ణుంచి వస్తోందా అని హీరో వెదుకుతూంటాడు. అతను కమేడియన్ దగ్గర్నుంచి విషయం విని దొంగల నాయకుడి దగ్గరకు పరుగెడ్తాడు. ముందు అనుచరులంతా చస్తారు. కొంతమందిని కమేడియన్ కూడా విట్టీగా చంపుతాడు. ఇది చూసి దొంగల నాయకుడు చెట్టెక్కేస్తాడు. హీరో కూడా చెట్టెక్కుతాడు. ఇద్దరికీ చెట్లమీద స్టంటు. ఇదో స్పెషల్ ఎట్రాక్షన్. ఫస్ట్ టైమ్ కనుక దొంగల నాయకు డెలాగో తప్పించుకుని పారిపోతాడు. హీరోయిన్ హీరోని ప్రేమిస్తుంది. ఇదీ సన్నివేశం" అన్నాడు ప్రకాశం. "చాలా బాగుందిరా!" అన్నాడు విశ్వనాథం.

"మరి హీరోయిన్!" అన్నాడు శంకర్రావు.

"అందాకా నేను—" అన్నాడు ప్రకాశం.

"నువ్వయితే—మాలో భావాలు కలగొద్దూ" అన్నాడు శంకర్రావు. "కలగనప్పుడు నువ్వు నటుడివే కావు" అన్నాడు ప్రకాశం చిన్నగా చిన్నబుచ్చుకొని. "సరే రిహార్సలెక్కడ!" అన్నాడు సుందరం.

"ఇక్కడైతే బాగుండదు. తోటలోకే పోతే బాగుంటుంది."

అంతా తోటలోకి పోయారు. తను ఎప్పుడో రాసిన పాటని తీశాడు ప్రకాశం—గోపాలానికిచ్చాడు. "రెడీ—స్టార్ట్!" అన్నాడు ప్రకాశం. ప్రకాశం ముందుగా "చెలులారా—ఎంత బాగుందీ వన విహారం" అన్నాడు గోపాలం. "పాట పాడబోతున్నా నోరు కదుపుతూండు" అన్నాడు.

ప్రకాశం నోరు కదప సాగాడు. "ప్రియ వేగ కనరావా—నిను చూడ మనసాయె—" బీస్‌సాల్ బాద్ పాట వరసలో పాడుతూ, మధ్య మధ్యన నోటి మద్దెలా, ఈలలతో మ్యూజిక్ ఇస్తూ, అద్భుతంగా పాడుతున్నాడు గోపాలం. శంకర్రావో సైకిలు తీసుకుని గుర్రంమీద స్వారి చేస్తున్నట్లుగా తొక్కుతూ, మనిషి కొంచం కుదుపు నటిస్తూ వచ్చేశాడు. "రక్షించండి—రక్షించండి" అంటూ ప్రకాశం అరిచాడు. "ఇంకా పాట పూర్తవలేదురా" అన్నాడు గోపాలం. ప్రకాశం కేకెట్టే సరికే విశ్వనాథం పరుగెత్తుకుంటూ వచ్చాడు

"నేను చెప్పకుండా వెళ్ళకూడదు" అంటూ సుందరం వెనకాల పరుగెత్తాడు. అన్నీ కన్ను మూసి కన్ను తెరిచేటంతలో ఒకనాసారిగా జరిగిపోయాయి.

"రక్షించండి—" అన్న కేకలు విని తోట కాపలావాడు పరుగెత్తుకుంటూ వచ్చాడు. అత వొచ్చేసరికి శంకర్రావూ, విశ్వనాథమూ కొట్టుకుంటున్నారు.

"ఏం జరిగింది బాబయ్యా—ఏమిటిది" అన్నాడు వాడాశ్చర్యపోయి.

రిహార్సల్‌కి ఫుల్‌స్టాప్ పడింది. దెబ్బలాడుకోడం మానేసి శంకర్రావూ, విశ్వనాథము నవ్వసాగారు. పాపం వాడికేంకిదేం అర్థం కాలేదు. "ఈ చదువుకున్నోళ్ళతో ఇంతేనండి. ఎందుకు కొట్టుకుంటారో తెలీదు. ఎందుకు నవ్వుతారో తెలీదు."

"మేమేం కొట్టుకోవడం లేదురా—ఇదంతా నాటకం" అన్నాడు విశ్వనాథం.

"నాటకమా—అయితే నేనూ చూస్తాను. నాకు నాటకాలంటే ఎంతో ఇష్టం బాబూ!"

"నువ్వు చూస్తే మాకు సిగ్గేస్తుందిరా—నువ్వు చూడకూడదు" అన్నాడు విశ్వనాథం. "ఛా—స్టేజ్ ఫియరుంటే యాక్షన్‌కి పనికి రారు" అన్నాడడు ప్రకాశం.

విశ్వనాథానికి పౌరుషం వచ్చింది—"సరే—మళ్ళీ ప్రారంభిద్దాం" తోటమాలి సమక్షంలో మళ్ళీ రిహార్సల్సు ప్రారంభమయాయి.

*  *  *

ఇంటికి రాగానే అరుగుమీద నవ్వుతూ నించున్నాడు గోపాలం తమ్ముడు రాజారావు. "అరే ఎప్పు డొచ్చావ్‌రోయ్!"

"మధ్యాహ్నం వచ్చా నన్నయ్యా—నువ్వెక్కడికో వెళ్ళేవని చెప్పిందమ్మ. ఏంటి గిరాకీ"—గోపాలం తమ్ముడు పట్నంలో పరీక్షలు వ్రాసి మధ్యాహ్నమే వచ్చాడు.

"నువ్వు నమ్ముతానంటే చెప్తాను. మన బ్రహ్మం సినిమా తీస్తున్నాడు. తెలుసా?"

"ఏమిటీ—బ్రహ్మం సినిమా తీస్తున్నాడా? వచ్చేటప్పుడు నాతో మాట మాత్రంగానైనా అనలేదే?" ఆశ్చర్యంగా అన్నాడు రాజారావు.

"బ్రహ్మం నీక్కనిపించాడా? ఎప్పుడు కనిపించాడు. ఎలా కన్పించాడు. ఎలా ఉన్నాడు. లాటరీలో రెండు లక్షలు కొట్టాట్టగా!"

"నిన్న సాయంత్రం ట్రయినెక్కుతూంటే కన్పించాడు. లాటరీలో రెండు లక్ష లొచ్చాయని చెప్పాడు. ఒకటో తేదీన మనూ రొచ్చేస్తున్నానని కూడా చెప్పాడు. మరి—సినిమా సంగతేమీ నాతో చెప్పలేదే?"

"వూరికే అన్నాన్లే—రెండు లక్ష లొచ్చాయంటే సినిమా తీస్తాడేమో నన్పించింది. బ్రహ్మం వచ్చేదాకా అసలు విషయ మెవరికీ చెప్పడం మంచిది కాదనే ఉద్దేశంతో గోపాలం తమ్ముడి దగ్గర కూడా నిజాన్ని మరుగు పర్చాడు.

"కొయ్యరా అన్నయ్యా కొయ్—బ్రహ్మం నీకు రాసిన ఉత్తరాన్ని నే చూడలేదనుకున్నావేంటి—నీ రూంలో చూశా"

"అన్నీ తెలిసే అడుగుతున్నా వన్నమాట. ఐతే చెప్తున్నా విను. బ్రహ్మం నాకేకాదు. శంకర్రావుకీ, విశ్వనాథానికీ, సుందరానికీ, ప్రకాశానికీ కూడా రాశాడు. ఐతే నీకీ విషయ మెందుకు చెప్పలేదా అని ఆలోచిస్తున్నాను."

"మర్చిపోయాడేమో—కానీ మర్చి పోవడాని కవకాశా లేమున్నాయ్—లాటరీలో రెండు లక్ష లొచ్చాయని చెప్పినపుడు వాటినేం చేయదల్చుకున్నాడో చెప్పడం గుర్తుండదూ? ఒకవేళ సరదాగా గాని రాయలేదుగదా!" చివరి వాక్యాన్ని మెల్లిగా అన్నాడు రాజారావు.

"ఛా— వా డలాంటివాడు మాత్రం కాదని నిశ్చయంగా చెప్పగలను."

రాజారా వెందుకో నవ్వాడు. "నువ్వు మ్యూజిక్ డైరెక్టరు వవుతున్నావనే ఆనంద మన్నయ్యా" అన్నాడు విశదీకరిస్తూ.

"తెలిస్తే తెలిసిందికానీ — నువ్వీ విషయ మింట్లో ఎవరికీ చెప్పకేం—" అనాడు గోపాలం— "చెప్తే నాకూ ప్రమాదమేగా!" అన్నాడు తమ్ముడు.

"నీకేం ప్రమాదం......" అనుమానంగా అడిగాడు గోపాలం.

షాపులో ఇద్దరు భాగస్వాములూ కూర్చుని ఉన్నారు. ఇంతలో పక్కవీధి షాపు కాగుగా రొచ్చి "ఎలావుంది వ్యాపారం?" అని అడిగాడు.

"ఏదో ఫరవాలేదులెండి!" అన్నాడు భాగస్వామి ఒకటి. పక్కవిధాయన వెళ్ళిపోయిన తర్వాత భాగస్వామి రెండు కోపంగా అడిగాడు; "నన్ను మోసం చేస్తున్నావన్నమాట! ఫరవాలేక పోవటం ఎప్పటి నుంచి?"

కె. వి. ఎస్. (చీరాల)

"నీకు ప్రమాదమ్మైతే — నాకు మాత్రం ప్రమాదం కదూ? మన మిద్దరం అన్నా తమ్ముళ్ళం కదురా" గోపాలానికి తెలిసిన ఓ నగ్నసత్యాన్ని తెలిపి మళ్ళీ నవ్వాడు రాజారావు.

ఆ నవ్వులో ఏదో వ్యంగ్యం కన్పించింది. గోపాలానికి.

రాజారావు లోపల కెళ్ళిపోయాడు.

అనుమానంగా జేబులో చెయ్యెట్టాడు. లెటరు తన జేబులోనే ఉంది. మరి—నా రూంలో లెటర్ చదివే నన్నాడు వాడు. ఉత్తరం చదవడానికి వాడి కవకాశంలేదు. ఉత్తరం చదవకుండా అందులో విశేషాలు వాడి కెలా తెలుస్తాయి?

ఉత్తరంలో విశేషా లెప్పుడూ ముగ్గురికే తెలుస్తాయ్. ఒకటి రాసిన వాడికి. రెండు చదివిన వాడికి. మూడు చదివినవాడు చెప్పగా విన్నవాడికి.

చివరి రెండింటికీ పాజిబులిటీ లేదు. అంచేత....

"తమ్ముడూ—" గట్టిగా పిల్చాడు గోపాలం.

రాజారావు పరుగెత్తుంటూ వచ్చాడు. "ఏంటన్నయ్యా—అంతే గట్టిగా పిల్చావ్!"

"అంతా తెలిసి పోయిందిలే—నాతో వేళాకోళ మాడ్తావ్రా ఈ ఉత్తరం రాసింది నువ్వే కదూ— నిజం చెప్పు—" రాజారావు నిశ్చేష్టుడై నిల్చుండిపోయాడు.

"చెప్పరా — నిజం చెప్పు" గోపాలం గద్దించాడు.

రాజారావు తేరుకున్నాడు. "ఏంటన్నయ్యా—అలారుస్తావ్ — అలా ఉత్తరం రాయవలసిన అవసరం నాకేముంది?"

"లేపోతే ఇందులో విశేషాలు నీ కెలా తెలిసాయంటాను."

"నీ రూంలో లెటర్ చదివానని చెప్పేగా!"

గోపాలం నవ్వి — "నా రూంలో లెటరెక్కడిదోయ్ వెర్రి నాగన్నా— అది నా జేబులో ఉంది. అబద్ధమాడినా అందంగా ఆడాలోయ్. సరేకానీ— నిజం చెప్పు......నా రూంలో లెటర్ చదివానని చెప్పావే— అది అబద్ధం కదూ"

రాజారా వద్దంగా తలూపాడు.

"ఐతే ఈ ఉత్తరంలో విషయం నీకెలా తెలిసింది" గోపాలం కంఠంలో మళ్ళీ కోపం ధ్వనించింది.

"అబద్ధ మెందుకులేగానీ— నాకు బ్రహ్మం చెప్పాడు."

"ఏమిటీ— బ్రహ్మం చెప్పాడా? మరిందాకా ఎందుకు చెప్పలేదూ?"

"సస్పెన్సుకోసం—"

"అన్నయ్యా— అమ్మ భోజనానికి పిలుస్తోంది" చెల్లెలు పిల్చింది.

గోపాలంలో ఉన్న అనుమానాలన్నీ తమ్ముడి జవాబుతో క్షాళనమయి పోయాయ్. సినిమా విషయం నిజమే. అబద్ధమేం కాదు. మాటాడకుండా దొడ్లో కెళ్ళి అనుమానాలతోపాటు, కాళ్ళని కూడా కడిగేసుకుని భోజనానికి నడిచాడు.

గోపాలం భోంచేసి వచ్చేసరికి శంకర్రా వొచ్చి రూంలో ఎదురు చూస్తున్నాడు. "విశ్వనాథం దొడ్లో రిహార్సల్సు వేసుకుందాం రమ్మన్నాడ్రా—"

"సరే పద" చెప్పులు తొడుక్కుని శంకర్రావు ననుసరించాడు గోపాలం.

*  *  *

క్యాలెండర్లో ఏడు కాగితాలు చిరిగిపోయాయ్. ఎక్కడో దూరాన విన్పిస్తున్న మురళీనాదం నేపథ్య గానంకాగా ఒకటో తేదీనాడు సూర్యుడుదయించాడు. సూర్యుడికంటే ముందుగానే గోపాలం మిత్రబృందమంతా లేచారు.

ఎనిమిదయ్యేసరికి మిత్రబృందమంతా కాలవగట్టుమీద సమావేశ మయారు. "పదకొండున్నరకి బ్రహ్మం వస్తాడ్రా" అన్నాడు ప్రకాశం.

"వాడు రాసిన ఉత్తరంలోని నిజా నిజాలు ముఖాముఖీ తేల్చేసుకోవచ్చు" అన్నాడు శంకర్రావు.

"ఇంకా నిజా నిజాల విషయం ఆలోచిస్తున్నావా? మా తమ్ముడితో కూడా చెప్పాట్టగా. అంతకుముందు నేను అనుమానించాను గానీ— "

"ఏదేమైనప్పటికీ ఇంక వాదనలనవసరం. వాడు మనమీద నమ్మకముంచి సినిమా తీయదల్చుకున్నాడు. కాబట్టి చిత్రం మనవల్ల ఫెయిల్ కాకుండా ఉండాలి. ఇప్పుడు మనం మన టాలెంట్స్ (Talents) తో వాణ్ణి సంతృప్తి పర్చాలి" అన్నాడు ప్రకాశం.

తర్వాత వాదనలేం జరగలేదు. అంతా ఇళ్ళకు పోయి భోజనాల్చేసి కలిసి స్టేషను కెళ్ళాలని

నిర్ణయించుకున్నారు. అంతటితో అంతా విడి పోయారు.

మిత్రులంతా భోజనాల్చేసి పావు తక్కువ పదకొండింటికి స్టేషన్‌కి బయల్దేరారు. అంతా డ్రస్సుల విషయంలో చాలా శ్రద్ధ తీసుకున్నారు. విశ్వనాథం తెల్లఫాంటుమీద తెల్ల షర్ట్ టక్ చేశాడు. నున్నగా షేవ్ చేసుకున్న గడ్డం కూడా తళతళ లాడ్తోంది. చేతికి వాచీ—నల్లద్దాల రిమ్

## స్టంటు సినిమాకథ

లెస్ కళ్ళ జోడూ, కాళ్ళకి మంచి బూట్సూ. డ్రస్‌లోనూ, నడకలోనూ మహీపాల్‌ని అనుకరించాడు. (ఒకే ఒక తేడా — మహీపాల్‌కి మీస ముండదు) విశ్వనాథం చివరికి రాజనాలలా తయారయ్యాడు.

గోపాలం పంచెకట్టి లాల్చీ వేశాడు. కాన్పూర్



ఆకు చెప్పుల జోడేసుకున్నాడు. ప్రకాశం లాల్చీ, పైజామా వేశాడు.

సుందరం ఫ్యాంటూ, బుష్‌షర్టూ వేశాడు. నడకలో రేలంగిని ఇమిటేట్ చేస్తూ — వెకిలిగా నవ్వుతూ బయల్దేరాడు.

ఇలా బయల్దేరిన మిత్ర పంచకం స్టేషన్‌కెళ్ళేసరికి పదకొండైంది.

రైల్వే స్టేషన్‌ను వీళ్ళకంటె చాలా హడావుడిగా ఉంది. అప్పుడే ఏదో బండి వచ్చి ఆగిందేమో—పోర్టర్ల, కేకలు, అమ్ముకునే వాళ్ళ కేకలూ, ఇంజన్ చప్పుడూ ట్రాలీ బళ్ళ చప్పుళ్ళూ— గుసగుసల రొదలూ—

"అబ్బ— మన కాఫీ హొటలే రైటురా ఈ స్టేషన్‌కంటే" అన్నాడు సుందరం. అది విట్టని గ్రహించక ఎవరూ నవ్వలేదు. అంచేత సుందరం అది విట్టు కాదులే అన్నట్టు గంభీరంగా ఫోజు పెట్టాడు.

"టిప్‌టాప్‌గా వచ్చాను గదా—ఈ అరగంటలోగా ఈ బండ్లో అమ్మాయి లెవరేనా ఉంటే చూసొచ్చేయాల''నుకున్నాడు విశ్వనాథం. విశ్వనాథంలో ఈ భావం తట్టీ తట్టడంతోనే ఎక్కణ్ణించో కిలకిల నవ్వులు విన్పించాయి. దాంతో ఒక్క విశ్వనాథమేకాదు. అందరి దృష్టి అటుకేసి తిరిగింది.

అది లేడీస్ కంపార్ట్‌మెంట్. సుమారు డజను మంది అమ్మాయి లున్నారు. ఏమేమిటో కబుర్లు చెప్పుకుంటున్నారు. "రెండు కొప్పులు కలిస్తే చాలన్నారు. అలాంటిది డజను జడలు. స్టేషన్ మార్మోగుతోంది." కొప్పులూ, జడలూ అన్న పదాల్ని స్త్రీలకి పర్యాయ పదంగా వాడాడు సుందరం.

మిత్ర బృందమంతా గట్టిగా నవ్వారు. ఆ అమ్మాయిలకంటె గట్టిగా.....వీళ్ళ నవ్వుకు కంగారు పడిందో ఏమో ట్రైన్ కదిలింది. విశ్వనాథం లేడీస్ కంపార్టుమెంటుకి టా టా చెప్పాడు. ట్రైన్ వెళ్ళిపోయింది.

"బ్రహ్మంగాడి బండి కరెక్ట్ టైమేనోయ్" శాంకర్రా వానందంగా చెప్పాడు. "రైల్వే వాళ్ళ దృష్టిలో పావుగంట లేటైనా కరెక్ట్ కిందే లెక్క" ప్రకాశం కామెంట్ చేశాడు. శంకర్రావు చప్పబడి పోయాడు. బండి ఐదు నిముషాలు లేటుగా వచ్చింది.

ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటోంచి బ్రహ్మం గుమ్మం దగ్గర నిల్చుని—సుందరానికి కన్పించాడు. "అడుగో బ్రహ్మం!" అన్నాడు సుందరం. మిత్రబృందం అటు పరుగెత్తింది. "గుడ్‌మార్నింగ్ బ్రహ్మం!" ఐదు కంఠాలొక్కసారిగా మార్మోగాయి.

బ్రహ్మం ఆశ్చర్యంగా అందరివంకా చూశాడు. "అరే నా ప్లానంతా తల క్రిందులై పోయిందే— మీ అందరికీ నే వస్తున్నట్లెలా తెలుసు—" మిత్రులంతా ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. చేతిసంచి తీసుకుని బ్రహ్మం కంపార్టుమెంట్ దిగాడు.

"నువ్వేకదురా—ఈవేళే బయల్దేరి వస్తున్నానని లెటర్ రాశావ్!" అన్నాడు గోపాలం. "నేను లెటర్ రాశానా! మిమ్మల్నందర్నీ హఠాత్తుగా వచ్చి ఆశ్చర్య పర్చాలని నే ప్లానేసుకుంటే లెటర్ రాశానంటారారేమిట్రా!"

"అయితే....." శంకర్రా వేదో అడుగబోయాడు. అవమానమో ఏదో ఆవహించి అతను మిగతా మాటలు మాటాడలేకపోయాడు.

"ఐతే నువ్వు సినిమా తియ్యడం అబద్ధమన్న మాట" అన్నాడు విశ్వనాథం. "ఏమిటీ!" బ్రహ్మం గుడ్లెళ్ళ బెట్టాడు.

"నీకు లాటరీలో రెండు లక్షలు రావడం కూడా అబద్ధమేనా—" గోపాలం రెట్టించాడు. బ్రహ్మం నిశ్చేష్టుడై — అలా నుంచుండి పోయాడు. "అదేమిట్రా అలా కొయ్యబారి పోయావ్—" భుజంమీద గట్టిగా తట్టాడు ప్రకాశం.

"ఏమిట్రా—మీరనేవన్నీ నాకేం అర్థం కావడం లేదు" బ్రహ్మం ఈ లోకంలోకి వచ్చాడు. సుందరం ఫాంటు జేబులోకి చెయ్యిననపోనిచ్చి ఓ ఉత్తరం తీసి బ్రహ్మం చేతి కిచ్చాడు. నీలి రంగు కాగితం......ఎర్ర సిరా అక్షరాలు. బ్రహ్మం ఉత్తరాన్నంతా ఆమూలాగ్రంగా చదివి "ఏమిటీ నే సినిమా తీస్తున్నానా—అందులోనువ్వు కమేడియన్వా?" అన్నాడు.

"అంతేకాదు. గోపాలం మ్యూజిక్ డైరెక్టర్, ప్రకాశం మాటలూ — పాటలూ, శంకర్రావు విలనూ, విశ్వనాథమేమో హీరో — ఇలాంటివి మొత్తం మాకైదుత్తరా లొచ్చాయ్."

"ఎవరో మనల్ని ఫూల్సుని చేశారు" అన్నాడు బ్రహ్మం.

సుందరాని కేదో జ్ఞాప్తి కొచ్చింది—"ఈవేళ ఏప్రిల్ ఫస్టు" అన్నాడు నసుగుతూ.

అది మాట కాదు. పిడుగు.

అంతా నిశ్శబ్దంగా స్టేషన్లోంచి బైట కొచ్చారు. మవునంగా నడుస్తున్నారు మిత్రులంతా. అందరి ముఖాలూ మాడిపోయాయ్.

"ఏప్రిల్ ఫూల్—గో టు స్కూల్" సిరా బుడ్డి పట్టుకుని స్కూలు పిల్లలు తిరుగుతున్నారు. "ఇంతకీ మనల్ని ఫూల్ చేసిన వాడికి రెండు విషయాలు తెలుసు. నా కాస్తి కలిసిందనీ, నేనీ వూరొకటో తారీఖున వస్తున్నాననీ......"

"ఆ రెండూ తెలిసినవా డెవరై ఉంటాడు....?

"ఇంకెవరు?" ప్రకాశం గర్జించాడు. "వాడే.... వాడు......"

* * *

రాజారావింటి దగ్గర చాలా కులాసాగా ఉన్నాడు. గోపాలం రమ్మన్నప్పటికీ స్టేషన్కి రాలేదు. అన్నయ్య ఇంటికి రాగానే ఎలా ఉంటాడో అని ఆలోచిస్తున్నాడు. ఒకవేళ కోప్పడతాడేమో? ఐనా తనే వాళ్ళని......ఎందుకైనా మంచిది. అన్న య్యొచ్చేసరికి తనింటి దగ్గరుండకూడదు. కాగితం కలం తీసుకున్నాడు.

"అన్నయ్యకి — "అన్నయ్యా! నిన్ను ఫూల్ని చేద్దామని ఆ లెటర్ రాయలేదు. ఏప్రిల్ ఫూల్ చేయడం ఓ సరదాగదా! మన మిత్రులందర్నీ ఓసారి ఏడ్పించాలని అందరికీ ఆ ఉత్తరాలు బ్రహ్మం పేరుతో నేనే రాశాను. నువ్వా విషయ మీపాటికి గ్రహించేఉంటావ్. ఐతే మరో సంగతి అందరితోపాటు నీకూ ఉత్తరం రాస్తేగానీ వాళ్ళు నమ్మరని అలా రాశాను. అంతకుమించి మరేమీ కాదు. ముఖ్యంగా బ్రహ్మన్ని ఫూల్ చేయడమేనా ఉద్దేశ్యం. సర్దాగా తీసుకుంటావని భావిస్తున్నాను.

రాజారావు."

కాగితం మడిచి చెల్లెల్ని పిలిచి—"చెల్లాయ్! ఎవరికీ చూపించకుండా అన్నయ్య రాగానే ఈ ఉత్తరం యియ్యేం" అన్నాడో పావలా కాసు తీసి. చెల్లాయ్ ముందు పావలా కాసూ, తరవాత కాగితమూ తీసుకుని—"అలాగేలే" అని బఠాణీ లకి పరిగెత్తింది. రాజారావు తృప్తిగా నవ్వుకుని వీధిలో కెళ్ళిపోయాడు.....

రాజారావు వెళ్ళిన ఐదు నిముషాలకి గోపాలం మిత్రబృందంతో సహా ఇంట్లో ప్రవేశించాడు. వెళ్లి రూం తలుపులు తీశాక అంతా చాపమీద కూర్చున్నారు.

"పాపం—చివరిదాకా ఏం తెలీదుగదా: ఎవరే మయ్యేదీ" అన్నాడు ప్రకాశం. "అన్నయ్యా — చిన్నన్నయ్య నీకీ కాగితం ఇమ్మన్నాడు" అంటూ చెల్లాయో ఉత్తరం పట్టుకొచ్చి గోపాలానికి కిచ్చింది. గోపాలం త్వరగా అందుకుని చదివాడు. తరువాత మిత్రులంతా కూడా చదివారు. బ్రహ్మం పక పకా నవ్వాడు.

"పరేలే—ఎవరు ఫూలయిందీ వాడికే తెలుస్తుంది" అంటూ జేబులోంచి పెన్ తీశాడు. "ఒరేయ్ నీ దగ్గర నీలం పేపర్సేమైనా ఉన్నాయిరా?"

"లేకేం—కావలసినన్నీ ఆవెందుకు?" అన్నాడు గోపాలం.

"ఓ పావు టావు కాగితం ఇలా యియ్యి చెబుతా" నన్నాడు బ్రహ్మం. గోపాలం డ్రాయరు తీసి ఓ టావు కాగితాన్ని తీసి మధ్య కరటావుకి చింపి, మళ్లి మడిచి పావుటావుకి చింపి బ్రహ్మని కిచ్చాడు.

టేబుల్మీద కాగితాన్ని పెట్టి బ్రహ్మం ఇంక్ విదిపాడు. కింద సిరా ఎర్రగా పడింది. "నీలి కాగితం.......ఎర్ర సిరా" శంకర్రావు గొణిగాడు.

"అదే—అదే" బ్రహ్మం రాయడం మొదలెట్టాడు.

"ప్రియ మిత్రుడు రాజారావుకి బ్రహ్మం వ్రాయునది. నాకు ఈమధ్య వారసత్వపు టాస్తి నాలుగు లక్షలు కలిసింది. ఈ డబ్బు నేనేం చేయాలా అని ఆలోచించగా సినిమా తీయాలన్పించింది.

మనమంతా చిన్నప్పట్నించి స్నేహితులం. కళాకారులం. కానీ మనలోని కళ అభివృద్ధి చెందేదెలా? లోకానికి తెలిసేదెలా? అందుకే మనూరి వాళ్లతో సినిమా తీయాలని నిశ్చయించుకున్నాను.

నీకు చిన్నప్పటిన్నుంచీ పెద్ద ఆదర్శాలున్నాయి. నీలో వృద్ధిలోకి రావలసిన దర్శకుడి లక్షణాలు చాలా ఉన్నాయి. హైస్కూల్లో కూడా నాటకాలను నువ్వే డైరెక్టు చేసేవాడివి. నిన్ను డైరెక్టర్గా బుక్ చేస్తున్నాను. కాదనవనే నమ్మకం నాకుంది. సోమవారం 1 వ తేదీన నేను మీ వూరు వస్తాను. ఈ విషయం పెద్ద లెవ్వరికీ తెలియనీకు. మన మిత్రుల్లోనే రహస్యంగా ఉంచేయ్.

ఒకటి మాత్రం గుర్తుంచుకో. నేను తీయబోయేది స్టంటు చిత్రం. దాని కాట్టే దర్శక ప్రతిభ అవసరంలేదు. ప్రథమంలో నువ్వంతకు మించి డైరెక్ట్ చేయలేవనే అనుమానంతో స్టంట్ చిత్ర నిర్మాణానికి పూనుకున్నాను. నే వచ్చేలోగా నీ "టాలెంట్స్"కి మెరుగుపెట్టు.

నీ ప్రియమిత్రుడు

బ్రహ్మం

ఉత్తరం విని అంతా నవ్వారు. ఇది ఎలాగో అలా పోస్టులో వచ్చిందని రాజారావు కందజేయాలా—" అన్నాడు బ్రహ్మం. గోపాలం గట్టిగా "చంద్రయ్యా" అని పిల్చాడు. పాలేరు చంద్రయ్య పరుగెత్తుకుంటూ వచ్చాడు. గోపాలం డ్రాయరు తీశాడు. ఇదివరకు బ్రహ్మం పేరుతో తమ్ముడు రాసిన ఉత్తరం తాలూకు కవరందులో ఉంది.



జేబులు జాగ్రత్తబాబు! దొంగలున్నారు!

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" X 2", 4" X 4" సైజులు ప్రతి

దీ తానిదివరకు జాగ్రత్తగానే దించాడు. అందులో బ్రహ్మం రాసిన ఉత్తరం పెట్టాడు. జిగురుతో అంటించి వెనకాల ఎడ్రెస్ తన పేరు ముందు కేరాఫ్ అని రాసి పైన తమ్ముడి పేరు రాశాడు.

బ్రహ్మం—"అద్భుతంరా నీ బుర్ర" అంటూ భుజం తట్టాడు.

'చంద్రయ్యా! తమ్ముడు తోటలో ఉంటాడు. బహుశా, నువ్వీ ఉత్తరం పట్టుకెళ్లి ఈ ఉత్తరం వచ్చి చాలా రోజులయిందనీ—అప్పటికింకా వాడు రాకపోవడంవల్ల నాన్నగారు పెట్లో దాచి పెట్టారనీ చెప్పి—అయ్యగారి కిప్పుడు గుర్తు కొచ్చింది. అర్జంటుత్తరమేమో పనివంపించారని చెప్పు. అర్థమైందా!"

"అర్థమైంది బాబూ!" చంద్రయ్య ఆ లెటర్ తీసుకుని వెళ్లిపోయాడు.

"ఒక ముఖ్య విషయం చెప్పకుండా దాచి నందుకు నన్ను క్షమించండ్రా" అన్నాడు బ్రహ్మం

మిత్రులంతా ఆశ్చర్యంగా బ్రహ్మం వంక చూశారు.

# స్టంటు సినిమా కథ

"నేను సినిమా తీయ దల్చుకున్న మాట నిజమే. అయితే స్టంటు తీయాలనే ఉద్దేశ్యం మాత్రం కాదు. అనుకోకుండా నా కాస్త కలిసిన మాట నిజమే. అయితే లాటరీలో మాత్రం కాదు. చిన్నప్పు డనేవాణ్ణిగా. నా దగ్గరే కనక డబ్బుంటే మిమ్మలందర్నీ పెట్టుకుని సినిమా తీస్తానని. ఆ ఐడియా తట్టే సినిమా తీద్దామనుకున్నాను. ఈ విషయమే మీ అందరికీ చెప్పి మిమ్మల్ని ఆశ్చర్య సాగరంలో ముంచాలని వచ్చాను. వచ్చేసరికి ముందే తెలిసిన వాళ్లలా మీరు సినిమా తియడం నంగ తెత్తారు. అందుకే స్టన్నయ్యాను."

శంకర్రావు నవ్వి—"అయితే, నిజంగా సినిమా తీస్తున్నా నన్నమాట!" అన్నాడు. "ఆ! మిమ్మ ల్నిదో సర్ప్రైజ్ చేయాలని ఈ ఏప్రిల్ ఫస్టును పెట్టుకున్నాను. పొరబాటున ఈ నేను వస్తున్నట్లు రాజారావుకి చెప్పడంతో నా ప్లానంతా తల్లకిందులై మనమంతా ఏప్రిల్ ఫూల్స్ కావలసి వచ్చింది."

"అదెల్లా? ఏప్రిల్ ఫూల్ రాజారావే అవు తాడు" అన్నాడు సుందరం.

"అవును. మన్ని ఏప్రిల్ ఫూల్ చేయబోయి తనే ఫూలయ్యేడు వాడు" అన్నాడు గోపాలం తమ్ముడి మీద జాలిపడుతూ.

"ఇంకాస్సేపట్లో వాడొస్తాడు. తలుపు తీయండి చెప్తాను" అన్నాడు బ్రహ్మం......

ఓ అరగంట అనంతరం రాజారావు వీరవంగా వచ్చి అన్నయ్య రూం దగ్గరికి వచ్చి తలుపు తట్టాడు తలుపు తీసిన ఇద్దరూ తలుపు పక్కకి తప్పు కున్నారు. రాజారావు కెదురుగా బోర్డు కన్పిం చింది.

"ఏప్రిల్ ఫూల్‌కు స్వాగతము." ★

---

ఖర్చు పెడితేనేం? మూలుగుతున్న మూటలకి సంచ లనం కలుగుతుంది. కూతురికి రాణివాసం కోరు తున్నాడు. అంతటి కోరిక ఎలా తీరుతుంది?

"రామభద్రయ్యగారి సంగతి కనుక్కున్నారా?" అన్నాడు చివరికి తను.

"లేదోయ్! నిన్నా మొన్నా పనులతో తీరికలేక పోలేక పోయాను. ఇవాళ కారేమో గుంటూరు పంపిం చాను. శ్రమ అనుకోకపోతే నువ్వు పోయిరా."

"ఎవరి పని వాళ్ళు చేసుకోవటం శ్రమేవుంది లెండి."

తాడేపల్లి ఎలా వెళ్లాలో తెలుసుకుని తిన్నగా భోజన హోటల్‌కి వచ్చాడు తను. ఉన్నంతలో కాస్త పరిశుభ్రంగా కనిపించిందది. టికెట్ కొనుక్కుని లోపలకు పోబోతుండగా తిరిగి ఆగడ్డపతను కనిపించాడు. అతని చేతిలో పుస్తకం అలాగేఉంది. భోజనంచేసి బైటికి వస్తు న్నాడు. ఎందుకోగాని అత నక్కడ కనిపించటం తనకి నచ్చలేదు. అతను మాత్రం తనని చూడం గానే చిన్నగా నవ్వినట్టు జ్ఞాపకం.

పైకి డాబునరేగాని, హోటల్లో భోజనం ఏడిసి నట్టుగా ఉంది. ఒంటి గంటైంది గనక భోజనం అంతకన్నా బావుండటానికి వీల్లేదన్న సిద్ధాంతాన్ని సర్వరూ, మేనేజరూ ఇద్దరూ ప్రతిపా దించారు. ఖర్మ అనుకుంటూ బైట పడ్డాడు. తాడేపల్లిపోయి రామభద్రయ్యగారితో మాట్లాడి తిరి గొచ్చేసరికి సాయంత్రం ఏడు దాటిపోయింది. సత్యం కోసం వెయిట్‌చేసి లాభం ఉండదు గనక అవశేషాలు తీర్చుకుని స్టేషన్ చేరుకున్నాడు.

స్పెన్సర్స్‌లో భోజనం అద్భుతంగా ఉంది......

స్టేషన్‌కి రాకముందు సత్యం ఇంటికి పోయి రావలసింది అనుకున్నాడు చక్రధరరావు. కనీసం సరళ సంగతన్నా వాడితో చెప్పే అవకాశం కలిగేది. ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. ఉత్తరం రాయొచ్చును. సరళ సంగతి తలంపుకు రాంగానే అతనికి కించిత్ గర్వం (!) కలిగింది. తన స్నేహి తుల్లో ఎవరికీ, తనకు తెలిసినంతవరకూ, అంత అందమైన భార్య లేదు.

# తననుగురించిన నిజం

13 వ పేజీ తరువాయి

ఆలోచనల వరుస తెగిపోవటంతో ముందుకు కదిలాడు చక్రధరరావు. అతనికి సరదాగా ఎవర్తో నన్నా కబుర్లు చెప్పాలనిపించింది. వూరుకాని వూళ్లో ఎవడు కనిపిస్తాడు తెలిసిన వాళ్ళు. కనీసం ఆ గడ్డపతనన్నా కనిపిస్తే......

చక్రధరరావు కళ్లకి ఆ మరుక్షణాన కనిపించిం దతనే. బుక్‌స్టాల్ దగ్గర ఏదో పుస్తకం కొంటు న్నాడతను. అతను తనవేపు చూస్తే తనను పలకరించక మానడు. ఆ తలంపులో అతని పక్కకు పోయి నుంచుని తానూ కొనేవాడిలాగా పుస్తకాలు చూడసాగాడు. రెండు నిముషాల తర్వాత అతను పుస్తకం తీసుకుని డబ్బు లిచ్చేసి ఇతని వంకైనా చూడకుండా వెళ్ళిపోయాడు.

చక్రధరరావుకు ఒళ్ళు మండిపోయింది. కాలర్ పట్టుకుని గూబమీద నాలుగు తగిలించాలనిపిం చింది. ఏమిటతని గర్వం?

చక్రధరరావు స్టాల్ దగ్గర్నుంచి ఇవతలకి వచ్చాడు. ప్లాట్‌ఫారంమీద విపరీతంగా ఉన్నారు జనం. పెట్టెలూ, బెడ్డింగులూ కాక, గిన్నెలూ, కారియర్లతో నిండిపోయి ఉంది అంతాను. అవన్నీ దాటుకుని ముందుకు వచ్చాడు. కాస్తంత దూరంలో హడావిడిగా వెళుతున్న సూట్‌వాలా ఒకడు అతని దృష్టిని ఆకర్షించాడు. అతని ముఖం పూర్తిగా కనిపించక పోయినా, అతనెవరో గుర్తించటానికి ఎంతో సేపు పట్టలేదు. అతను మూర్తి.

మూర్తి తనకి ఇంటర్‌లో క్లాసుమేట్. ఇద్ద రిదీ ఒకటే గ్రూపు. తనకు ఒంటబట్టక చివరికి బి. కాం. లో చేర్పించిన మాథమెటిక్సూ, ఫిజిక్సూ, అతనికి మంచినీళ్ళ ప్రాయంగా ఉండేవి. మనిషి స్వతహాగా అందగాడు. ఆపైన లెక్చరర్లచేత 'బ్రిలియంట్' అనిపించుకున్నవాడు. అతనికీ తనకీ మంచి దోస్తీ ఉండేది. అతనికి తండ్రి లేడు. ఆస్తి కూడా లేదు. కాలేజీలో స్కాలర్ షిప్ రావటానికి, తానూ, తన తండ్రి ద్వారా కొంత సాయం చేశాడు. స్కాలర్‌షిప్‌మీద చదువుకుంటు న్నవాడు, అందగాడు, 'బ్రిలియంట్' అంటే పైకనగూడదుగాని కాలేజీ ఆడపిల్లలకి చాలా మధురమైన అభిప్రాయం ఉంటుంది. అందులో కూడని దేదీ లేదు నిజానికి. పెళ్ళికాని ఆడపిల్లకి మరో పెళ్ళికాని అబ్బాయిమీద అలాంటి అభి ప్రాయం ఉండదన్న గారంటీ కూడా ఏమీ లేదు. ఆ సంగతి ఒప్పుకోవటానికే చిక్కు. ఒప్పు కుంటే కొంప మునిగిపోతుందేమో? ఇంతకీ అతనంటే ఆడపిల్లల్లో చాలామందికి ఇష్టమన్న సంగతి తనకి తెలుసు. అందుకుతాను అసూయ పడలేదు. అతని పక్కన తానుండటం తనకూ కొంత స్థాయి పెరిగిందని ఒప్పుకోవటానికీ, తన కభ్యంతరం లేదు. అలాంటి మూర్తి ఆ తరువాత ఇంటర్ పాసై, ఇంజనీరింగ్‌లో చేరాడు. ఈ పాటికి ఇంజ నీరు ఐవుండాలి. వాడి వర్తమానస్థితి తెలుసు కోవాలనిపిస్తోంది తనకి.

చక్రధరరావు, మూర్తి వెళ్ళిన దిక్కుగా వెళ్ళి నాలుగు వేపులా చూశాడు. అతను కనుచూపు మేరలో ఎక్కడా కనిపించక పోవటంతో అతనికి నిరాశ కలిగింది. మరి కాస్త దూరంపోయి చూద్దాం అనుకుంటుండగానే మైక్‌లోంచి ఎనౌన్సుమెంటు వినిపించింది. వాల్తేరుబండి కదలబోతుందీ అంటూ.

చక్రధరరావు ఆదరా బాదరాగా వచ్చి కంపార్ట్ మెంట్ ఎక్కాడు. కంపార్ట్‌మెంటులో కూచుని వున్న ఐదారుగురిలోనూ 'అతనూ' కనిపించాడు. పలకరింపుగా అతను చిరునవ్వు నవ్వినా అతన్తో మాట్లాడటానికి మనస్కరించలేదు చక్రధర రావుకు. తన సీట్లోపోయి కూచుని బైటికి చూడసాగాడు.

బండి కూతపెట్టి కదిలింది. నాలు గడుగులు వేసిందో లేదో రొప్పుకుంటూ కంపార్ట్మెంట్ లోకి వచ్చిపడ్డ మనిషిని చూసి, 'హల్లో' అని కేక పెట్టాడు అతను. బైటికి చూస్తూ కూచున్న చక్రధరరావు ఆ కేకకి ఉలిక్కిపడి ఇవతలికి చూశా డు. మూర్తి!

మూర్తి అతని పక్కకిపోయి కూచుని "ఏమిటి

విశేషాలు?" అన్నాడు జేబు రుమాలుతో చెమట తుడుచుకుంటూ.

"ఏమున్నై? మీరే చెప్పాలి" అన్నా డతను.

"మీరు చెప్పేవి లేక పోవటమేం? గడ్డం గడ్డం పెంచారు. ఏదన్నా మొక్కా?"

"అంతకన్నా ఏఉంటుంది?"

"ఏలూరేనా?"

"ఆ! మీరు?"

"నేను కాకినాడ వెళుతున్నాను......మీ నాన్నగారు కులాసాగా ఉన్నారా?"

"ఆయన పోయారు. మీకు తెలియదా?"

"ఆహా.........ఎప్పుడు? అన్నాడు మూర్తి.

"మూడో నెల గడుస్తోంది. ఆయన అస్తికలు కలపటం ఖాళే చేశాను బెజవాడలో."

"అందుకోసం వచ్చారన్నమాట?......ఇవాళ చాలా దారుణమైన వార్త విన్నానే"

"దారుణమే. విండా యాభై సంవత్సరాలు కూడా లేవు."

"మీ అప్పయ్యేం చేస్తున్నారు?"

"రైల్వేలో పని చేస్తున్నాడు. వాడి దయ వల్లే పాస్ సంపాయించుకుని వచ్చాను."

మూర్తి ఆ తర్వాత ఏమీ అడగలేదు. అతనూ

ఏమీ అనలేదు. చక్రధరరావు మిత్రుడు తన వంక తిగుగుతాడేమో పలకరిద్దామని పూరుకుండి పోయాడు. రెండు నిముషాలు పోయాక 'అతను' లేచి "ఇప్పుడే వస్తాను" అని అవతకి వెళ్లాడు. మూర్తి ఒక్క నిముషం అలాగే కూచుని పక్కకి తిరిగాడు.

"నమస్కారమండి" అన్నాడు చక్రధరరావు నవ్వుతూ.

"హార్నీ! నువ్వా? ఎక్కడ్నుంచి? ఎందాకా?" అన్నాడు మూర్తి మిత్రుడి దగ్గరికి దూకి.

"ఎన్నాళ్ల కెన్నాళ్ళకి అని అడగాలిముందు." అన్నాడు చక్రధరరావు నవ్వుతూ.

"ఏడిశావులే. ఇందాకా ఇక్కడ ఉండి పలకరించ లేదన్నమాట" అని ఒక్క క్షణం ఆగి, నువ్వు చూడటానికి చాలా మారిపోయావు సుమా అన్నాడు మూర్తి.

"బాగుపడ్డా నంటావా? చెడిపోయానా?"

"రంగు తేలావు. ఏమిటి విశేషాలు? అంతా కులాసా?"

"కులాసే! నీ సంగతేమిటి? ఏం చేస్తున్నావ్?"

"ప్రస్తుతం ఖాళీగానే ఉంటున్నాను. నాగార్జునసాగర్‌లో ఉద్యోగం వచ్చింది. మరోవారం రోజుల్లో చేరాలి.

"అదృష్టవంతుడివి."

"ఏవదృష్టంలే! విజయపురిని గురించిన జనవాక్యం వింటే గుడెలు జల్లు మంటున్నాయి"

"ఏవో?"

"ఏదీ సరిగ్గా ఉండదుటభాయ్! ధరలు ఆకాశాన ఉంటాయిట. పైగా అడవిలాంటి ప్రదేశం"

"దేశంకోసం బాధ పడాలోయ్"

"నిజమే. కాని ఆమాట అనేవాళ్లకి అర్హత లేకపోతే?"

చక్రధరరావు కంగుతిని "అంటే?" అన్నాడు.

మూర్తి పకపక నవ్వి, "నిన్ను కాదులే......ఈ గొడవకేంగాని పెళ్ళి చేసుకున్నావా?" అన్నాడు.
అన్నాడు.

"నువ్వు చేసుకున్నావేం?"

"నీకు తెలీకుండా చేసుకునేటంతటి వాణ్ణి కాలేదు"

"ఐతే నేనే అంతటి వాణ్నంటావ్?"

"నీకూ నాకూ పోలిక కేమిటి మిత్రమా?..... ఎందుకు చేసుకోలేదు పెళ్లి?"

"కాలం కలిసి రావద్దూ?......పోనీగాని, నీతో మాట్లాడుతున్న తని పేరేమిటి?"

"ఎవరు?"

"అదేనోయ్! ఆ గడ్డ వతను"

"అతనా?........శాస్త్రి అని. ఏం?"

"నీకెలా పరిచయం?"

"ఏవో కథలూ, అవీ రాస్తుంటాడులే. కాకినాడలో ఎవరో పరిచయం చేశారు."

"అంతేనా?"

"అంతే కాదనుకో! అతన్ని గురించి ఆ తర్వాత చాలా సంగతులు తెలిశాయి. పాపం చాలా జాలి పడవలసిన బతుకతనిది."

"పేదవాడా?"

మూర్తి నవ్వాడు. "పేదరికం ఒక్కటేకాదు జాలిపడతగింది. డబ్బు లేకపోయినా కొంతమంది దర్జాగా బ్రతగ్గలుగుతారు. అంటే అతను అష్ట కష్టాలు పడుతున్నాడని కాదనుకో. కనీసం పైకలా కనపించే వాడు కాదు. అతని తల్లిమీద ఏవేవో పుకార్లుండేవి. వాటిలో నిజమెంతో తెలీదు గాని అతని తండ్రి వాటిని నమ్మి మనసు పాడు చేసుకుని మంచంగత ప్రాణి ఐనాడు. ఆయన స్థితి బావుండనప్పుడల్లా ఇతనో, ఇతని అన్నగారో తమ దగ్గరికి, వచ్చి తీసుకు పోయి సుశ్రూష చేసేవారు. కాస్త కోలుకోగానే తల్లి రావటం ఆయన్ని తీసుకు పోవటం జరిగేదిట. ఒకసారి ఆమెను చూశాను. మొహాన కానీ, అంత కుంకం బొట్టూ, ముదురురంగు ముతక చీరె, ఆమెను అనుమానించటం తెలివి తక్కువ తనమేమోననిపించింది. ఏమైనా గాథ మాత్రం అది. ఆయన ఆబాధతోనే మూడ్నెల్ల క్రితం చనిపోయాడుట. అతను మనసులో చాలా బాధపడేవాడు. పైకి మాత్రం చాలా నవ్వుతూ ఉంటాడు" అన్నాడు.

"మరి అతని చదువు ఎలా సాగిందో?"

"కొన్నింటికి కారణాలు మనకి దొరకవు. అదీ గాక, ఆ అనుమానం నా కెప్పుడూ కలగలేదు. అసలు అంతగాదాకా అతను రానిస్తేగా?"

"గిరగా ఉండేవాడా?"

"చాలా గిరగా ఉండేవాడు. ఎంతో దగ్గిర వాళ్ళేతప్ప అతని గిరచూసి అసహ్యించుకునే వాళ్లు. ఆ అహంకారం అతను తెచ్చి పెట్టుకున్నదని అర్థం చేసుకునే ఓపిక ఎందరికుంటుంది? అందువల్ల అతనికేకదా నష్టం అంటావు? అంతే కాదు. అది అతని పిరికితనానికి చిహ్నం కూడా. కాని, అతనందుకు బాధ పడలేదు. తన బ్రతుకులోని వెలితిని తనముందే ఎవరూ ఎత్తి చూపించకుండా గర్వాన్ని కవచం చేసుకున్నాడు. చాటుకుండా ఎలాగూ అనుకుంటారు. అందువల్ల అతనికి కలిగే ప్రత్యేకమైన బాధ ఏమీ లేదు."

"సమర్థన లకేంలే"

"నిజమే. అందుకే అతన్ని చూసి జాలి పడాలి. అంటున్నాను."

చక్రధరరావు జాలిపడలేక పోయాడు. మూర్తి ఎంత డొంక తిరుగుడుగా చెప్పినా, సత్యం ఒకటే. ఆ శాస్త్రికి చాలా గర్వం. 'పేదవాడి కోపం పెదవికి చేటు అన్నారు. జాగా ఎరిగి బైఠో అని కూడా అన్నారు. గర్వంతో విర్రవీగేవాడి హృదయంలోకి చొరబడ్డాల్సిన అవసరం ఎవరికి? మూర్తిలాంటి వెర్రి వాళ్లకూ, కథలు రాసుకునే పిచ్చివాళ్లకో.

'అతను రాత్రి నాతో పాటే బెజవాడ వచ్చాడులే" అన్నాడు చక్రధరరావు చివరికి.

"అలాగా?.....పరిచయం చేస్తానుండు."

చక్రధరరావు ఎందుకులే అనబోతుండగానే మూర్తి అతన్ని కేకేశాడు. అతను వచ్చి కూచున్నాక ఇద్దరికీ పరిచయం చేసి, "మా వాడు కాస్త భిడియస్తుడు లెండి" అన్నాడు మూర్తి.

"పలకరించటానికైనా తీరిక ఉండాలి కదా?" అన్నాడతను నవ్వుతూ.

చిన్నగా నవ్వి వూరుకున్నాను.

మూర్తి, అతను రెండు నిముషాలు గడిచే సరికి ఏవోవో కబుర్లలో పడిపోయారు. చక్రధరరావుకు చిరాకేయసాగింది. అక్కడ్నుంచి లేచి సిగరెట్ వెలిగించుకుని తలుపు దగ్గర కొచ్చి నిలుచున్నాడు. ఈ శాస్త్రిగాడి కెలాగైనా పరాభవం చెయ్యాలనిపిస్తోంది. తాను మారాడన్నాడుగాని, మూర్తి తానే మారిపోయాడు. తనతో చదువుకుంటున్న రోజుల్లో ఇలా ఉండేవాడుకాదు. అడ్డమైన వాళ్ళనీ వెనకేసు కొచ్చేవాడుకాడు. ఏలూర్లో ఆ సన్నాసి దిగిపోయాక పీడకి, ఓడోసివ్వాలి. వాళ్లిద్దరూ తన కేమీ అన్యాయం చెయ్యనిమాట నిజమే. కాని, ఇద్దరూ మానర్‌లెస్‌గానే ప్రవర్తిస్తున్నారు. ముఖ్యంగా ఆ శాస్త్రిగాడు.

చక్రధరరావు సిగరెట్ కాల్చటం పూర్తి చేసి, తిరిగి తన సీట్‌లోకి వచ్చి కూర్చున్నాడు. "మీరు రూల్సు బాగా పాటిస్తారే?" అన్నాడు. శాస్త్రి నవ్వుతూ.

"నాలుగక్షర మ్ముక్కలు నేర్చుకున్నాం గదండీ!" అన్నాడు చక్రధరరావు.

"అజ్ఞానం అందరికీ ఉండొద్దూ?" అన్నాడతను.

"జ్ఞానం లేక కాదులెండి. తనంత వాడికింక రూల్సేమిటనే ధీమా? గర్వం"

"చూశావా? అతనికి జ్ఞానం తెలుసు. నీకు గర్వం తెలుసు" అన్నాడు మూర్తి నవ్వుతూ.

బలవంతాన నవ్వాడు చక్రధరరావు. మూర్తి 'అంతమాట' అనటానికి కారణం ఏమిటో అతనికి అర్థం కాలేదు. మూర్తిలో ఆ లక్షణం కొత్తగా పుట్టిందే. హఠాత్తుగా అతనికి, మూర్తి శాస్త్రిని ఎందుకు సమర్థించాడో అర్థం ఐంది. ఒక స్థాయి నందుకున్నాక, ప్రతివాడూ గతం మర్చిపోతాడేమో! గతం మర్చిపోవటం అంటే వర్తమానంమీద మక్కువ పెరగటం మన్నమాట. అప్పుడు మనుషులు చేసే పనులకీ, ఆడే మాటలకీ ఉండే అర్థం ఒకటే. ఆ అర్థంతో ఉండేవాడు తారస పడితే ఇద్దరూ సన్నిహితు లౌతారు!

"ఇంతకీ మీరు బెజవాడ ఎందుకొచ్చారో చెప్పారు కాదు!" అన్నాడు శాస్త్రి మూర్తితో.

చక్రధరరావుకి వాళ్ల సంభాషణ వినటం ఇష్టం లేక పోయింది. కాని, మరో చోటికిపోయి కూచోవటం అసభ్యంగా ఉంటుంది. మరి చెవులు మూసుకోవటం సాధ్యం కాదుగదా? ఆసక్తి లేనట్టుగా కూచున్నా మాటలు వినపడటం మూలావ ముళ్ల మీద కూచున్నాడనిపించ సాగిందతనికి.

"మీ రెందు కొచ్చారో చెప్పారా?" అన్నాడు శాస్త్రి నవ్వుతూ.

"బావుంది. నే చెబితేగాని చెప్పరా?"

శాస్త్రి నవ్వి "నా స్నేహితు డొకతనుండే వాడు. వ్యాపారాన్ని అసహ్యించుకోవటం గొప్ప కాదనేవాడు." అన్నాడు.

"అదేవిటి? వ్యాపారాన్ని ఎవడసహ్యించుకుంటాడు?" అన్నాడు మూర్తి.

"వ్యాపారాన్ని అసహ్యించుకోవటమంటే అది

---

ఒక విదూషకుడు ఒక చమత్కారం చెప్పాడు సభలో.

"అది నాదే" ఒక కుర్రాడి కేక.

"కాని నేను ఒక పోకోడిపొట్లం యిచ్చి దీన్ని సొంతం చేసుకున్నాను" అన్నాడు విదూషకుడు.

గోపాల్ (గూడూరు)

---

కాదు. పూర్తిగా నిజాయితీగా ఉంటే ఏ వ్యాపారమూ నిలవదుగదా! అలాగని మోసం చెయ్యాలని కాక పోవచ్చు. కాని లాభాలు కావాలంటే కొంత దగా చెయ్యక తప్పదు. అంటే ధర హెచ్చు చెప్పటం లాంటివి. రాబడి ఉన్నప్పుడు మడి కట్టుకుంటే చిన్న వ్యాపారాలు నిలవవు. అందుకని ఎవడన్నా వ్యాపారం మోసంతో కూడిందంటే వాడు ఒప్పు కునేవాడు కాదు. మన జీవితంలో మనం చేసే ప్రతి పని వ్యాపారమేనుట. అన్నం తినటం, బట్టలు కట్టుకోవటం అన్నీ వ్యాపార దృష్టితోనే చేస్తున్నా మంటాడు."

"ఆలోచించాల్సిందే"

"నేను చాలా ఆలోచించి ఆ సిద్ధాంతం నిజ మనుకున్నాను. అందుచేత చెప్పేదేమిటంటే మీరెం దుకు బెజవాడ వచ్చారో ముందు చెప్పండి."

మూర్తి నవ్వి "చెప్పాల్సిందేనంటారా?"

అన్నాడు.

"రహస్యమైతే వద్దు లెండి."

"రహస్యం కాదనుకోండి.....సిగ్గేస్తోంది."

శాస్త్రి నవ్వాడు. "సిగ్గంటే జ్ఞాపకం వచ్చింది పొద్దున్నేవరో ఆయన ఆడవాళ్లు ఎందుకు సిగ్గుపడతారు అని ప్రశ్న వేశాడు. ఏదో సమాధానం చెప్పాననుకోండి" అన్నాడు.

"ఎవరు బాబూ? అంత గొప్పాయన?"

"కాబోయే యజమాని.....కాని ఏమాట కామాటే చెప్పుకోవాలి మూర్తిగారూ. అంత చదువుకున్నవాడు, హోదాలో ఉన్నవాడూనా? చాలా హాయిగా, స్నేహితుడిలాగా మాట్లాడాడు. అందుకు తగ్గట్టు చాలా ప్రిష్టిక్వాను. గొప్పటం అంటూ ఆయన నిఘంటువులో లేదనిపించింది."

మూర్తి పకపక నవ్వి, "బోల్తా పడిపోయారు కూశారా?" అన్నాడు.

అతనూ నవ్వి, "పోన్లెండి. మీ సంగతి చెప్పండి" అన్నాడు.

"ఈ వూళ్లోనే—అంటే బెజవాడలోనే మాకు దూరపు బంధు ఒకాయన ఉన్నాడు. ఆయన కూతుర్ని భార్యగా అంగీకరించటానికి వచ్చాను."

"అదేమిటి?"

"అదంతే. చాలాకాలం క్రితమే అంటే రెండేళ్ల క్రితమే ఈ సంబంధం ఖాయమైంది. కాబోయే అత్తగారు నన్ను చూడాలంటే వచ్చాను."

"మంచి వాళ్ళేనా?"

"ఆ. బాగా ఉన్నవాళ్లు కూడాను. నా చదువుకి దానికీ సాయం చేశారు."

"ముందుగానే బుక్ చేసుకున్నారన్నమాట?"

"అంతే. కాని, ఆయన మంచి తనాన్ని గౌరవించాలా లేదా?"

"తప్పకుండా మంచితనమేకాదు. ధైర్యం కూడా"

"మరే!......ఇంతకీ మీ ఉద్యోగం సంగతి వెంటనే తెలిసిందా?"

"సాయంత్రానికల్లా చెప్పేశాడు. వచ్చిండి లెండి."

ఏమీ మాట్లాడలేకపోతే బావుండదని "ఎవరి అమ్మాయి మూర్తీ?" అన్నాడు చక్రధరరావు, చిన్నగా నవ్వుతూ.

"రాజారావుగారని— వెంట్రప్రగడవారు గాంధీనగర్‌లో ఉన్నార్లే. వారమ్మాయి సరళ" అని శాస్త్రివేపు తిరిగి, 'మీ ఉద్యోగం ఎక్కడా? ఏదన్నా ప్రైవేటు కంపెనీయా?" అన్నాడు మూర్తి.

చక్రధరరావు దిమ్మరబోయాడు. అతనికి పొద్దున రాజారావుగారు మాట్లాడిన దానికీ, ఇప్పుడు మిత్రుడు చెప్పిన దానికీ లంగరంలేదు.

ఆశ్చర్యంలో అతను తన్నుకుంటుండగానే "అవునండీ! యూనివర్సల్ ప్లాస్టిక్స్‌లో" అన్నాడు శాస్త్రి. 

---

# న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

ఖేరా, ఎల్. కె. ఝా, ఎస్. భూతలింగం, వి. టి. క్రహీంజియా, ఐ. జి. పాటిల్‌లు సభ్యులు. ఈ పథకాల అమలులో గల జాప్యాలను తొలగించి సజావుగా జరిగేట్లు చూడమని రాష్ట్ర ప్రభుత్వాలు చేసిన సూచనలు, పార్లమెంట్ లోపలా బయటా చెలరేగిన విమర్శన దుమారాలు కారణంగా ఈ సంఘం నియామకం జరిగింది. ఇప్పటి పరిస్థితుల దృష్ట్యా మన ఆర్థికమంత్రి ఈ రెండు పథకాలకు సున్న చుట్టేస్తారనుకుంటే అది అతిశయోక్తే. ఇప్పుడు చెయ్యబోయే పనల్లా ఈ పథకాలకు ప్రజల ఆమోదం పొందేవిధంగా సవరించుకోవటం, నిర్బంధపు పొదుపు విషయంలో ఎలాంటి అవకతవకలు లేకుండా సక్రమంగా ఉండేందుకుగాను, అమలులో గల జాప్యాలను తొలగించటమూ మాత్రమే.

భారతదేశంలోని బ్యాంకులను జాతీయం చేయాలంటూ కాంగ్రెసు సభ్యురాలు శ్రీమతి సుభద్రాజోషీ చేసిన ప్రతిపాదనను (దీన్ని కమ్యూనిస్టులు కూడా బలపరిచారు.) గట్టిగా విరోధించటంలో ఆర్థికమంత్రి సఫలు లయ్యారు. లోక్‌సభలో ప్రసంగిస్తూ ఆర్థికమంత్రి, అధికార సంపత్తుల కేంద్రీకరణను విరోధించకపోతే భారతదేశంలో ప్రజాస్వామ్యం మనుగడ కష్టమని అన్నారు.

**"అంతేగాదు; వ్యక్తి రంగంలో వున్న అధికారసంపత్తుల కేంద్రీకరణాన్ని అరికట్టేందుకు మనం పరిపాలనాత్మకమైన, శాసనాత్మకమైన పద్ధతులమీదే ఆధారపడాల్సి వుంటుంది. ప్రభుత్వరంగం విస్తృతి గాని, సమాజంలోని తక్కువ అవకాశవర్గాల అభివృద్ధికిగానీ మనం ఈ ధ్యేయాన్ని మనస్సులో వుంచుకునే పథకాలు వేస్తున్నాం" అని కూడా అన్నారు.**

భారతదేశంలో నూనె గొట్టాలను ఏర్పరచి నిర్వహించేందుకు పరిమిత వ్యయం గల సంస్థనొకదాన్ని నెలకొల్పాలని భారతప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఈ సంస్థల్లో వాటాదార్లుగా రైల్వేలు ప్రభుత్వ రంగంలో ఉన్న పరిశుద్ధి కర్మాగారాలకు ప్రభుత్వ యాజమాన్యంలోని భారతీయ నూనె సంస్థ 'ఇండియన్ ఆయిల్ కంపెనీ' లను చేర్చుకోవాలని అనుకోవటం జరిగింది. అయితే ప్రభుత్వం కాస్త ప్రసన్నంగా ఉంది కనుక, వ్యక్తిరంగంలో ఉన్న మూడు నూనె శుద్ధి కర్మాగారాలు పంపిణీ సంస్థలను ఇందులో చెర్చేందుకు ప్రభుత్వాన్ని ప్రోత్సహించవచ్చు.

ఈ నూనె గొట్టాలు వేసే కార్యక్రమం చాలా రోజు క్రిందటే ప్రారంభమైంది. ఇప్పటికే అస్సాం నూనె గనుల నుండి నున్మతి పరిశుద్ధిశాల దాకా 260 మైళ్ళ పొడుగున, బరౌని పరిశుద్ధి కర్మాగారందాకా 720 మైళ్ల పొడుగున నూనె గొట్టాలు ఉన్నాయి. హల్దియా, కలకత్తాల నుంచి బిరేనీకి కలుపుతూ ముడి నూనెకు గొట్టాలను వేసేందుకుగాను ఇ. ఎన్. ఐ. అనే ఇటాలియన్ సంస్థతో ఒప్పందాలు జరిగాయి. అంతేగాక బిరేనీ కాన్పూరుల మధ్య గూడా నూనె గొట్టాలు నెలకొల్పే ఒప్పందం ఒకటి పై సంస్థతోనే కుదుర్చుకున్నారు. ఇవిగాక బొంబాయి— పూనా, కొయాలీ, అహమ్మదాబాద్ ఇంకా గుజరాత్‌లోని కొన్ని ప్రదేశాల్లోను ముడి నూనెకు గొట్టాలను వేయాలనేది ఇంకా ఆలోచనలో ఉన్న కొన్ని ప్రతిపాదనలు. కొచ్చిన్‌లోని నూనెశుద్ధి కర్మాగారం పని ప్రారంభమైంతర్వాత, కేరళలో గూడా ఇలాగే నూనె గొట్టాలను ఏర్పాటు చేస్తారట. రూర్కేలాలోని ఉక్కు కర్మాగారంలో మనమే గొట్టాలు తయారుచేసుకుంటున్నందువల్ల ఇప్పుడున్న ఇబ్బందల్లా ఒకటే, పథకాలు సిద్ధపరచి గొట్టాలు వేయటం. ఈ దృష్ట్యా, ఇప్పుడు కొత్తగా వచ్చే సంస్థ భారత ఆర్థిక విషయంలో చాలా ప్రముఖమైన స్థానం ఆక్రమిస్తుందన్నమాట.

* * *

ప్రభుత్వం, ఇంకా కొందరి సహకారంతో ఫిలిప్స్ పెట్రోలియం సంస్థ 2 మిలియన్ల ఖర్చుతో కొచ్చిన్‌లో నూనెశుద్ధి కర్మాగారాన్ని నెలకొల్పుతూ ఒక టాంకర్ కంపెనీ నెలకొల్పేందుకు కూడా అనుమతించవలసిందని భారత ప్రభుత్వాన్ని అర్థించింది.

నౌకాసంస్థలలో విదేశీ పెట్టుబడులను ఈక్విటీ పెట్టుబడులలో 25% నుంచి 40% పెంచేందుకు ఒప్పుకొంది. అయితే నిర్వహణశాఖ ఉద్యోగుల నియామకం విషయంలో మాత్రం 'షిప్పింగ్ ఆక్ట్' కు సూత్రాలను యథాతథంగా ఉంచింది. అందులో ముఖ్యమైనవి :

(1) కంపెనీ డైరెక్టర్ల సంఖ్యలో 3 వంతులు భారతపౌరులై ఉండాలి.

(2) సంస్థ డైరెక్టర్ల బోర్డు చైర్మన్‌గానీ, మేనేజింగ్ డైరెక్టరుగాని (ఒకవేళ ఉంటే) కూడా భారతపౌరులై ఉండాలి.

(3) మానేజింగ్ ఏజెంట్లు అంటూ ఉంటే వాళ్ళు కూడా భారతపౌరులై ఉండాలి. ఒకవేళ అలాంటి ఏజంటుగా ఏదైన సంస్థ ఉండటం జరిగితే అలాంటి సంస్థ కూడా నిర్ణీతమైన అర్హతలను కలిగిఉన్నట్లు దాఖలా చూపాలి.

వీటిల్లో చర్చ అంటూ వస్తే అది ముఖ్యంగా సరుకుల విషయంలో మాత్రమే భారత ప్రభుత్వానికి సంబంధించిన ముడి ఎగుమతులన్నీ కొత్త సంస్థకే ఇస్తాననే హామీ భారత ప్రభుత్వం ఇవ్వాలని ఫిలిప్స్ పెట్రోలియం సంస్థ అభిప్రాయపడుతున్నట్లు తెలుస్తున్నది. అలా కోరటం కూడా సహజమే. ప్రభుత్వం తన ముడి సరుకును భారత పథకం క్రింద నడిచే సంస్థల పడవలకే ఇవ్వాలని అనుకోవచ్చు. అయితే ప్రభుత్వం సిద్ధాంతరీత్యా అలాంటి హామీ ఇచ్చేందుకు వ్యతిరేకతను చూపిస్తున్నది. ఎందుకంటే ప్రభుత్వ యాజమాన్యంలో ఉన్న సంస్థలే టాంకర్లు సంపాదించుకోవచ్చు. ప్రభుత్వం చేసే ముడి సరుకుల ఎగుమతుల విషయంలో వీటికి ప్రాధాన్యం ఎప్పుడూ ఉండనే ఉంటుంది. 

మద్రాసు సోషల్ అండ్ కల్చరల్ క్లబ్‌లో సెప్టెంబరు 10వ తేదీని వారి ఆత్మశాంతికై సంతాప సభ జరిపారు.

డా. రాజారావుగారి కుటుంబ సహాయార్థం ఫిలిం పరిశ్రమలోని వారు, పురప్రముఖులు డా. రాజారావు మిత్రులు, శ్రేయోభిలాషులు, అంతా కమిటీగా చేరి డబ్బు వసూలు చేసి ఇవ్వనున్నారు.

## శ్రీసత్యనారాయణ మహాత్మ్యం

అన్నదాత వినాయకచవితి, దీపావళి మొదలగు ఉత్తమ చిత్రాలు నిర్మించి, సమర్పించిన కె. గోపాలరావు అశ్వరాజ్ పిక్చర్సు బేనర్ క్రింద "శ్రీ సత్యనారాయణ మహాత్మ్యం" చిత్రాన్ని నిర్మించబోతున్నారు. ఈ చిత్రంలో యన్. టి. రామారావు, శ్రీ సత్యనారాయణస్వామిగా కనిపిస్తారని తెలుస్తుంది. రచన : సముద్రాల, సంగీతం : ఘంటసాల, ఛాయ : పి. నాగేశ్వరరావు, నిర్మాత : పి. యన్. సత్యనారాయణ బి. ఏ., దర్శకత్వం, : రజనీకాంత్.

## కుమారి ఇందిర భరతనాట్యం

మద్రాసులో శ్రీ యు. వై. నారాయణరావు (ఆంధ్రా బ్యాంకు)గారి అమ్మాయి కుమారి యు. ఇందిర మద్రాసులోని టి. నగర్ వాణీమహల్‌లో 8—9—63వ తేదీ సాయంత్రం 6—30 గంటలకు భరతనాట్య ప్రదర్శన మిచ్చింది. ఆ రోజు ప్రదర్శనకు ప్రముఖ చలనచిత్ర నటుడు శ్రీ చిత్తూరు నాగయ్య అధ్యక్షత వహించారు. ఫిలిం పరిశ్రమలోని ప్రముఖులు, పాత్రికేయులు ప్రదర్శనానికి హాజరయ్యారు. శ్రీ నాగయ్యగారు ఇందిర రజిత పతకాన్ని, "యూసఫ్ ఇంజినీరింగ్ కంపెనీ" కార్యదర్శి శ్రీ ఆర్. రామకృష్ణన్ వెండిదీపపు సెమ్మెను బహూకరించారు.

## అనురూపా పిక్చర్సు

అనురూపా పిక్చర్సువారు తమ రెండవ సాంఘిక చిత్రానికి శ్రీ సదాశివబ్రహ్మంతో స్క్రిప్టువర్కు పూర్తి చేస్తున్నారు. దర్శకుడు జి. రామినీడు, నిర్మాతలు : టి. హనుమంతరావు, డి. సూర్యనారాయణ.

## శ్రీవెంకటేశ్వరస్వామి దేవాలయ గోపురమునకు శ్రీ ఎన్. టి. రామారావుచే శంకుస్థాపన

గూడూరు తాలూకా — వెల్లూరుపల్లె — క్రొత్తపాలెంలో ప్రసన్న వెంకటేశ్వరస్వామి దేవాలయ గోపుర నిర్మాణానికి సెప్టెంబరు 10వ, తేదీ రాత్రి ప్రముఖ సినిమా నటుడు శ్రీ యన్. టి. రామారావు శంకుస్థాపన చేశారు.

తర్వాత శ్రీ రామారావుగార్కి ఘనమైన సన్మానం జరిగింది. స్థానిక వెంకటేశ్వర నాట్యమండలివారు శ్రీ రామారావుగారి అధ్యక్షతన "శ్రీ కృష్ణతులాభారం" నాటకం ప్రదర్శించారు. సన్మానించినవారు శ్రీ రామారావుగార్కి చక్కటి "శ్రీ వెంకటేశ్వరస్వామి" రజిత విగ్రహాన్ని సమర్పించారు.

## 'జన్మహక్కు'

**శ్రీ లక్ష్మీ ప్రొడక్షన్సువారి తొలి సాంఘిక చిత్రం**

## అవీ - ఇవీ - అన్నీ

11 వ పేజీ తరువాయి

"జన్మహక్కు" త్వరలో షూటింగ్ పూర్తి చేసుకొని సంక్రాంతి కానుకగా ఆంధ్రలో విడుదల చేయాలని నిర్మాతలు కృషి చేస్తున్నారు.

సి. యస్. ఆర్., రమణమూర్తి, హరనాథ్, రాజశ్రీ, హేమలత, మొదలగువారు ఇందులో నటిస్తున్నారు. నిర్మాతలు : టి. రాజగోపాలరెడ్డి, చంద్రశేఖరరెడ్డి.



'అద్దాలమేడ'లో అనే చిత్రంలో ఒక సన్నివేశం.

## రేలంగి-గిరిజలకు కనకాభిషేకం

ఈమధ్య రాజమండ్రిలో శ్రీ గణపతి నవరాత్రి మహోత్సవాలు జరిగాయి. శ్రీ గణపతి భక్త సమాజంవారు గత నెల 24 వ తేదీని ప్రముఖ తెర తారలు శ్రీ రేలంగి, గిరిజలను ఆహ్వానించారు. వీరిరువుర్కి రాజమండ్రి స్టేషన్‌లో ఘనమైన స్వాగతం ఇవ్వబడింది. స్టేషన్‌నుండి సమాజ కార్యాలయంవరకు బ్రహ్మాండమైన ఊరేగింపుతో బ్యాండు వాయిద్యాలతో తీసుకు వెళ్ళారు. ఆ రోజు మధ్యాహ్నం కొంతమంది పుర ప్రముఖులతో విందు జరిగింది. స్థానికంగా జరుగుతున్న ప్రదర్శనవారు రేలంగి, గిరిజలను ఆహ్వానించారు. ఎగ్జిబిషన్ సందర్శనకు వీరిరువురూ వెళ్లారు. సాయంత్రం 6 గంటలకు సభా మండపం చేరుకున్నారు. సభకు శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ అధ్యక్షత వహించారు. పదిమంది బ్రాహ్మణులతో, వేద—పఠన మంగళ వాయిద్యాలతో కనకాభిషేకం జరిగింది.

సన్మానానంతరం శ్రీ రేలంగి సమాధానం చెబుతూ, "తూర్పు గోదావరి జిల్లాలో అనేక రకములైన కళాకారులున్నారు. కళాకారులకు నిలయమై వున్న ఈ రాజమహేంద్రవరంలో ఇటువంటి

## భారీయెత్తున దేశరక్షణకు
## ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి







# అవీ - ఇవీ - అన్నీ

సన్మానం నాకు జరుగుతున్నందుకు ఎంతో ఆనందంగా వుంది" అన్నారు.

## నటిగా పాత "కాంచనమాల"

జెమినీవారి బాలనాగమ్మ చిత్రంతో తెర మరుగు పడిన కాంచనమాల తిరిగి రాజ్యం పిక్చర్సువారి "నర్తనశాల"లో నటిస్తుంది. ఆనాటి అందాల రాశి, ఏకైక కథా నాయకి తెర మరుగు పడినా— తిరిగి ఈనాడు చిత్రాలలో నటించడం మెచ్చుకో తగ్గ విషయం. చిత్రాలలో తిరిగి నటించే అవకాశం కాంచనమాలకు కలిగినందుకు, తిరిగి ఆమెను తెరపై ఆంధ్ర ప్రజలకు చూపిస్తున్నందుకు రాజ్యం పిక్చర్సు అధినేతలు, సాంకేతికవర్గం అభినందనీయులు.

## ఎడింబరో ఉత్సవంలో దక్షిణ భారత గాయకి శ్రీమతి ఎం.ఎస్. సుబ్బులక్ష్మికి అవకాశం

ఎడింబరో ఉత్సవంలో గాన కచేరీ చేసేందుకు శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మి భర్త సదాశివంతో సహా వెళ్ళింది. ఆమె వెళ్ళడానికి ముందు కొంతమంది ఆమె శ్రేయోభిలాషులు విందు ఏర్పాటు చేశారు. శాలువలు కప్పి సత్కరించారు. రాజాజీ మొదలగు ముఖ్యులు హాజరయ్యారు కూడ. ఈ విషయం పురస్కరించుకొని రాష్ట్రపతి శ్రీ రాధాకృష్ణన్ సందేశం కూడా పంపేరు.

## తెనుగులో 'నానుం ఒరు పెణ్'

తమిళంలో హిట్ అయిన "నానుం ఒర్ పెణ్" చిత్రాన్ని ఈనెల 5 వ తేదీ మధ్యాహ్నం 12—25 ని. లకు ఏ. వి. ఎం. స్టూడియోలో శ్రీ వాణీ ఫిలింస్ తెలుగులో లాంఛనప్రాయంగా ప్రారంభోత్సవం జరిపారు.

స్విచ్ ఏ. వి. యం. స్టూడియో అధినేత శ్రీ ఏ. వి. మెయ్యప్పన్ చెట్టియార్ నొక్కారు. శ్రీ యన్. టి. రామారావు క్లాప్ కొట్టారు. ప్రథమ షాట్ నటుడు పెరుమాళ్ళను తీశారు. శ్రీ యన్. టి. రామారావుకు శ్రీ యస్. వి. రంగారావు, శ్రీ ఏ.వి. మెయ్యప్పన్ చెట్టియార్‌కు విజయా డిస్ట్రిబ్యూటర్సు శ్రీ సత్యంగారు పూలమాలాంకృతుల్ని చేశారు. ఈ చిత్రంలో నటించే నటీనటులకు, పని చేస్తున్న సాంకేతిక వర్గానికి శ్రీ రంగారావు పూలమాలలువేసి సత్కరించారు.

ఆరోజు షూటింగ్‌లో రమణారెడ్డి, పెరుమాళ్ళు, ఛాయాదేవి, మాస్టర్ బాబు పాల్గొన్నారు.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, సావిత్రి, యస్. వి. రంగారావు, రమణారెడ్డి, పెరుమాళ్ళు, అల్లు రామలింగయ్య, బాలసరస్వతి, ఛాయాదేవి, మొదలగువా రున్నారు. ఈ చిత్రానికి దర్శకుడు త్రిలోకచందర్. సంగీత దర్శకుడు సుదర్శన్ (జీవితం ఫేమ్.)

## హైదరాబాద్ మూవీస్:
## ప్రొడక్షన్ నెం. 3

హైదరాబాద్ మూవీస్‌వారి ప్రొడక్షన్ నెం. 3 చిత్రం వాహినీ స్టూడియోలో షూటింగు జరుగుతుంది. ఇప్పటివరకు 7 రీళ్ల చిత్రం పూర్తి అయింది.

"పిల్లనగ్రోవిగ మారితిరా—నీ చల్లని చూపులు సోకినంతనే......"

పై పాటను ఆత్రేయ వ్రాశారు. సుశీల పాడగా, రికార్డు చేసారు. జమునతో చిత్రీకరించారు. ఈ చిత్రానికి రచన: డి. వి. నరసరాజు, ఛాయ: వి. సత్యనారాయణ, సంగీతం: కోదండపాణి.



'గురువును మించిన శిష్యుడు'లో ఒక దృశ్యం.

కథ: ఏ. మూరన్న బి. ఏ., కూర్పు: సంజీవి, దర్శకుడు: పి. యస్. రావు, నిర్మాత: గంగాధరరావు,
ఈ చిత్రంలో జమున, జగ్గయ్య, కన్నాంబ, గుమ్మడి, సూర్యకాంతం, రమణారెడ్డి, వాసంతి. చలం, గీతాంజలి మొదలగువారు నటిస్తున్నారు.

## తారల విచిత్ర వేషధారణలో షావుకారు జానకి

మద్రాసు లేడీస్ క్లబ్బువారు దేశ రక్షణ నిధికి ఈమధ్య విచిత్ర వేషధారణ పోటీలు జరిపారు. షావుకారు జానకి ముస్లిం వేషం వేసి, ప్రథమ బహుమతి నందుకొంది. ఇంకా ఈపోటీలో దేవిక, జయంతి, చంద్రకాంత, పద్మినీ ప్రియదర్శినీలు పాల్గొన్నారు.

పి. ధర్మారావు. ★

కొంత తేలికదనం వచ్చిందనటంలో సందేహంలేదు. అయినా ఈ అస్త్రాన్ని ఉపయోగిస్తున్న వ్యక్తుల్ని బట్టి కూడా దీని స్థాయి నిర్ణయమవుతూ ఉంటుంది. ప్రముఖ సర్వోదయ నాయకుడు గోపరాజు రామచంద్రరావుగారు (గోరా) మంత్రుల ఆడంబరాల పట్ల నిరసన తెలియపరుస్తూ, ముఖ్యమంత్రి నివాసం 'గ్రీన్‌లాండ్స్' వద్ద తన సహచరులతో సత్యాగ్రహం సాధించారు. అందువల్లనే ఈ యావద్భారతదేశం కూడా ఈ సత్యాగ్రహం పట్ల ఆసక్తి చూపించటం జరిగింది. ఒక కారణంగా శ్రీ గోరాగారు ప్రారంభించారు కాబట్టి అని చెప్పుకున్నా, వారు తీసుకున్న సమస్య దృష్ట్యా కూడా అందర్నీ ఆకర్షించింది.

ఇలాంటి సత్యాగ్రహం ప్రారంభించే ముందర శ్రీ గోరా గారు ముఖ్యమంత్రికి లేఖ వ్రాస్తూ కొన్ని విషయాలను ఉల్లేఖించారు. వర్తకులు, యితర వ్యాపారస్థులు, వ్యాపారంలో పెట్టుబడి పెట్టుతున్నట్లే, ఎన్నికల్లో వేలు, లక్షలు ఖర్చుపెట్టి గెలిచి వచ్చిన తర్వాత పదవుల మూలంగానో, ఇతరత్రావో తాము వెచ్చించిన డబ్బుకు ఎన్నోరెట్లు ఆర్జించుకోవటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇలాంటి ధనార్జన వ్యాపకంలో శాసనసభ్యులు ఎక్కువ నిర్మాణాత్మకమైన కృషికి ఉత్సాహము చూపలేకపోతున్నారు. పైపెచ్చు, అవినీతి, లంచగొండితనం, ఆశ్రిత పక్షపాతం, అధికార దుర్వినియోగం అసమర్థత రానురాను ఎక్కువయిపోతున్నయి. అందువలన ఆడంబరాలను తగ్గించినట్లయితే మోహము, లోభము కూడా వాటంతటవే సన్నగిల్లిపోతాయి. ప్రజాస్వామికంలో డాబులకు, దర్పాలకు ప్రాముఖ్యం ఇవ్వకూడదు. ప్రభుత్వాధిపతులు ఏ విషయంలో కూడా సాధారణ ప్రజానీకం కన్న ఎక్కువనే గర్వం, అభిప్రాయం పెట్టుకోకూడదు. అప్పుడే వాళ్ళు సిసలైన ప్రజాప్రతినిధులని చెప్పబడతారు. ప్రజాస్వామ్యం వర్ధిల్లాలంటే ఇది మొట్టమొదటగా చెయ్యవలసిన విధి.

# రాజధాని కబుర్లు

9 వ పేజీ తరువాయి

అయిదు రోజులపాటు, ఈ సత్యాగ్రహం చెయ్యటం, దీంట్లో స్త్రీలు కూడా పాల్గొనటం నగరంలో బాగా సంచలనం కలిగించింది. అసలు ముఖ్యమంత్రికే ఏమిచెయ్యాలో తోచినట్లు లేదు. తాను కూడా శ్రీ గోరాగారి అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవిస్తున్నానని, గ్రీన్‌లాండ్స్ వదలి ప్రస్తుతం ఛీఫ్ సెక్రటరీ ఉంటున్న భవనానికి వెళ్ళటానికి నిశ్చయించానని, అయితే ఆ భవనం అంతకుముందే ఇంకొకరికి కేటాయించటంవలన వీలుపడలేదని నూతన భవనాన్వేషణలో ఉన్నానని అన్నారు. ఇంతవరకు బాగానే ఉంది. కాని, వారంతటితో వూరుకోలేదే! ఇంకా వాక్రుచ్చారు. తాను నిజానికి గ్రీన్‌లాండ్స్ వదిలేసి యింకో చిన్న భవనంలోకి వెళదామనుకుంటున్నా, గోరాగారి ఉత్తరం వచ్చేటప్పటికి తాను మనస్సు మార్చుకున్నా మన్నారు. ఇంకో సంగతేమిటంటే తాను వ్యక్తిగతంగా ఆడంబరాలకు వ్యతిరేకి అయినప్పటికీ యిలాంటి విషయాల్లో అఖిలభారత స్థాయిలో నిర్ణయాలు తీసుకోవటం అవసరమని, సర్వోదయ సమ్మేళనానికి తాను హాజరయి వినోబాభావేగారి సలహాను తీసుకుంటామంటూ ఇతర రాష్ట్రాల ముఖమంత్రులకు కూడా ఆ సమ్మేళనానికి రమ్మని ఆహ్వానించమని కోరారు. దీంతోనే వచ్చింది చిక్కంతా! తనకు నిజంగా ఇష్టమైతే తాను నిర్ణయం తీసుకుంటే ఇతర రాష్ట్రాల కన్నింటికి ఆదర్శప్రాయంగా ఉంటుందిగా తానొక్కడుగా ఒక చిన్న భవనానికి 'మకాం', మారిస్తే గౌరవానికి, ప్రతిష్ఠకు భంగం కలుగుతుందని శంకా? శ్రీ గోరాగారు వీటికి సూటిగా సమాధానం చెప్పలేదు. నిజానికి యీ ప్రశ్నలు ముఖ్యమంత్రికి వెయ్యాలసినవిగా ?

శ్రీ గోరాగారు ముఖ్యమంత్రిగారితో మాట
డటం, వారిచ్చిన సమాధానాలతో తృప్తిపడ
జరిగింది. దాంతో సత్యాగ్రహ విరమణ జరిగి
దీంతో శ్రీ గోరాగారికి ఇంకొంచెం
వచ్చింది. గవర్నర్ల పదవులు శుద్ధ దండ
వాటిని రద్దుచెయ్యాలని ఆందోళన ప్రారంభి
రుట! ఇప్పటికి వీరు చేసిన సత్యాగ్రహం
మయినట్లు! నలుగురి దృష్టినిఆకర్షించి
మాటే తప్ప వీరు చేసిన సత్యాగ్రహ
ప్రస్తుతం సాధించిందేవీ కనిపించలేదు. యి
ఇంకా రచ్చ కెక్కకుండా ముఖ్యమంత్రి
శ్రీ గోరా గారితో ఏకీభవించినట్లు
చెపుతూ, తాను మాత్రం ప్రస్తుతం
లాండ్స్‌లోనే ఉంటామన్నట్లు అక్కడినుంచి
ల్లేదు. పైగా, శ్రీ గోరా బృందానికి ఆతి
ఇవ్వటానికి కూడా పూనుకున్నరు.
గ్రీన్‌లాండ్స్‌లోనే! ఇక్కడే సత్యాగ్రహాలపైన స
గ్రహం జరిగింది! శ్రీ గోరా బృందం
లాండ్స్‌లో ముఖ్యమంత్రిగారి ఆతిథ్యం స్వీక
టానికి నిరసనగా శ్రీ గోరా అనుయాయ
కొందరు కాస్సేపు నినాదాలు సాగించారు. ఆ
శ్రీ గోరాగారికి మాత్రం తన చర్యలో
లోపమీ కనబడలేదన్నరు. సూక్ష్మంగా ఆలో
దాంట్లో దోషమేమీ లేకపోయినా తాను సాగి
ఆందోళనకు అలాంటి చర్య ఏమాత్రం బల
పోగా ఆడంబరాలు పోవలె అనే నినాదాని
గుణంగా ఉన్నట్లు కనిపించకపోవటానికి
లేకపోలేదు. వ్యక్తిగత ద్వేషాలకు, ఇతర
లకు అతీతులైన శ్రీ గోరా గారు, ముఖ్య
గారు తన నివాసం ఇంకా ఏదో చిన్న
మార్చినప్పుడు ఆ భవనంలో వారి ఆతిథ్య
రించట మనేది ఎంతైనా సముచితంగా
అప్పుడు తన నినాదానికి బలం, ధ్యేయ
తనం చేకూరుతుంది. —ఐ. ఎల్.



Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty St. Madras-1. Chief Editor S. Sambhu Prasad.

